శ్రీరస్తు.

మహేశ్వరసేవకాగ్రేసర

…తేను నన్దికేశ్వర ప్రోక్తమయిన

# అభినయదర్పణము.



భరతశాస్త్రాభిలాషులగు నిఖిలరసికులకును ప్రియంబుగా

మహారాజరాజశ్రీ,

విడవలపాటి-సుబ్బరామయ్యసెట్టిగారి ప్రేరణమున

గ్రంథాంతరములయందలి బహువిషయములను జేర్చి,

తెనుఁగుతాత్పర్యములతోడ

భరతవిద్యాపాదన ప్రవీణులగు,

శ్రీమాన్

నీడామంగలం - తిరువేంకటాచార్యులవారిచే

రెండవమారు,

ముద్రింపింపఁబడియెను.

Madras:
AT THE EMPRESS OF INDIA PRESS.

1887.

విషయము తెలపడును కనుకను, నాయికానాయక వ్యాపారములు జ్ఞాన పదార్థమునందు గురుశిష్యులయొక్క సేవ్యసేవకభావబోధకములేగాని యితరములుకావు అని బ్రహ్మాదులచేత జెప్పబడియున్నది కనుకను, ధర్మార్థకామమోక్షములనెడి చతుర్విధ పురుషార్థములకును సాధకమును, సర్వోత్కృష్టమును దేవతాదికర్తృకమునునైన యీభరతశాస్త్రము ఎల్లవిధములచేతను మనకు పరిగ్రహణీయమును అభ్యసనీయమునగును. అనివిచారించి, కాలానుసారముగా దినేదినేక్షీణదశనొందుచున్న దీనినియథోచితప్రచారమునకు తేదలచి, భరతకర్తలలో నొకరగునందికేశ్వరునిచేత జెప్పడిన యభినయదర్పణము అను గ్రంథమును తొలుత ముద్రింపించిప్రకటించితిమి. అయినను అది యెల్లవారికి తేటతెల్లముగా దెలియక యుండుటంబట్టి॥ రా॥ శ్రీ॥ విడవలపాటి సుబ్బరామసెట్టిగారు అనువైశ్యశిఖామణి ప్రేరేపణవలన, పతాకాదిముఖ్యహస్తములస్వరూపములను దెలిపెడి చిత్రపుగురుతుల నాయాహస్తముల లక్షణశ్లోకములకు మొదటజేర్చియు, గ్రంథాంతరములందు చెప్పబడిన ఆయాహస్తముల యుత్పత్తికాలము, ఋషిదేవతాజాతి వర్ణములు, మొదలగువానిగూర్చియు, విశేషసంయుత హస్తములను, ప్రసిద్ధరాజుల హస్తములను, పుణ్యనదుల హస్తములను, అశ్వత్థాది వృక్షహస్తములను, సింహాదిమృగహస్తములను, హంసాదిపక్షి హస్తములను, నక్రాదిజలజంతుహస్తములను, శిరోభేదాద్యనేక విషయములను సంగ్రహించియు నిట్లుచేరిన నన్నూటయెనిమిది విషయములను తెలుపునట్టి శ్లోకములకు స్త్రీబాలకాదులకు గూడ తేటగా దెలియునట్లుసులభములైన మాటలతో తెనుగు తాత్పర్యమువ్రాసి రెండవమారు ముద్రింపించితిమి.

ఇదిగాక అభినయమునందు నవరసములుమొదలగువానిని దెలుపదగిన భరతరసప్రకరణమనెడి గ్రంథమును నిట్లేతెనుగు తాత్పర్యముతో మాచేతముద్రింపబడియున్నది.

మరియు దీనికిలక్ష్యభూతంబుగ భరతశాస్త్రప్రవీణులనురాజమన్నారు గుడిసభాపతయ్యగారు రచియించిన పదములను ఉపోద్ఘాతము, రాగము, తాళము, నాయిక, నాయకుడు, రసము, సంచారీభావము, అలంకారము, అందుల కుదాహరణముగా రసమంజరీశ్లోకమును క్రమముగాగూర్చి యచ్చువేయించి యున్నారము కనుక రసజ్ఞులగు సత్పురుషులెల్లను ఇంకనునిట్టికార్యములను జేయ మాకు ఇతోధికోత్సాహముకలిగింతురని నమ్ముచున్నారము. ఇట్లు,

శ్రేయోభిలాషి-నీడామంగలం-మాడభూషి-తిరువేంకటాచార్యులు.

శ్రీసంతానరామపరబ్రహ్మణేనమః.

# పీఠిక.

శ్రీమత్సకల భువనకర్తయైన శ్రియఃపతికిం బ్రియతమంబై నిఖిల రసికజనాహ్లాదభాజనంబై సర్వలోక వ్యాపకంబై విలసిల్లెడి భరతశాస్త్రము, శ్లో॥ శంభుర్గౌరీతథాబ్రహ్మామాధవో నందికేశ్వరః। దత్తిలో కోహళశ్చైవయాజ్ఞవల్క్యశ్చనారదః॥ హనూమాన్విఘ్నరాజశ్చ షణ్ముఖోథబృహస్పతిః। అర్జునో రావణశ్చైవ కన్యాబాణసుతాతథా॥ ఏతే భరతకర్తారో భువనేషుప్రకీర్తితాః॥ అనగా, శివుడు, పార్వతి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుడు, దత్తిలుడు- కోహళుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, ఆంజనేయుడు, విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు, బృహస్పతి, అర్జునుడు, రావణుడు, ఉషాకన్యక అనువారు భరతశాస్త్రకర్తలు అని లోకములయందు కొనియాడబడుచున్నారు. అనునీయర్థముగలప్రమాణశ్లోకములచేత వన్నెకెక్కియున్నది. అట్లుండియు ప్రకృతమునందుమనవారందరును అభినయవిద్యను సాధారణవిద్యలలో నొకటిగాదలచి యాదరింపకపోవుటయేగాక, అదికేవల పామరరంజక విద్యయనియు, శిష్టులకు పరిగ్రహణీయముకాదనియు, నాట్యప్రవర్తకులకేయభ్యసనీయమనియు నుల్లంఘించి యున్నారనుట యెల్లవారికిని తెల్లమేకదా? మోక్షసాధకమగు యోగశాస్త్రమును బోలినయీశాస్త్రము ఇట్టిదశకువచ్చుటకు నాయికానాయక వ్యాపారములను తదంగములయినయితరవిషయములను జూపిధర్మమునందు ప్రవృత్తి గలుగజేయుటయేగాక గూఢార్థప్రదర్శకమునై, ఆంగికాభినయమువలన రసికులగు నభిజ్ఞులకు నానందప్రదమై యట్టిరసికాగ్రగణ్యులచే నాయభినయవిద్యాప్రవీణులు సన్మానింపబడు విషయము కేవలనటీప్రేక్ష్యముగా నెన్నబడుటయు, జనులమనసులందు దోచువిషయములను అంగచలనాదులచే దెలిసికొనుటవలన కామవికారము కలుగుననుభ్రాంతియును కారణము లగుచున్నవి. అట్లుగాక సూక్ష్మదృష్టిచే చక్కగావిచారించునెడల ఈశాస్త్రము శృంగారరసాధిష్ఠాన దేవతయు లోకజనకుడునగు శ్రీకృష్ణదేవుని లీలావినోదములను ఆయారసానుభవములతోడనూహించి తెలిసికొనుటవలన బ్రహ్మజ్ఞానమును, అజ్ఞానమువలన చూడబడునవియన్నియు అస్థిరములయిన వ్యాపారములు అనుతాత్పర్యమును, ఆతాత్పర్యముచేత అట్టివ్యాపారములందు విరక్తియు, శాంతిదాంత్యాది విశిష్టగుణములు నుజనింపగానిత్యసుఖ ప్రదమయిన బ్రహ్మానందమును బొందించు నను

# విషయసూచిక.


| విషయసంఖ్య. | పుటసంఖ్య. |
|---|---|
| ౧ గ్రన్థానుపూర్వ్యమ్ ... | ౧ |
| ౨ నాట్యలక్షణమ్. | |
| ౩ నృత్తలక్షణమ్. | |
| ౪ నృత్యలక్షణమ్. | |
| ౫ లాస్యతాణ్డవభేదమ్. | |
| ౬ సభాలక్షణమ్. ... | ౩ |
| ౭ సభానాయకలక్షణమ్. ... | ౪ |
| ౮ మన్త్రిలక్షణమ్. | |
| ౯ రఙ్గలక్షణమ్. ... | ౫ |
| ౧౦ పాత్రలక్షణమ్. | |
| ౧౧ అపాత్రలక్షణమ్. | |
| ౧౨ కిఙ్కిణీలక్షణమ్. ... | ౬ |
| ౧౩ నటలక్షణమ్. | |
| ౧౪ పాత్రబహిఃప్రాణాః. | |
| ౧ అన్తఃప్రాణాః | |
| ౧౬ నీచనాట్యలక్షణమ్. ... | ౭ |
| ౧౭ నీచనాట్యదర్శనఫలమ్. | |
| ౧౮ నాట్యక్రమమ్. | |
| ౧౯ అభినయలక్షణమ్. | |
| ౨౦ అభినయవ్యుత్పత్తి. | |
| ౨౧ అఙ్గాః. ... | ౮ |
| ౨౨ ప్రత్యఙ్గాః. | |
| ౨౩ ఉపాఙ్గాః. ... | ౯ |
| శిరోభేదాః॥౯॥ | |
| ౨౪ సమశిరోలక్షణమ్. | |
| ౨౫ ఉద్వాహిత ,, | |
| ౨౬ అధోముఖ ,, ... | ౧౦ |
| ౨౭ ఆలోలిత ,, | |
| ౨౮ ధుత ,, | |
| ౨౯ కమ్పిత ,, | |
| ౩౦ పరావృత్త ,, ... | ౧౧ |
| ౩౧ ఉత్క్షిప్త ,, | |
| ౩౨ పరివాహిత ,, | |
| గ్రన్థాన్తరస్థశిరోభేదాః॥౨౪॥ | |
| ౩౪ ధుతశిరోలక్షణమ్. ... | ౧౨ |
| ౩౫ విధుత ,, | |
| ౩౬ ఆధూత ,, | |
| ౩౭ అవధూత ,, | |
| ౩౮ కమ్పిత ,, | |
| ౩౯ ఆకమ్పిత ,, | |
| ౪౦ ఉద్వాహిత ,, ... | ౧౩ |
| ౪౧ పరివాహిత ,, | |
| ౪౨ అఞ్చిత ,, | |
| ౪౩ నిహఞ్చిత ,, | |
| ౪౪ పరావృత్త ,, | |
| ౪౫ ఉత్క్షిప్త ,, ... | ౧౪ |
| ౪౬ అధోముఖ ,, | |
| ౪౭ లోలిత ,, | |
| ౪౮ తిర్యఙ్నతోన్నత ,, | |
| ౪౯ స్కన్ధానత ,, | |
| ౫౦ ఆరాత్రిక ,, | |
| ౫౧ సమ ,, ... | ౧౫ |
| ౫౨ పార్శ్వాభిముఖ ,, | |
| ౫౩ సౌమ్య ,, | |
| ౫౪ ఆలోలిత ,, | |
| ౫౫ తిరశ్చీన ,, | |
| ౫౬ ప్రకమ్పిత ,, | |
| ౫౭ సౌన్దర్య ,, | |
| దృష్టిభేదాః॥౩౮॥ | |
| ౫౮ సమదృష్టిలక్షణమ్. ... | ౧౬ |
| ౫౯ ఆలోకిత ,, | |
| ౬౦ సాచీ ,, | |
| ౬౧ ప్రలోకిత ,, ... | ౧౭ |
| ౬౨ నిమీలిత ,, | |

# విషయసూచిక.


| విషయసంఖ్యా. | పుటసంఖ్యా. |
|---|---|
| ౬౩ ఉల్లోకిత ,, | |
| ౬౪ అనువృత్త ,, | |
| ౬౫ అవలోకిత ,, | |
| గ్రన్థాన్తరస్థదృష్టిభేదాః॥౪౪॥ | |
| ౬౬ సమదృష్టిలక్షణమ్. ... | ౧౭ |
| ౬౭ ప్రలోకిత ,, | |
| ౬౮ స్నిగ్ధ ,, | |
| ౬౯ శృఙ్గార ,, | |
| ౭౦ ఉల్లోకిత ,, ... | ౧౮ |
| ౭౧ అద్భుత ,, | |
| ౭౨ కరుణా ,, | |
| ౭౩ విస్మయ ,, | |
| ౭౪ దృప్త ,, | |
| ౭౫ విషణ్ణ ,, | |
| ౭౬ భయఙ్కర ,, ... | ౧౯ |
| ౭౭ సాచీ ,, | |
| ౭౮ ద్రుత ,, | |
| ౭౯ వీర ,, | |
| ౮౦ రౌద్ర ,, | |
| ౮౧ దూర ,, | |
| ౮౨ ఇఙ్గిత ,, | |
| ౮౩ విలోకిత ,, ... | ౨౧ |
| ౮౪ వితర్కిత ,, | |
| ౮౫ శఙ్కిత ,, | |
| ౮౬ అభితప్త ,, | |
| ౮౭ అవిలోకిత ,, | |
| ౮౮ శూన్య ,, | |
| ౮౯ హృష్ట ,, ... | ౨౨ |
| ౯౦ ఉగ్ర ,, | |
| ౯౧ విభ్రాన్త ,, | |
| ౯౨ శాన్త ,, | |
| ౯౩ మీలిత ,, | |
| ౯౪ సూచన ,, | |
| ౯౫ లజ్జిత ,, | |
| ౯౬ మలిన ,, | |
| ౯౭ త్రస్త ,, ... | ౨౩ |
| ౯౮ మ్లాన ,, | |

| విషయసంఖ్యా. | పుటసంఖ్యా. |
|---|---|
| ౯౯ ముకుళ ,, | |
| ౧౦౦ కుఞ్చిత ,, | |
| ౧౦౧ ఆకాశ ,, | |
| ౧౦౨ అర్ధముకుళ ,, | |
| ౧౦౩ అనువృత్త ,, | |
| ౧౦౪ విప్లుత ,, | |
| ౧౦౫ జిహ్మ ,, ... | ౨౪ |
| ౧౦౬ వికోశ ,, | |
| ౧౦౭ మదిర ,, | |
| ౧౦౮ హృద్య ,, | |
| ౧౦౯ లలిత ,, | |
| గ్రన్థాన్తరస్థభ్రూభేదాః॥౬॥ | |
| ౧౧౦ సహజభ్రూలక్షణమ్... | ౨౫ |
| ౧౧౧ పతితభ్రూ ,, | |
| ౧౧౨ ఉత్క్షిప్త ,, | |
| ౧౧౩ చతుర ,, | |
| ౧౧౪ రేచిత ,, | |
| ౧౧౫ కుఞ్చిత ,, | |
| గ్రీవాభేదాః॥౪॥ | |
| ౧౧౬ సున్దరీగ్రీవాలక్షణమ్... | ౨౬ |
| ౧౧౭ తిరశ్చీన ,, | |
| ౧౧౮ పరివర్తిత ,, | |
| ౧౧౯ ప్రకమ్పిత ,, | |
| హస్తప్రాణాః॥౧౨॥ | |
| ౧౨౦ ప్రసారణప్రాణలక్షణమ్... | ౨౭ |
| ౧౨౧ కుఞ్చిత ,, | |
| ౧౨౨ రేచిత ,, | |
| ౧౨౩ పుఙ్ఖిత ,, | |
| ౧౨౪ అపవేష్టిత ,, | |
| ౧౨౫ ప్రేరిత ,, | |
| ౧౨౬ ఉద్వేష్టిత ,, | |
| ౧౨౭ వ్యావృత్తి ,, | |
| ౧౨౮ పరివృత్తి ,, | |
| ౧౨౯ సఙ్కేత ,, ... | ౨౮ |
| ౧౩౦ చిహ్న ,, | |
| ౧౩౧ పదార్థటీక ,, | |

| విషయసంఖ్య. | | | పుటసంఖ్య. |
|---|---|---|---|
| **అసంయుతహస్తాః ౩౧** | | | |
| ౧౩౨ పతాకహస్తలక్షణమ్. | | ... | ౨౯ |
| ౧౩౩ త్రిపతాక | ,, | ... | ౩౦ |
| ౧౩౪ అర్ధపతాక | ,, | ... | ౩౧ |
| ౧౩౪ కర్తరీముఖ | ,, | ... | ౩౨ |
| ౧౩౫ మయూర | ,, | ... | ౩౩ |
| ౧౩౬ అర్ధచన్ద్ర | ,, | | |
| ౧౩౭ అరాళ | ,, | ... | ౩౪ |
| ౧౩౮ శుకతుణ్డ | ,, | ... | ౩౫ |
| ౧౩౯ ముష్టి | ,, | | |
| ౧౪౦ శిఖర | ,, | ... | ౩౬ |
| ౧౪౧ కపిత్థ | ,, | ... | ౩౭ |
| ౧౪౨ కటకాముఖ | ,, | ... | ౩౮ |
| ౧౪౩ సూచీ | ,, | ... | ౩౯ |
| ౧౪౪ చన్ద్రకళ | ,, | ... | ౪౦ |
| ౧౪౫ కోశ | ,, | | |
| ౧౪౬ సర్పశీర్ష | ,, | ... | ౪౧ |
| ౧౪౭ మృగశీర్ష | ,, | ... | ౪౨ |
| ౧౪౮ సింహముఖ | ,, | ... | ౪౩ |
| ౧౪౯ లాఙ్గూల | ,, | | |
| ౧౫౦ సోలపద్మ | ,, | ... | ౪౪ |
| ౧౫౧ చతుర | ,, | ... | ౪౫ |
| ౧౫౨ భ్రమర | ,, | ... | ౪౬ |
| ౧౫౩ హంసాస్య | ,, | | |
| ౧౫౪ హంసపక్ష | ,, | ... | ౪౭ |
| ౧౫౫ సందంశ | ,, | ... | ౪౮ |
| ౧౫౬ ముకుళ | ,, | ... | ౪౯ |
| ౧౫౭ తామ్రచూడ | ,, | ... | ౫౦ |
| ౧౫౮ త్రిశూల | ,, | | |
| ౧౫౯ ఊర్ణనాభ | ,, | ... | ౫౧ |
| ౧౬౦ బాణ | ,, | | |
| ౧౬౧ అర్ధసూచి | ,, | | |
| **సంయుతహస్తాః ౨౪** | | | |
| ౧౬౨ అఞ్జలిహస్తలక్షణమ్. | | ... | ౫౨ |
| ౧౬౩ కపోత | ,, | | |
| ౧౬౪ కర్కట | ,, | ... | ౫౩ |
| ౧౬౫ స్వస్తిక | ,, | | |
| ౧౬౬ డోలా | ,, | ... | ౫౪ |
| ౧౬౭ పుష్పపుట | ,, | | |
| ౧౬౮ ఉత్సఙ్గ | ,, | | |
| ౧౬౯ శివలిఙ్గ | ,, | ... | ౫౫ |
| ౧౭౦ కటకావర్ధన | ,, | | |
| ౧౭౧ కర్తరీస్వస్తిక | ,, | | |
| ౧౭౨ శకట | ,, | ... | ౫౬ |
| ౧౭౩ శఙ్ఖ | ,, | | |
| ౧౭౪ చక్ర | ,, | | |
| ౧౭౫ సమ్పుట | ,, | | |
| ౧౭౬ పాశ | ,, | | |
| ౧౭౭ కీలక | ,, | | |
| ౧౭౮ మత్స్య | ,, | ... | ౫౭ |
| ౧౭౯ కూర్మ | ,, | | |
| ౧౮౦ వరాహ | ,, | | |
| ౧౮౧ గరుడ | ,, | | |
| ౧౮౨ నాగబన్ధ | ,, | | |
| ౧౮౩ ఖట్వా | ,, | | |
| ౧౮౪ భేరుణ్డ | ,, | ... | ౫౮ |
| ౧౮౫ అవహిత్థ | ,, | | |
| **గ్రన్థాన్తరస్థసంయుతహస్తాః ౨౬** | | | |
| ౧౮౬ గజదన్తహస్తలక్షణమ్. | | | |
| ౧౮౭ చతురశ్ర | ,, | | |
| ౧౮౮ తిలముఖ | ,, | ... | ౫౯ |
| ౧౮౯ స్వస్తిక | ,, | | |
| ౧౯౦ ఆవిద్ధవక్ర | ,, | | |
| ౧౯౧ రేచిత | ,, | ... | ౬౦ |
| ౧౯౨ నితమ్బ | ,, | | |
| ౧౯౩ లతా | ,, | | |
| ౧౯౪ పక్షవఞ్చిత | ,, | | |
| ౧౯౫ పక్షప్రద్యోత | ,, | ... | ౬౧ |
| ౧౯౬ గరుడపక్ష | ,, | | |
| ౧౯౭ నిషేధ | ,, | | |
| ౧౯౮ మకర | ,, | | |
| ౧౯౯ వర్ధమాన | ,, | ... | ౬౨ |
| ౨౦౦ ఉద్వృత్త | ,, | | |
| ౨౦౧ విప్రకీర్ణ | ,, | | |

| విషయసంఖ్య. | | | పుటసంఖ్య. |
|---|---|---|---|
| ౨౦౨ అరాళకటకాముఖ | | | |
| ౨౦౩ సూచ్యాస్య | ,, | | |
| ౨౦౪ అర్ధరేచిత | ,, | ... | ౬౩ |
| ౨౦౫ కేశబన్ధ | ,, | | |
| ౨౦౬ ముష్టిస్వస్తిక | ,, | | |
| ౨౦౭ నళినీపద్మకోశ | ,, | | |
| ౨౦౮ ఉద్వేష్టితాలపద్మ | | ... | ౬౪ |
| ౨౦౯ ఉల్బణ | ,, | | |
| ౨౧౦ లాలిత | ,, | | |
| అన్యగ్రం॥ సంయుతహస్తాః॥౨౩॥ | | | |
| ౨౧౧ విప్రకీర్ణహస్తలక్షణమ్. | | | |
| ౨౧౨ గజదన్త | ,, | | |
| ౨౧౩ తాలముఖ | ,, | ... | ౬౫ |
| ౨౧౪ సూచీవిద్ధ | ,, | | |
| ౨౧౫ పల్లవ | ,, | | |
| ౨౧౬ నితమ్బ | ,, | | |
| ౨౧౭ కేశబన్ధ | ,, | ... | ౬౬ |
| ౨౧౮ లతా | ,, | | |
| ౨౧౯ ద్విరద | ,, | | |
| ౨౨౦ ఉద్వృత | ,, | | |
| ౨౨౧ సంయమ | ,, | ... | ౬౭ |
| ౨౨౨ ముద్రా | ,, | | |
| ౨౨౩ అజముఖ | ,, | | |
| ౨౨౪ అర్ధముకుళ | ,, | | |
| ౨౨౫ రేచిత | ,, | ... | ౬౮ |
| ౨౨౬ కుశల | ,, | | |
| ౨౨౭ పక్షవతీ | ,, | | |
| ౨౨౮ తిలక | ,, | | |
| ౨౨౯ ఉత్థానవఞ్చిత | ,, | ... | ౬౯ |
| ౨౩౦ వర్ధమాన | ,, | | |
| ౨౩౧ జ్ఞాన | ,, | | |
| ౨౩౨ వైష్ణవ | ,, | | |
| ౧౩౩ ఖణ్డచతుర | ,, | ... | ౭౦ |
| ౨౩౪ అర్ధచతుర | ,, | | |
| ౨౩౫ లీనముద్రా | ,, | | |
| బాన్ధవ్యహస్తాః॥౧౧॥ | | | |

| విషయసంఖ్య. | | | పుటసంఖ్య. |
|---|---|---|---|
| ౨౩౬ దమ్పతీహస్తలక్షణమ్. | | | |
| ౨౩౭ మాతృ | ,, | | |
| ౨౩౮ పితృ | ,, | ... | ౭౧ |
| ౨౩౯ శ్వశ్రూ | ,, | | |
| ౨౪౦ శ్వశుర | ,, | | |
| ౨౪౧ భర్తృభ్రాతృ | ,, | | |
| ౨౪౨ ననన్దా | ,, | | |
| ౨౪౩ జ్యేష్ఠకనిష్ఠభ్రాతృ | | | |
| ౨౪౪ స్నుషా | ,, | ... | ౭౨ |
| ౨౪౫ భర్తృ | ,, | | |
| ౨౪౬ సపత్నీ | ,, | | |
| దేవతాహస్తాః॥౧౬॥ | | | |
| ౨౪౭ బ్రహ్మాహస్తలక్షణమ్. | | | |
| ౨౪౮ శమ్భు | ,, | | |
| ౨౪౯ విష్ణు | ,, | ... | ౭౩ |
| ౨౫౦ సరస్వతీ | ,, | | |
| ౨౫౧ పార్వతీ | ,, | | |
| ౧౫౨ లక్ష్మీ | ,, | | |
| ౨౫౩ విఘ్నేశ్వర | ,, | | |
| ౨౫౪ షణ్ముఖ | ,, | | |
| ౭౫౫ మన్మథ | ,, | | |
| ౨౫౬ ఇన్ద్ర | ,, | | |
| ౨౫౭ అగ్ని | ,, | ... | ౭౪ |
| ౨౫౮ యమ | ,, | | |
| ౨౫౯ నైఋతి | ,, | | |
| ౨౬౦ వరుణ | ,, | | |
| ౨౬౧ వాయు | ,, | | |
| ౨౬౨ కుబేర | ,, | | |
| నవగ్రహాహస్తాః॥౧౪॥ | | | |
| ౨౬౩ సూర్యహస్తలక్షణమ్. | | | |
| ౨౬౪ చన్ద్ర | ,, | ... | ౭౫ |
| ౨౬౫ అఙ్గారక | ,, | | |
| ౨౬౬ బుధ | ,, | | |
| ౨౬౭ బృహస్పతి | ,, | | |
| ౨౬౮ శుక్ర | ,, | | |
| ౨౬౯ శనైశ్చర | ,, | | |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౨౭౦ | రాహు ,, | |
| ౨౭౧ | కేతు ,, ... | ౭౬ |
| | దశావతారహస్తాః॥౧౦॥ | |
| ౨౭౨ | మత్స్యావతారహస్తలక్షణమ్. | |
| ౨౭౩ | కూర్మావతార ,, | |
| ౨౭౪ | వరాహావతార ,, | |
| ౨౭౫ | నరసింహావతార ,, | |
| ౨౭౬ | వామనావతార ,, | |
| ౨౭౭ | పరశురామావతార ,, ... | ౭౭ |
| ౨౭౮ | రఘురామావతార ,, | |
| ౨౭౯ | బలరామావతార ,, | |
| ౨౮౦ | కృష్ణావతార ,, | |
| ౨౮౧ | కల్క్యవతార ,, | |
| ౨౮౨ | రాక్షసహస్తలక్షణమ్. | |
| | చతుర్వర్ణహస్తాః॥౪॥ | |
| ౨౮౩ | బ్రాహ్మణహస్తలక్షణమ్. | |
| ౨౮౪ | క్షత్రియ ,, ... | ౭౮ |
| ౨౮౫ | వైశ్య ,, | |
| ౨౮౬ | శూద్ర ,, | |
| | గ్ర॥ప్రసిద్ధరాజహస్తాః॥౨౮॥ | |
| ౨౮౭ | హరిశ్చన్ద్రహస్తలక్షణమ్. ... | ౭౯ |
| ౨౮౮ | నలమహారాజ ,, | |
| ౨౮౯ | పురుమహారాజ ,, | |
| ౨౯౦ | కుత్స ,, | |
| ౨౯౧ | పురూరవ ,, | |
| ౨౯౨ | సగర ,, | |
| ౨౯౩ | దిలీప ,, | |
| ౨౯౪ | అమ్బరీష ,, | |
| ౨౯౫ | శిబి ,, | |
| ౨౯౬ | కార్తవీర్య ,, | |
| ౨౯౭ | రావణ ,, | |
| ౨౯౮ | ధర్మరాజ ,, | |
| ౨౯౯ | అర్జున ,, | |
| ౩౦౦ | భీమసేన ,, | |
| ౩౦౧ | శైబ్య ,, | |
| ౩౦౨ | నకుల ,, | |
| ౩౦౩ | సహదేవ ,, | |
| ౩౦౪ | నహుష ,, | |
| ౩౦౫ | యయాతి ,, | |
| ౩౦౬ | భగీరథ ,, | |
| ౩౦౭ | మాన్ధాతృ ,, | |
| ౩౦౮ | మరుత్త ,, | |
| ౩౦౯ | రఘుమహారాజ ,, | |
| ౩౧౦ | దశరథ ,, | |
| ౩౧౧ | రామ ,, | |
| ౩౧౨ | భరత ,, | |
| ౩౧౩ | లక్ష్మణ ,, | |
| ౩౧౪ | శత్రుఘ్న ,, | |
| | సముద్రాః॥౭॥ | |
| ౩౧౫ | లవణసముద్రహస్తమ్. ... | ౮౦ |
| ౩౧౬ | ఇక్షుసముద్ర ,, | |
| ౩౧౭ | సురా ,, | |
| ౩౧౮ | సర్పి ,, | |
| ౩౧౯ | దధి ,, | |
| ౩౨౦ | క్షీర ,, ... | ౮౧ |
| ౩౨౧ | శుద్ధోదక ,, | |
| | పుణ్యనదీహస్తాః॥౧౪॥ | |
| ౩౨౨ | గఙ్గానదీహస్తమ్. | |
| ౩౨౩ | యమునా ,, | |
| ౩౨౪ | కృష్ణవేణీ ,, | |
| ౩౨౫ | కావేరీ ,, | |
| ౩౨౬ | సరస్వతీ ,, | |
| ౩౨౭ | నర్మదా ,, | |
| ౩౨౮ | తుఙ్గభద్రా ,, | |
| ౩౨౯ | శరావతీ ,, | |
| ౩౪౦ | వేత్రవతీ ,, | |
| ౩౪౧ | చన్ద్రభాగా ,, | |
| ౩౪౨ | సరయూ ,, | |
| ౩౪౩ | భీమరథీ ,, | |
| ౩౪౪ | సువర్ణముఖీ ,, | |
| ౩౪౫ | పాపనాశనీ ,, | |
| ౩౪౬ | ఊర్ధ్వలోకహస్తమ్ ... | |
| ౩౪౭ | అధోలోకహస్తమ్ | |
| | వృక్షహస్తాః॥౨౩॥ | |

విషయసంఖ్య. పుటసంఖ్య.

౩౪౮ అశ్వత్థహస్తమ్
౩౪౯ కదలీ ,,
౩౫౦ నారఙ్గ-లికుచ ,,
౩౫౧ పనస-బిల్వ ,,
౩౫౨ పున్నాగ ,,
౩౫౩ మన్దార-వకుళ ,, ... ౮౩
౩౫౪ వట-అర్జున ,,
౩౫౫ పాటలీ-హిన్తాల ,,
౩౫౬ పూగ ,,
౩౫౭ చమ్పక ,,
౩౫౮ ఖదిర ,,
౩౫౯ శమీ ,,
౩౬౦ అశోక ,,
౩౬౧ సిన్దువార ,, ... ౮౪
౩౬౨ ఆమలక ,,
౩౬౩ కురవక ,,
౩౬౪ కపిత్థ ,,
౩౬౫ కేతకీ ,,
౩౬౬ శింశపా ,,
౩౬౭ నిమ్బ-సాల ,,
౩౬౮ పారిజాత ,,
౩౬౯ తిన్త్రిణీ-జమ్బూ ,, ... ౮౫
౩౭౦ పాలాశ-రసాల ,,

సింహాదిమృగహస్తాః॥ ౨౧॥

౩౭౧ సింహహస్తమ్. ,,
౩౭౨ వ్యాఘ్ర ,,
౩౭౩ సూకర ,,
౩౭౪ కపి ,,
౩౭౫ భల్లూక ,, ... ౮౬
౩౭౬ మార్జార ,,
౩౭౭ చమరీమృగ ,,
౩౭౮ గోధా ,,
౩౭౯ శల్యమృగ ,,
౩౮౦ కురఙ్గ ,,
౩౮౧ కృష్ణసార ,, ... ౮౭
౩౮౨ గోకర్ణ ,,
౩౮౩ మూషిక ,,
౩౮౪ గిరికా ,,
౩౮౫ శశ ,,
౩౮౬ వృశ్చిక ,,
౩౮౭ శునక ,,
౩౮౮ ఉష్ట్ర ,, ... ౮౮
౩౮౯ అజ ,,
౩౯౦ వృషభ ,,
౩౯౧ ధేను ,,

పక్షిహస్తాః॥ ౨౧॥

౩౯౨ పారావతహస్తమ్
౩౯౩ కపోత ,, ... ౮౯
౩౯౪ శశాదన ,,
౩౯౫ ఉలూక ,,
౩౯౬ గణ్డభేరుణ్డ ,,
౩౯౭ చాతక ,,
౩౯౮ కుక్కుట ,,
౩౯౯ పిక ,,
౪౦౦ వాయస ,,
౪౦౧ కురర ,, ... ౯౦
౪౦౨ శుక ,,
౪౦౩ సారస ,,
౪౦౪ బక ,,
౪౦౫ క్రౌఞ్చ ,,
౪౦౬ ఖద్యోత ,,
౪౦౭ భ్రమర ,, ... ౯౧
౪౦౮ మయూర ,,
౪౦౯ హంస ,,
౪౧౦ చక్రవాక ,,
౪౧౧ కోయష్టిక ,,
౪౧౨ వ్యాళి ,,

జలజన్తుహస్తాః॥ ౧౩॥

౪౧౩ భేకహస్తమ్.
౪౧౪ కుళీర ,, ౯౨
౪౧౫ రక్తపాయి ,,
౪౧౬ నక్ర ,,
౪౧౭ డుణ్డుభ ,,

శుభమస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# నన్దికేశ్వరప్రోక్తాఽభినయదర్పణమ్.

---

## ఇష్టదేవతా ప్రార్థనా.

శ్లో॥ ఆఙ్గికంభువనంయస్య వాచికంసర్వవాఙ్మయమ్।
ఆహార్యంచన్ద్రతారాఽది తన్నుమస్సాత్త్వికంశివమ్॥

తా॥ లోకము, ఏశివునియొక్క అఙ్గాభినయమో; వాఙ్మయరూపములైనవి యెల్ల ఏశివుని యొక్క వాచికాఽభినయమో; చంద్రతారాదులు ఏశివునియొక్క ఆహార్యాఽభినయమో; అటువంటి సత్త్వప్రధానుడైన శివునికి నమస్కరించెదను.

ఇంద్రఉవాచ॥ శ్లో॥ కళ్యాణాఽచలవాసాయకరుణారససిన్ధవే।
నమోఽస్తునందికేశాయ నాట్యశాస్త్రాఽర్థదాయినే॥

తా॥ కైలాసపర్వతనిలయుడును దయాసముద్రుడును నాట్యశాస్త్రార్థప్రదుడునైన నందికేశ్వరునికి నమస్కరించెదను.

నన్దికేశ్వరఉవాచ॥ శ్లో॥ స్వాగతంతేసురాఽధీశకుశలంత్రిదివౌకసామ్।
కిమర్థమాగతంబ్రూహిభవతామమసన్నిధౌ॥

తా॥ ఓయింద్రుడా? నీరాకమంచిది, స్వర్గవాసులందరును క్షేమమా? నాదగ్గరకేమిటికివచ్చితివి చెప్పుము.

ఇన్ద్రఉవాచ॥ శ్లో॥ త్వదీయకృపయాపూర్వం నాట్యశాలామలఙ్కృతామ్।
త్వదీయనర్తకస్సోఽయంత్వత్కృపా మభివాఞ్ఛతి॥

తా॥ ఓయినందికేశ్వరుడా ? తొల్లినీకృపారసముచే నలంకరింపబడిన నర్తనశాలాఽధిపతియైన యానీదాసుడగు నర్తకుడు నీదయను గోరివచ్చియున్నాడు.

నన్దికేశ్వరఉవాచ॥ శ్లో॥ మయావిధేయంకింతస్యవదవాసవతత్త్వతః॥

తా॥ ఓయింద్రుడా ! వానికి నాచేతజేయదగినది యేమున్నది-వాని నిజముగ జెప్పుము.

ఇన్ద్రఉవాచ॥ శ్లో॥ దైతేయనాట్యశాలాయాంవర్తకోనటశేఖరః।
తంవిజేతుమయంనాట్య వినోదైఃక్రమవేదిభిః॥
భవద్విరచితంగ్రంథం భరతాఽర్ణవమిచ్ఛతి॥

తా॥ అసురనాట్యశాలయందు నటశేఖరుడనెడునటుడుగలడు - వానినాట్యక్రమములను దేటపరచు విన్యాసములచే జయించుటకు మీచేరచియింపబడిన భరతార్ణవమనెడుగ్రంథము నపేక్షించుచున్నాడు.

నన్దికేశ్వరఉవాచ॥ శ్లో॥ చతుస్సహస్రసంఖ్యాతైర్గ్రన్థైశ్చపరిపూరితమ్।
భరతాఽర్ణవశాస్త్రాస్తు సుమతేశ్రుణుసాదరమ్॥

తా॥ ఓయింద్రుడా నాలుగువేలగ్రంథములుగల భరతార్ణవమనెడు గ్రంథమును జెప్పెదను-నీవత్యంతప్రీతిగలవాడవై వినుము.

ఇన్ద్రఉవాచ॥ శ్లో॥ నన్దికేశదయామూర్తేవిస్తరాత్సంవిహాయమే।
సంక్షిప్యనాట్యశాస్త్రార్థంక్రమపూర్వముదాహర॥

తా॥ దయామూర్తివైన నందికేశ్వరుడా! ఈగ్రంథమునుసంగ్రహించినాట్యశాస్త్రి సూక్ష్మాఽర్థములను యథాక్రమముగా నాకుజెప్పుము.

నన్దికేశ్వరఉవాచ॥ శ్లో॥ వదామిసుమతేదేవసంక్షిప్యభరతాఽర్ణమ్।
దర్పణాఖ్యమిదంసూక్ష్మమవధారయసాదరమ్॥

తా॥ ఓయింద్రుడా! భరతాఽర్ణవమనెడుగ్రంథమును సంగ్రహించి కొంచెముగా జేయబడినదర్పణమనునీగ్రంథమును జెప్పెదను-దీనినాదరణగలవాడవైవినుము.

శ్లో॥ నాట్యంనృత్తంనృత్యమితిమునిభిఃపరికీర్తితమ్॥

తా॥ ఓయింద్రుడా? ఇది ఋషులచే నాట్యము నృత్తము నృత్యము అనిమూడు విధములవిభాగించి జెప్పబడియున్నది.

శ్లో॥ నాట్యంతన్నాటకేష్వేన యోజ్యంపూర్వకథాయుతమ్॥

తా॥ నాట్యమనునది యెట్టిదనగా-నాటకమునందు పూర్వకథతోడ వినియోగింపబడునది-

శ్లో॥ రసభావవిహీనంతు నృత్తమిత్యభీధియతే॥

తా॥ నృత్తమనగా-రసభావములచేత తక్కువపడినదై తాళలయానుగుణ్యమై యుండునది.

శ్లో॥ రసభావవ్యఞ్జకాఽదియుతంనృత్యమితీర్యతే॥

తా॥ నృత్యమనగా-రసము, భావము, మొదలగువానితోగూడియుండునది.

శ్లో॥ ఏతత్త్రియంద్విధాభిన్నంలాస్యతాణ్డవసంజ్ఞికమ్॥

తా॥ ఈనాట్యనృత్తనృత్యములు మూడును మరలలాస్యమనియు, తాండవమనియు రెండువిధములుగా విభజింపబడియున్నవి.

శ్లో॥ సుకుమారంతుతల్లాస్య ముత్థానంతాణ్డవంవిదుః॥

తా॥ కూర్చుండియభినయించునట్టివి యెల్లనులాస్యమనియు, నిలిచియభినయించునవి యెల్లనుతాండవమనియు తెలియదగినది.

శ్లో॥ ద్రష్టవ్యేనాట్యనృత్యేచ పర్వకాలేవిశేషతః॥

తా॥ నాట్యనృత్యములురెండును పర్వకాలములయందు తప్పకచూడదగినవి. అది శ్రేయస్కరమనుట.

శ్లో॥ నృత్యంతత్రనరేన్ద్రాణా మభిషేకేమహోత్సవే । యాత్రాయాం దేవయాత్రాయాంవివాహేప్రియసఙ్గమే । నగరాణామగారాణాం ప్రవేశేపుత్రజన్మని । శుభాఽర్థిభిఃప్రయోక్తవ్యం మాఙ్గల్యంసర్వకర్మసు॥

తా॥ మీదజెప్పబడినమాటలో మూడవదియగు నృత్యము మేలుకోరినవారిచే పట్టాభిషేకము, తిరునాళ్ల, ఊరేగింపు, దేవునియూరేగింపు, పెండ్లి, మిత్రసభ. పురప్రవేశము, గృహప్రవేశము, పుత్రోత్సవము వీనియందుజరుపవలయును.

శ్లో॥ ఋగ్యజుస్సామ వేదేభ్యోవేదాచ్చాఽథర్వణాత్క్రమాత్ । పాఠ్యం చాఽభినయంగీతంరసాన్ సఙ్గృహ్యపద్మభూః ॥ వ్యరీరచచ్ఛాస్త్రమిదం ధర్మకామాఽదిసిద్ధిదమ్ । దుఃఖాఽర్తి శోకనిర్వేద ఖేదవిచ్ఛేద సాధనమ్ ॥ అపిబ్రహ్మపరానన్దాదిదమప్యధికంధ్రువమ్॥

తా॥ పూర్వకాలమునందు బ్రహ్మదేవుడు ఋగ్వేదమునుండి పాఠ్యమును, యజుర్వేదమునుండి యభినయమును, సామవేదమునుండి గానమును, అథర్వణవేదమునుండి రసములను, సంగ్రహించి యీశాస్త్రమును చేసెను. ఇదిధర్మార్థకామమోక్షములను ఇచ్చునదియు కాక దుఃఖము, ఆర్తి, శోకము, నిర్వేదము, ఖేదము, మొదలైనవానిని పోగొట్టునదియు అగును. మరియు బ్రహ్మానందమునకంటె ఎక్కువయానందమును గలుగజేయునది. కలహ, వస్తునాశ, ప్రయత్నభంగాదులచేత గలుగునది దుఃఖము. ఇతరులుచేయు హింసాదులచేత గలుగునదిఆర్తి. మరణముమొదలగువానిచేత సంభవించునది శోకము. తనకిష్టవస్తుప్రాప్తికానపుడును సాహసహీనతతోచినపుడును కలుగునది నిర్వేదము. గతశోకకృత్యములను తలచినపుడు పుట్టునదిఖేదము.

శ్లో॥ తత్రనృత్యం మహారాజసభాయాం కల్పయేత్సదా॥

•తా॥ ఈమీదజెప్పిన మాటయందును నృత్యము మహారాజసభలో నెల్లప్పుడును సంతోషముతో నడపుచుండవలయును.

## సభాలక్షణమ్.

శ్లో॥ సభాకల్పతరుర్భాతి వేదశాఖోపశోభితః । శాస్త్రపుష్పసమాకీర్ణో విద్వద్భ్రమరసంయుతః॥

తా॥ సభయనెడికల్పవృక్షము వేదములనెడి కొమ్మలచేత ప్రకాశించునదియు, శాస్త్రములనెడి పుష్పములచేత నిండుకొన్నదియును, విద్వాంసులనెడి తుమ్మెదలతోగూడినదియునై వెలుగుచున్నది.

శ్లో॥ సత్యాచార సభాగుణోజ్జ్వలసభాసద్ధర్మకీర్తిస్సభా । వేదాలఙ్కృత రాజపూజితసభా వేదాన్త వేద్యాసభా।వీణా వాణివిశేషలక్షిత సభావిఖ్యాతవీరా సభా।రాజద్రాజకుమార శోభితసభారాజత్ప్రకాన్తిస్సభా॥

తా॥ సత్యముతప్పక నడపువారుగలదియును, సద్గుణములచే మెరయునదియును, మంచిదర్శనమునుకీర్తియుగలిగినదియు, వేదముచదివినరాజులచేతపూజింపబడినదియు, వేదాంతము నెరిగినదియు, వీణాగానము, వాచికగానము మొదలగువానితో గూడినది

యు, ప్రసిద్ధపీఠములు గలదియు, తేజస్సుచేత వెలుగుచున్న రాజకుమారులచేత ప్రకాశించు నదియు, ప్రకాశించుచున్న కాంతిగలదియు సభ అనబడును. అనగా సభయనునది యి న్నిలక్షణములును గలదయి యుండవలయుననుట.

శ్లో॥ విద్వాంసఃకవయోభట్టాః గాయకాఃపరిహాసకాః ।
ఇతిహాసపురాణజ్ఞాస్సభాసప్తాఙ్గలక్షణమ్॥

తా॥ విద్వాంసులు, కవులు, పెద్దలు, పాఠకులు, పరిహాసకులు, ఇతిహాసములను తెలిసినవారు, పురాణములను తెలిసినవారు అనునవియేడును సభయొక్క యేడుఅంగము లు అగును.

## సభానాయకలక్షణమ్.

శ్లో॥ శ్రీమాన్ధీమాన్వివేకీవితరణనిపుణోగానవిద్యాప్రవీణః । సర్వజ్ఞఃకీర్తి శాలీసరసగుణయుతో హావభావేష్వభిజ్ఞః । మాత్సర్యాద్యైర్విహీ నఃప్రకృతిహితసదాచారశీలోదయాళుః । ధీరోదాత్తఃకలావా న్నృపనయచతురోసౌసభానాయకస్స్యాత్॥

తా॥ సంపదగలవాడును, మంచిబుద్ధిమంతుడును, యుక్తాయుక్తవివేకముగల వాడును, దానశీలుడును, గానవిద్యయందు నేర్పుగలవాడును, అన్నియుతెలిసినవా డును, కీర్తిచేత ఒప్పినవాడును, సరసగుణములుగలవాడును, హావభావములయందలి తె లివిగలవాడును, మాత్సర్యాది దుర్గుణములులేనివాడును, ఆయాకాలమునకుదగిన మం చినడవళ్లనెరిగినవాడును, దయగలవాడును, ధీరోదాత్తుడును, విద్వాంసుడును, రా జనీతియందు చతురుడును, అగువాడు సభానాయకుడు అగును. బుద్ధియనగా అప్పటికి తోచునట్టిది॥ శ్లో॥ గ్రీవారేచకసంయుక్తో భ్రూనేత్రాదివిలాసకృత్ । భావఈషత్ప్ర కాశోయస్సహావఇతికథ్యతే॥ అనగా మనోగతభావమును సంజ్ఞమొదలగు వానిచేదెలు పుటహావము॥ శ్లో॥ నిర్వికారస్య చిత్తస్యభావస్స్యాదతివిక్రియా॥ వికారరహిత చిత్తము నకునత్యంతవికారముకలుగుటభావము॥ శ్లో॥ గమ్భీరస్సారసమ్పన్నః కృపావానవికత్థ నః । పరకీయగుణగ్రాహీధీరోదాత్తస్సకథ్యతే॥ గంభీరుడునుఅనగా కోపసంతోషము లను అభినయాదికృత్యములచేదెలుపునట్టివాడును, దేహబలము గలవాడును, పరులదుఃఖ మునుజూచి యోర్వలేనివాడును, తన్నుదాబొగడుకొననివాడును, ఇతరులగుణములను తెలిసికొనువాడు నైనవాడు ధీరోదాత్తనాయకుడు.

## మన్త్రిలక్షణమ్.

శ్లో॥ ఏధానస్థిరభాషిణోగుణపరాశ్శ్రీమద్యశోలమ్పటాః । భావజ్ఞాగుణదోష భేదనిపుణాశ్శృంగారలీలారతాః । మధ్యస్థానయకోవిదాస్సహృద యాస్సత్పణ్డితాభాన్తితే । భూపాభేదవిచక్షణాస్సుకవయోయస్యప్ర భోర్మన్త్రిణః॥

తా॥ మాటనిలుకడగలవారును, సద్గుణములను గ్రహించువారును, భావము తెలి సికొనువారును, గుణదోషములను పరిశీలించుటయందు సమర్థులును, శృంగారలీలాసక్త లును, స్వజనపక్షపాతములేనివారును, నీతిపరిజ్ఞానులును, మంచిమనస్సుగలవారును,

మంచిపండితులును, రాజులయొక్క అభేదవర్తనమునందు చతురులును, పండితులును, అగుమంత్రులు ఏప్రభువుదగ్గరగలరోయాప్రభువున్నతిఁబొందఁగలవాఁడు.

## రఙ్గలక్షణమ్.

శ్లో॥ ఏవంవిధస్సభానాథఃప్రాఙ్ముఖోనివసేత్సదా।
వసేయుర్హిపార్శ్వతస్తస్యకవిమన్త్రిసుహృజ్జనాః॥

తా॥ ఇట్లుసభానాయకుఁడు సంతోషముతో తూర్పుముఖముగా కూర్చుండఁగా వానిప్రక్కలను, కవి, మంత్రి, సుహృజ్జనము లుండవలయును.

శ్లో॥ తదగ్రేనటనంకార్యంతత్స్థలంరఙ్గముచ్యతే।

తా॥ ఆరాజునకెదుట నటనముచేయువలయును. ఆస్థలము రంగముఅనబడును.

శ్లో॥ రఙ్గమధ్యస్థితేపాత్రే తత్సమీపేనటోత్తమః। దక్షిణేతాళధారీచ పార్శ్వద్వన్ద్వే మృదఙ్గికః। తయోర్మధ్యేగీతకారశ్శ్రుతికారస్తదన్తరే। ఏవంతిష్ఠేత్క్రమేణైవనాట్యారఙ్గమణ్డపే॥

తా॥ రంగమండపమునడుమ పాత్రముండఁగా దానివెంబడి నటోత్తముఁడును, కుడితట్టు తాళగాఁడును, ఇరుప్రక్కలను మద్దెలగాఁడును, వారినడుమ పాత్రమునను సరించి గాయకులును, వారికివెనుక శ్రుతిపోయువాఁడును, వరుసగానుండవలయును.

## పాత్రలక్షణమ్.

శ్లో॥ తన్వీరూపవతీశ్యామా పీనోన్నతపయోధరా। ప్రగల్భాసరసాకాన్తా కుశలాగ్రహమోక్షయోః॥ చారతాళలయాఽభిజ్ఞా మణ్డలస్థానపణ్డితా। హస్తాఽఙ్గస్థానవిపుణాకరణేషువిలాసినీ॥ విశాలలోచనాగీతవాద్యతాళాఽనువర్తినీ। పరార్థ్యభూషాసమ్పన్నాప్రసన్నముఖపఙ్కజా॥ నాఽతిస్థూలానాఽతికృశానాఽత్యుచ్చానాఽతివామనా।ఏవంవిధగుణోపేతా నర్తకీసముదాహృతా॥

తా॥ నటించెడు పాత్రము రూపమువతియు, యౌవనమధ్యస్థురాలును, బలిసినిక్కిన పాలిండ్లుగలదియు, ప్రౌఢత్వముగలదియు, రసికురాలును, సొగసుగలదియు, పట్టువిడుపులందు సమర్థురాలును, తాళలయగతులను దెలిసినదియు, మండలస్థాననృత్యమందుపండితురాలును, హస్తవిన్యాసాంగ విన్యాసములయందు నేర్పుగలదియు, అవయవచాకచక్యముగలదియు, విశాలములగు కన్నులుకలదియు, గీతవాద్యతాళములననుసరించినడచునదియు, వెలగలసొమ్ములు ధరించినదియు, తేటనైనముఖముగలదియు, మిగులలావైనదిగాని మిగులపొడువైనదిగాని మిగులచిక్కినదిగాని మిగులపొట్టిదిగాని కానిదియునైయుండవలెను.

## అపాత్రలక్షణమ్.

శ్లో॥ పుష్పాక్షీకేశహీనాచపీనోష్ఠీలమ్బకస్తనీ।అతిస్థూలాఽప్యతికృశాఽప్యత్యుచ్చాఽప్యతివామనా॥ కుబ్జాచస్వరహీనాచవేశ్యానాట్యవివర్జితా॥

తా॥ పూలుపడియున్న కన్నులుగలదియు, తలవెండ్రుకలు లేనిదియు, బలిసిన పెదవులుగలదియు, వ్రేలబడిన స్తనములు గలదియు, మిక్కిలి బలిసినదియు, మిక్కిలి చిక్కినదియు, మిక్కిలి పొట్టిదియు, గూనుగలదియు, హీనస్వరముగలదియు, అగువేశ్య నాట్యమునకు దగినది గాదు.

## కిఙ్కిణీలక్షణమ్.

శ్లో॥ కిఙ్కిణీర్ఘకాంస్యరచితాః తామ్రేణరజతేనవా । సుస్వరాశ్చసురూపాశ్చసూక్ష్మానక్షత్రదేవతాః ॥ బద్ధయేన్నీలసూత్రేణగ్రన్థిభిశ్చసమన్వితమ్॥ శతద్వయంశతంవాఽపిపాదయోర్నాట్యకర్మణి । శతంవాదక్షిణేపాదేద్విశతంవామపాదకే॥

తా॥ గజ్జెలుకంచువిగానైనను, రాగివిగానైనను, వెండివిగానైనను, ఉండవలయును. అవి మంచిస్వరముగలవిగాను అందమయినవిగాను చిన్నవిగాను ఉండవలెను. అట్టి నక్షత్రాధిదేవతలుగల గజ్జెలను నల్లదారమునగ్రుచ్చి గజ్జెగజ్జెకు ముడివేయవలయును. నాట్యమాడెడి కాలములయందు పాత్రము కాళ్లలో ఇన్నూరిన్నూరుగాని నూరునూరుగాని యుండవలయును. లేక కుడికాలియందు నూరును ఎడమకాలియందిన్నూరునైన నుండవలయును.

## నటలక్షణమ్.

శ్లో॥ రూపవాన్మధురాఽభాషీ కృతీవాగ్మీపటుస్తథా । కులాఙ్గనాసుతశ్చైవశాస్త్రజ్ఞోమధురస్వరః ॥ గీతవాద్యాఽదినృత్యజ్ఞో సిద్ధకగిప్రతిభానవాన్ । ఏతాదృశగుణైర్యుక్తో నటఇత్యుచ్యతేబుధైః॥

తా॥ చక్కనివాడును, ఇంపుగమాటలాడువాడును, పండితుడును, మాటకారియు, సమర్థుడును, కులాంగనాసుతుడును, భరతశాస్త్రపరిజ్ఞానముగలవాడును, మంచి శారీరముగలవాడును, గానవాద్య నృత్యాదులలో పూర్ణజ్ఞానముగలవాడును, పట్టుగలిగినవాడును, కల్పనాశక్తిగలవాడు నగుజనుడు పెద్దలచేత నటుడని చెప్పబడుచున్నాడు.

## పాత్రబహిర్గప్రాణలక్షణమ్.

శ్లో॥ మృదఙ్గశ్చసుతాళాచ వేణుగీతిస్తతశ్శ్రుతిః। ఏకవీణాకిఙ్కిణీశ్చగాయకశ్చసువిశ్రుతః ॥ ఇత్యేవమన్వయజ్ఞైశ్చ పాత్రప్రాణాబహిస్స్మృతాః॥

తా॥ మృదంగము, మంచినాదము గలతాళములు, పిల్లనగ్రోవి, పాట, శ్రుతి, వీణ, గజ్జెలు, ప్రఖ్యాతుడైన నటుడు, ఇవి నాట్యమాడెడు పాత్రమునకు బహిర్గప్రాణములని చెప్పబడును.

## అన్తర్గప్రాణలక్షణమ్.

శ్లో॥ జవస్థిరత్వరేఖాచ భ్రమరీదృష్టిరశ్రమః ।
మేధాశ్రద్ధావచోగీతి స్త్వన్తర్గప్రాణాదశస్మృతాః॥

తా॥ నడి, నిలుకడ, సమత్వము, చపలత్వము, చూపు, శ్రమములేమి, బుద్ధి, శ్రద్ధ, మంచిమాటలు, పాట ఈ పదియును అంతర్ప్రాణము లనబడును.

నీచనాట్యలక్షణమ్.

శ్లో॥ అకృత్వాప్రార్థనంపాత్ర మాచరేద్యదినాట్యకమ్ ।
తన్నాట్యంనీచమిత్యాహుర్నాట్యశాస్త్రవిచక్షణాః॥

తా॥ నటించెడి పాత్రము ఇష్టదేవతాప్రార్థనము మొదలగువానిని చేయకయే చేయునాట్యము నీచనాట్యమని నాట్యశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

నీచనాట్యదర్శనఫలమ్.

శ్లో॥ నీచపాత్రకృతంనాట్యం యదిపశ్యన్తిమానవాః ।
పుత్రహీనాభవిష్యన్తిజాయన్తేపశుయోనిషు॥

తా॥ నాట్యవర్జితపాత్రచే చేయబడిన నాట్యమును జూచిన జనులు పుత్రహీనులై పశుయోనియందు జనింతురు.

నాట్యక్రమమ్.

శ్లో॥ తస్మాత్సర్వంసమాలోచ్య పూర్వైర్యదుదాహృతమ్।
దేవతాప్రార్థనాదీనికృత్వానాట్యముపక్రమేత్॥

తా॥ ఆకారణమువలన పూర్వీకులచేత నాట్యవిషయమునందు ఏమేమి చెప్పబడియున్నవో, వానినెల్లను చక్కగాచూచి తెలిసికొని దేవతా ప్రార్థనాదులనుచేసి నాట్యమునకు ప్రారంభింపవలయును.

శ్లో॥ కణ్ఠేనాలమ్బయేద్గీతం హస్తేనార్థంప్రదర్శయేత్ ।
చక్షుర్భ్యాందర్శయేద్భావంపాదాభ్యాంతాళమాచరేత్॥

తా॥ నటించుపాత్రము కంఠముచేత గానమును హస్తాభినయముచే దానియర్థమును నేత్రములచే అందలి భావమును కాళ్లతో తాళమును నడపవలయును.

శ్లో॥ యతోహస్తస్తతోదృష్టి ర్యతోదృష్టిస్తతోమనః।
యతోమనస్తతోభావో యతోభావస్తతోరసః॥

తా॥ ఎచ్చట హస్తము వినియోగింపబడునో అచ్చట దృష్టియు ఆదృష్టియున్నచోటనే మనస్సును మనసున్నచోటనే భావమును ఉండునెడల రసము పుట్టును.

అభినయలక్షణమ్.

శ్లో॥ అత్రత్వభినయస్యైవ ప్రాధాన్యమితికథ్యతే॥

తా॥ రసభావాది పరిజ్ఞానవిషయమందు అభినయమే ముఖ్యమని చెప్పబడుచున్నది.

అభినయశబ్దవ్యుత్పత్తిః.

శ్లో॥ అభిపూర్వస్యనీఞ్ ధాతోఽ రాఖ్యానార్థస్యనిర్ణయః।
యస్మాత్పదార్థాన్నయతితస్మాదభినయస్స్మృతః॥

తా॥ అభియను నుపసర్గము పూర్వమునందుగల నీఞ యెడు ధాతువుచే చెప్పబడు నట్టి పదముల అర్థముయొక్క నిర్ణయము కలదికనుక ఆపదములయొక్క అర్థములను తెలుపుట అభినయము అనబడును.

## గ్రన్థాన్తరే.

శ్లో॥ అభివ్యఞ్జన్విభావాను భావాదీన్నాటకాశ్రయాన్ । ఉత్పాదయన్ సహృదయేరసజ్ఞానంనిరంతరమ్ । అనుకర్తుస్థితోయోఽర్థో భినయ స్సోఽభిధీయతే॥

తా॥ నాటకాశ్రయములయిన విభావానుభావాదులను తెలియజేయునదిగాను రసికుల మనసులకు నిరంతర రసజ్ఞానమును కలుగజేయునదిగాను అనుకర్తృనిష్ఠమైన రసభావాదులను జూపువారి యందుగల) అర్థము అభినయ మనబడును.

శ్లో॥ ఆఙ్గికోవాచికస్తద్వ దాహార్యస్సాత్వికస్పరః । చతుర్ధాభినయస్తత్ర చాఽఙ్గికోఽఙ్గైర్నిదర్శితః । వాచావిరచితస్సకావ్య నాటకాఽదిషు వాచికః । ఆహార్యోహారకేయూర వేషాదిభిరలఙ్కృతిః । సాత్వికస్సాత్వికైర్భావై ర్భావజ్ఞైశ్చనిదర్శితః॥

తా॥ ఈ యభినయము, ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము అని నాలుగు విధముగలది. అందు అంగములచేత జూపబడునది ఆంగికము. మాటలచేత తెలుపబడునది వాచికము. ఇది కావ్యనాటకాదులయందు గానబడుచున్నది. హారకేయూరాదుల నలంకరించుకొనుట ఆహార్యము. సాత్వికాది భావములచేత అభినయించెడు పదభావము సాత్వికము. అని భావజ్ఞులచేత జెప్పబడుచున్నది.

## అఙ్గికాఽభినయత్రైవిధ్యమ్.

శ్లో॥ తత్రాఙ్గికోఽఙ్గప్రత్యఙ్గో పాఙ్గభేధాత్త్రిధామతః॥

తా॥ ఆంగికాభినయము- అంగాభినయము, ప్రత్యఙ్గాభినయము, ఉపాంగాభినయము అని, మూడువిధములుగలది.

## అఙ్గలక్షణమ్.

శ్లో॥ అఙ్గాన్యత్రశిరోహస్తౌ కక్షస్పార్శ్వకటీతటౌ ।
పాదావితిషడుక్తానిగ్రీవామప్యపరేజగుః॥

తా॥ ఈ యంగాభినయమందు, తల, చేతులు, చంకలు, లేక పార్శ్వములు, నడుము, పాదములు ఈ యారును అంగములనబడును. కొందరు కంఠమును సయితము అంగమని చెప్పెదరు.

## ప్రత్యఙ్గలక్షణమ్.

శ్లో॥ ప్రత్యఙ్గాన్యథస్కన్ధౌ బాహుపృష్ఠంతథోదరమ్ । ఊరూజఙ్ఘేషడిత్యాహురపరేమణిబన్ధకౌ । జానునీకూర్పరమితి త్రయమప్యధికంజగుః॥

తా॥ ప్రత్యఙ్గాభినయమందుమూపులు, చేతులు, వీపు, కడుపు, తొడలు, పిక్కలు ఈ యారును ప్రత్యంగములు. కొందరు మణికట్లు, మోకాళ్లు, మోచేతులును గూడ ప్రత్యంగములని చెప్పెదరు.

## నన్దికేశ్వరప్రోక్తాఽభినయదర్పణమ్.

### ఉపాఙ్గలక్షణమ్.

శ్లో॥ దృష్టిర్భ్రూపుటతారాశ్చ కపోలౌ నాసికాహనుః । అధరో దశనా జిహ్వా చుబుకం వదనం తథా । ఉపాఙ్గాని ద్వాదశైతే శిరస్యఙ్గాన్తరే తథా । పార్ష్ణిగుల్ఫౌ తథాఙ్గుల్యః కరయోః పదయోస్తలే । ఏతాని పూర్వశాస్త్రాను సారేణోక్తాని వై మయా॥

తా॥ చూపు, ఱెప్పపాటు, నల్లగుడ్డు, చెక్కిళ్లు, ముక్కు, దవుడలు, అధరము, దంతములు, నాలుక, గడ్డము, మొగము, శిరస్సు ఈ పన్నెండును ఉపాంగములు. వీని అంగాంతరములుగా నుదికాలు, చీలమండ, కాళ్లచేతులవ్రేళ్లు, అరచేతులు ఇవి పూర్వశాస్త్రమునను సరించి నాచేత చెప్పబడినవి.

శ్లో॥ అఙ్గానాం చలనాదేవ ప్రత్యఙ్గోపాఙ్గయోరపి।
చలనం ప్రభవేత్తస్మాత్సర్వేషాం నాఽత్ర లక్షణమ్॥

తా॥ అంగములయొక్క చలించుటవలననే ప్రత్యంగోపాంగములకు చలనము కలుగును కాబట్టి వీనికన్నిటికిని వేరువేరుగా లక్షణములు చెప్పుట అనావశ్యకము.

శ్లో॥ నృత్యమాత్రోపయోగ్యాని కథ్యన్తే లక్షణైర్క్రమాత్ । ప్రథమన్తు శిరోభేదః దృష్టిభేదస్తతః పరమ్। గ్రీవాహస్తౌ చ కార్యశ్చ తస్మైచ్ఛతాని ప్రకాశ్యతే॥

తా॥ నృత్యమునకు ఉపయోగమైనవిమాత్రము లక్షణయుక్తముగ జెప్పబడును. మొదట శిరోభేదము, దృష్టిభేదము, గ్రీవాభేదము, హస్తభేదము, వీనివలన కలిగెడు భేదములు అందుబయలు పరపబడును.

---

### అథ నవవిధ శిరోభేదాలక్ష్యన్తే.

శ్లో॥ సమముద్వాహితమధో ముఖమాలోళితం ధుతమ్ । కమ్పితఞ్చ పరావృత్త ముత్క్షిప్తమ్పరివాహితమ్ । నవధా కథితం శీర్షం నాట్యశాస్త్ర విచక్షణైః॥

తా॥ సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆలోళితము, ధుతము, కంపితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, పరివాహితము, అని శిరోభేదములు తొమ్మిది విధములు గలవిగా నాట్యశాస్త్రజ్ఞులచేత చెప్పబడును.

౧ - సమము॥ శ్లో॥ నిశ్చలం సమమాఽఖ్యాతమున్నత్యాఽనతివర్జితమ్॥

తా॥ తలనువంపక, పొడవుగానెత్తక, కదలింపక సమముగా నిలుపునది సమశిరస్సు.

వినియోగము॥ శ్లో॥ నృత్తాఽరమ్భే జపాదౌ చ గర్వే ప్రణయకోపయోః । స్తమ్భనే నిష్క్రియాత్వే చ సమశీర్షముదాహృతమ్॥

తా॥ నృత్తారంభము, జపాదులు, గర్వము, ప్రీతి, కోపము, స్తంభించియుండుట, క్రియారహితత్వము, వీనియందు ఈ శిరస్సు ఉపయోగింపబడును.

౨ - ఉద్వాహితము॥ శ్లో॥ ఉద్వాహితశిరో జ్ఞేయ మూర్ధ్వభాగోన్నతాఽనలమ్॥

తా॥ మీదికెత్తి సమముగా నిలుపబడినది యుద్వాహితశిరము.

వి॥ శ్లో॥ ధ్వజేచన్ద్రేచగగనే పర్వతేవ్యోమగామిషు।
తుఙ్గవస్తునిసంయోజ్యముద్వాహితశిరోబుధైః॥

తా॥ ధ్వజము, చంద్రుఁడు, ఆకాశము, పర్వతము, ఆకాశమున సంచరించెడు వస్తువు, పొడువగు పదార్థము, వీనియందు ఈ శిరస్సు వినియోగింపబడును.

౩ - అధోముఖము॥ శ్లో॥ అధస్థాన్నమితంవక్త్ర మధోముఖమితీరితమ్॥

తా॥ క్రిందిప్రక్కగా వంచిన శిరస్సు అధోముఖమనబడును.

వి॥ శ్లో॥ లజ్జాభేదప్రణామేషుదుశ్చిన్తామూర్ఛయోస్తథా। అధస్థితాఽర్థనిర్దేశే యుజ్యతేజలమజ్జనే॥

తా॥ సిగ్గు, భేదపడుట, మ్రొక్కుట, దురాలోచన చేయుట, మూర్ఛిల్లుట, క్రిందుగానుండు పదార్థమును నిర్ణయించుట, స్నానము, వీనియందు ఈశిరస్సుఉపయోగింపబడును.

౪ - ఆలోళితము॥ శ్లో॥ మణ్డలాకారవద్భ్రాన్త మాలోళితశిరోభవేత్॥

తా॥ చక్రాకారముగా త్రిప్పబడినది యాలోళిత శిరస్సనబడును.

వి॥ శ్లో॥ నిద్రోద్వేగగ్రహాఽవేశేమదేమూర్ఛాఽతురాన్వితే। భ్రమణేచవికల్పాఽదౌ హాస్యేచాఽలోళితంశిరః॥

తా॥ తూగాడుట, దయ్యము సోకుట, మదము, మూర్ఛపోయినవాడు, గిరగిర తిరుగుట, వికల్పాదులు, నవ్వు, వీనియందు ఈశిరస్సు ఉపయోగింపబడును.

౫ - ధుతము॥ శ్లో॥ వామదక్షిణభాగేతుచలితంతద్ధుతంశిరః॥

తా॥ ఎడమ కుడిప్రక్కలకు కదలించునట్టిది ధుత శిరస్సనబడును.

వి॥ శ్లో॥ నాఽస్తీతివచనేభూయఃపార్శ్వదేశాఽవలోకనే। జనాఽశ్వాసే విస్మయేచ విషాదేఽనీప్సితేతథా। శీతార్తేజ్వలితేభీతే సద్యఃపీతాఽసవేతథా। యుద్ధయత్నేనిషేధేచ అమర్షేస్వాఙ్గవీక్షణే। పార్శ్వాఽహ్వానేచతస్యోక్తః ప్రయోగోభరతాఽగమే॥

తా॥ లేదనుట, మాటిమాటికి ప్రక్కలజూచుట, జనుల నూరడించుట, ఆశ్చర్యము, ఖేదము, ఇచ్ఛలేమి, చలి, మండుట, భయపడినది, అప్పుడు త్రాగినకల్లు, యుద్ధప్రయత్నము, త్రోపుడు, కోపము, అవయవములను జూచుకొనుట, ప్రక్కలనుండువారలను బిలుచుట, వీనియందు ఈశిరస్సు ఉపయోగింపబడును.

౬ - కంపితము॥ శ్లో॥ ఊర్ధ్వాఽధోభాగచలితం కమ్పితంతచ్ఛిరోభవేత్॥

తా॥ క్రిందుమీదుగా గదలింపబడినది కంపిత శిరస్సనబడును.

వి॥ శ్లో॥ కోపేతిష్ఠేతివచనే ప్రశ్నసంజ్ఞోపహూతయోః।
ఆవాహనేతర్జనేచ కమ్పితంతచ్ఛిరోభవేత్॥

తా॥ కోపము, ఉండుమనుట, అడుగుట, పిలుచుట, ఆవాహనము, బెదరించుట, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౭ - పరావృత్తము॥ శ్లో॥ పరాఙ్ముఖీకృతంశీర్షం పరావృత్తమితీరితమ్॥

తా॥ ప్రక్కగా త్రిప్పినది పరావృత్తశిరస్సనబడును.

వి॥ శ్లో॥ తత్కార్యకోపలజ్జాఽది కృతేవక్త్రప్రసారణే । అనాదరేకచేతూ
ణ్యాం పరాఽవృత్తశిరోభవేత్॥

తా॥ అట్లుచేయుమనుట, కోపము, సిగ్గుమొదలైనవానివలనిచేష్ట, ముఖమునుచాచుట, ఉపేక్షించుట, జడ, అమ్ములపొది వీనియందు ఈశిరస్సు ఉపయోగింపబడును.

౮ - ఉత్క్షిప్తము॥ శ్లో॥ పార్శ్వోర్ధ్వభాగచలిత ముత్క్షిప్తం నామశీర్షకమ్॥

తా॥ ఇరుప్రక్కలమీదిభాగములందుచలింపజేయుబడునదిఉత్క్షిప్తశిరస్సనబడును.

వి॥ శ్లో॥ గ్రహణేగచ్ఛేత్యాద్యర్థే సూచనేచపరితోషణే।
అఙ్గీకారేప్రయోక్తవ్య ముత్క్షిప్తంనామశీర్షకమ్॥

తా॥ తీసికొనుము పొమ్ము అనుటమొదలగునవి, జాడచూపుట, పోషించుట, సమ్మతించుట, వీనియందు ఉత్క్షిప్తశిరస్సు ఉపయోగింపబడును.

౯-పరివాహితము॥ శ్లో॥ పార్శ్వోర్ధ్వయోశ్చామరవన్నతం చేత్పరివాహితమ్॥

తా॥ వింజామరమువలె ఇరుప్రక్కలకువంపబడినది పరివాహితశిరస్సనబడును.

వి॥ శ్లో॥ మోహేచ విరహేస్తోత్రే సన్తోషేచాఽనుమోదనే।
విచారేచప్రయోక్తవ్యం పరివాహితశీర్షకమ్॥

తా॥ వలపు, ఎడబాటు, పొగడు, సంతోషము, ఒప్పుకొనుట, విచారము, వీనియందు ఈశిరస్సు ఉపయోగింపబడును.

## గ్రంథాంతరస్థ శిరోభేదాః.

శ్లో॥ ధుతంవిధుతమాధూత మవధూతంచకంపితమ్ । ఆకంపితోద్వాహితంచ పరివాహితమంచితమ్। నిహంచితం పరావృత్తముత్క్షిప్తాధో ముఖేతథా । లోళితంచేతివిజ్ఞేయం చతుర్దశవిధంశిరః॥ తిర్యఙ్నతోన్నతం స్కంధానత మారాత్రికంసమమ్ । పార్శ్వాభిముఖ మిత్యన్యద్భేదం పంచపరేజగుః॥ సౌమ్యమాలోకితంచైవ తిరశ్చీనంప్రకంపితమ్ । సౌందర్యంపంచధాప్రోక్తం శిరసాంలక్షణంతథా॥ భరతాదిభిరాచార్యైశ్చతుర్వింశదితీరితాః॥

తా॥ ధుతము, విధుతము, ఆధూతము, అవధూతము, కంపితము, ఆకంపితము, ఉద్వాహితము, పరివాహితము, అంచితము, నిహంచితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, అధోముఖము, లోళితము, తిర్యఙ్నతోన్నతము, స్కంధానతము, ఆరాత్రికము, సమము, పార్శ్వాభిముఖము, సౌమ్యము, ఆలోకితము, తిరశ్చీనము, ప్రకంపితము, సౌందర్యము, అనిశిరోభేదములు ఇరువదినాలుగువిధములుగా భరతాచార్యులు మొదలైనవారిచేజెప్పబడియున్నవి.

# నన్దికేశ్వరప్రోక్తాఽభినయదర్పణమ్.

౧ - ధుతము॥ శ్లో॥ పర్యాయేణశనైస్తిర్యగ్గతముక్తంధుతంశిరః॥

తా॥ క్రమముచొప్పున మెల్లగాను అడ్డముగాను త్రిప్పబడునట్టిశిరము ధుతము అనబడును.

వినియోగము॥ శ్లో॥ శూన్యస్థానేస్థితేచైవపార్శ్వదేశావలోకనే । అనాశ్వాసే విస్మయేచవిషాదేనీప్సితేతథా । ప్రతిషేధేచతస్యోక్తిఃప్రయోగోభరతాదిభిః॥

తా॥ ఏమిలేనిచోటు, ప్రక్కలుచూచుట, ఊరటలేమి, ఆశ్చర్యము, ఖేదము, ఇచ్చలేమి, త్రోపుడు వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౨ - విధుతము॥ శ్లో॥ ద్రుతగత్యాధుతత్వస్మాద్వి ధుతంతత్ప్రచక్ష్యతే॥

తా॥ ఆశిరస్సువడితో అడ్డముగా త్రిప్పబడినయెడ విధుతము అనబడును.

వి॥ శ్లో॥ శీతార్తేజ్వరితేభీతేసద్యః పీతాసవేతథా॥

తా॥ చలి, వేండ్రము, పిరికివాడు, అప్పుడుత్రాగినకల్లుగలవాడు వీరియందు ఈశిరస్సువినియోగింపబడును.

౩ - ఆధూతము॥ శ్లో॥ ఆధూతం తుసకృత్తిర్యగూర్ధ్వనీతశిరోమతమ్॥

తా॥ రవంతఅడ్డముగానిక్కించినశిరస్సు ఆధూతము అనబడును.

వి॥ శ్లో॥ సర్వేషుస్వాంగవీక్షాయాంపార్శ్వస్థోర్ధ్వనిరీక్షణే।
శక్తోఽస్మీత్యభిమానేచప్రయోగ స్తేనచోదితః॥

తా॥ సమస్తమునసుట, తనదేహమును జూచుకొనుట, పార్శ్వములందునిక్కిచూచుట, సమర్థుడనైతిననుట, గర్వము వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౪ - అవధూతము॥ శ్లో॥ యదధస్సకృదానీతమవధూతంతదుచ్యతే॥

తా॥ ఏశిరస్సు ఒకానొకప్పుడు క్రిందుగా పంపబడునో అదియవధూతము అనబడును.

విని॥ శ్లో॥ స్థిత్యర్థదేశనిర్దేశేప్రశ్నసంజ్ఞోపహూతయోః।
ఆలాపేచప్రయోక్తవ్య మిదమాహుర్మనీషిణః॥

తా॥ ఉండుమనుట, తావుచూపుట, అడిగెడుజాడ, పిలుచుట, ముచ్చటలాడుట, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౫ - కంపితము॥ శ్లో॥ బహుళోద్ధృతమూర్ధ్వంచ కంపనాత్కంపితంశిరః॥

తా॥ మిక్కిలిపొడువుగనెత్తి చలింపజేయబడినశిరస్సు కంపితమనబడును.

విని॥ శ్లో॥ జ్ఞానాభ్యుపగమేరోషే వితర్కేతర్జనేతథా।
త్వరితేప్రశ్నవాక్యేచప్రయోక్తవ్య మిదంశిరః॥

తా॥ జ్ఞాపకము తెచ్చుకొనుట, కోపము, ఆలోచన, బెదరించుట, త్వరితము, ప్రశ్నముచేయుట, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౬ - అకంపితము॥ శ్లో॥ అకంపితం తదేవస్యాద్విరక్తం తుశనైర్యది॥

తా॥ ఆశిరస్సే మెల్లమెల్లగ చలింపజేయబడెనేని అకంపితము అనబడును.

వి॥ శ్లో॥ పురఃప్రస్థితనిర్దేశ ప్రశ్నసంజ్ఞోపదేశయోః।
ఆవాహనేస్వమనసికథనేతత్ప్రయుజ్యతే॥

తా॥ ముందుపోవుదానిజూపుట, అడిగెడిజాడచూపుట, ఉపదేశించుట, ఆవాహనముచేయుట, తనమనస్సునుట, పలుకుట, వీనియందు ఈశిరస్సు ఉపయోగింపబడును.

౭ - ఉద్వాహితము॥ శ్లో॥ సకృదూర్ధ్వంశిరోనీతముద్వాహితశిరః ఉ॥తమ్॥

తా॥ ఒకానొకప్పుడు మీదికెత్తబడినశిరస్సు ఉద్వాహితము అనబడును.

వి॥ శ్లో॥ శక్తోహమస్మికార్యేషు అభిమానేప్రయుజ్యతే॥

తా॥ నేనుచాలుదుననుట, గర్వించుట, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౮ - పరివాహితము॥ శ్లో॥ పరంమండలికాకారం భ్రామితం పరివాహితమ్

తా॥ చక్రాకారముగ మిక్కిలిత్రిప్పబడినశిరస్సు పరివాహితమనబడును.

వి॥ శ్లో॥ లజ్జాభావే భ్రమేమానే వల్లభానుకృతౌతథా । విస్మయేచస్మితే
హర్షేరోమాంచే ప్రమోదనే ॥ విచారేచవిచారజ్ఞైః కార్యమాహు
రిదంశిరః॥

తా॥ సిగ్గులేమి, భ్రమము, మానము, ప్రియునిపోలిక, ఆశ్చర్యము, చిరునవ్వు, సంతోషము, పులకాంకురము, సంతోషింపజేయుట, విచారము, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౯ - అంచితము॥ శ్లో॥ శిరస్యాదంచితంకించి త్పార్శ్వయోర్నతకంధరమ్॥

తా॥ ఇరుప్రక్కలకును ఇంచుకవంపబడిన మెడగలశిరస్సు అంచితము అనబడును.

• వి॥ శ్లో॥ దుశ్చింతామోహమూర్ఛాదౌ తత్కార్య ముధరేక్షణే॥

తా॥ దురాలోచనము, మోహము, మూర్ఛ మొదలైనవి, పెదవినిజూచుకొనుట, వీనియందు ఈశిరస్సు ఉపయోగింపబడును.

౧౦ - నిహంచితము॥ శ్లో॥ ఉత్క్షిప్తబాహు శిఖరలగ్నగ్రీవంనిహంచితమ్॥

తా॥ పొడువుగనెత్తబడినమూపుతో జేరినయెడ ఆశిరస్సునిహంచితముఅనబడును.

వి॥ శ్లో॥ విలాసేలలితే గర్వేబిబ్బోకే కిలికించితే । మోట్టాయితే కుట్టమితే
మానేస్తంభేచతద్భవేత్॥

తా॥ విలాసము, లలితము, గర్వము, బిబ్బోకము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, మానము, స్తంభము, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును. ఇందలి విలాసము మొదలగువానిఅర్థము భరతరసప్రకరణమునందు వివరింపబడియున్నవి.

౧౧ - పరావృత్తము॥ శ్లో॥ పరాఙ్ముఖీకృతం శీర్షంపరావృత్త శిరోభవేత్॥

తా॥ పెడమొగముగలదిగా త్రిప్పబడినశిరస్సు పరావృత్తము అనబడును.

వి॥ శ్లో॥ తత్కార్యకోపలజ్జాది కృతేవక్త్రప్రసారణే।
పరావృత్తాను కరణేపృష్ఠతః ప్రేక్షణేభవేత్॥

తా॥ అదిచేయుమనుట, కోపము, లజ్జ మొదలగుదానిచేనగుచేష్ట, ముఖమును చాచుట, ఒకతట్టుతిరిగినదాని ననుకరించుట, వెనుకతట్టుచూచుట, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౧౨ - ఉత్క్షిప్తము॥ శ్లో॥ ఊర్ధ్వవక్త్రంశిరోజ్ఞేయ ముత్క్షిప్తంతత్రశస్యతే॥

తా॥ మీదికెత్తబడిన మొగముగలశిరస్సు ఉత్క్షిప్తము అనబడును.

విని॥ శ్లో॥ దర్శనేతుంగవస్తూనాం చంద్రాదివ్యోమగామినామ్॥

తా॥ పొడువైనపదార్థములను జూచుట, చంద్రుడు మొదలైన ఆకాశమునందు సంచరించువానిని జూచుట, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౧౩-అధోముఖము॥ శ్లో॥అధోముఖ శిరోయత్ర తత్ర ప్రాహురధోముఖమ్॥

తా॥ క్రిందు మొగముగా వంచబడినశిరస్సు అధోముఖము అనబడును.

శ్లో॥ లజ్జాఖేదప్రణామేషు స్యాదన్వర్థమధోముఖమ్॥

తా॥ సిగ్గు, దుఃఖము, మ్రొక్కుట, వీనియందు ఈశిరస్సు వినియోగించును.

౧౪ - లోళితము॥ శ్లో॥ శిరసాన్సర్వల్లోళితం గర్వాధిక్యం శిథిలలోచనమ్॥

తా॥ గర్వాధిక్యముచేత తేలవేయబడిన కన్నులుగలశిరస్సు లోళితముఅనబడును.

విని॥ శ్లో॥ నిద్రాగమగ్రహావేశమదమూర్ఛాసు తన్మతమ్॥

తా॥ నిదురవచ్చుట, దయ్యముసోకుట, మదము, మూర్ఛ, వీనియందు ఈశిరస్సు చెల్లును.

౧౫ - తిర్యఙ్నతోన్నతము॥ శ్లో॥ తిర్యఙ్నతోన్నతిం ప్రాప్తం శిరస్తిర్యఙ్నతోన్నతమ్॥

తా॥ అడ్డముగవంచియెత్తబడిన శిరస్సు తిర్యఙ్నతోన్నతము అనబడును.

వి॥ శ్లో॥ బిబ్బోకాదిషు కాంతానాంతత్ప్రయోజ్యం ప్రచక్షతే॥

తా॥ స్త్రీలయొక్క బిబ్బోకముమొదలగు విలాసచేష్టలయందు ఈశిరస్సు వినియోగింపబడును.

౧౬ - స్కంధానతము॥ శ్లో॥ స్కంధానతం తథాఖ్యాతం స్కంధేయన్నిహితంశిరః॥

తా॥ మూపుమీదికి వంపబడినశిరస్సు స్కంధానతము అనబడును.

విని॥ శ్లో॥ తన్నిద్రామద మూర్ఛాసు చింతాయాంచ ప్రయుజ్యతే॥

తా॥ ఆశిరస్సు నిద్ర, మదము, మూర్ఛ, చింత వీనియందు ఉపయోగింపబడును.

౧౭ -అరాత్రికము॥శ్లో॥ స్కంధేతుకించిదాశ్లిష్య భ్రాంతమారాత్రికంమతమ్॥

తా॥ రెండుమూపులను కొంచెము తాకించి త్రిప్పబడుశిరస్సు అరాత్రికము అనబడును.

విని॥ శ్లో॥ విస్మయేదృశ్యతే తస్యపరాభిప్రాయవేదనే॥

తా॥ ఆశ్చర్యము, ఇతరులయభిప్రాయము నెరుగుట వీనియందు ఈశిరస్సునకు వినియోగము.

౧౮ - సమశిరము॥ శ్లో॥ స్వాభావికం సమంశీర్షం స్వభావాభినయాదిషు॥

తా॥ ఉన్నదియున్నట్లుండు శిరస్సు సమము. ఇదిస్వభావధర్మమును తెలుపుట మొదలైనవానియందు వినియోగించును.

౧౯ - పార్శ్వాభిముఖము॥ శ్లో॥ పార్శ్వాభిముఖమస్వర్థం పార్శ్వస్థస్యావలోకనే॥

తా॥ ఒకప్రక్కకు ద్రిప్పబడినశిరస్సు పార్శ్వాభిముఖము అనబడును. అదిప్రక్కనుండువారిని జూచుటయందు ఉపయోగించును.

౨౦ - సౌమ్యము॥ శ్లో॥ నిశ్చలంసౌమ్య మాఖ్యాతం నృత్తారంభే ప్రయుజ్యతే॥

తా॥ చలనములేకయుండు శిరస్సు సౌమ్యము అనబడును. అది నాట్యారంభమందు ఉపయోగింపబడును.

౨౧ - ఆలోళితము॥ శ్లో॥ సమంతాల్లోళితం యత్తదాలోళితమితీరితమ్॥

తా॥ అంతటను ద్రిప్పబడినశిరస్సు ఆలోళితము అనబడును.

విని॥ శ్లో॥ పుష్పాంజలి క్రమేచారినటనే లవణేతథా ।
ఆలోళితస్య శిరసోవినియోగోభిధీయతే॥

తా॥ పుష్పాంజలి క్రమము, చారినాట్యము, లావణ్యము, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౨౨ - తిరశ్చీనము॥ శ్లో॥ పార్శ్వద్వయోరూర్ధ్వభాగే చలనాత్తిర్యగీరితమ్॥

తా॥ ఇరుప్రక్కలందును మీదితట్టుచలించుటగలశిరస్సు తిరశ్చీనముఅనబడును.

విని॥ శ్లో॥ లజ్జానిరూపణే నృత్తేముఖచారీయవామని । తత్తదౌచిత్యకాలేషు తిరశ్చీనముదీరితమ్॥

తా॥ సిగ్గునుకనబరచెడి ఆట, ముఖచారి అను ఆట, వీనియందును, ఆయాతగినకార్యములందును ఈశిరస్సుచెల్లును.

౨౩ - ప్రకంపితము॥ శ్లో॥ పునఃపునఃప్రచలనాత్పురోభాగేచ పార్శ్వయోః । ప్రకంపితశిరఃప్రోక్తం నాట్యశాస్త్రేషు సమ్మతమ్॥

తా॥ ముందరికిని ఇరుప్రక్కలకును మాటిమాటికి చలించుటవలననైనశిరస్సు ప్రకంపితము అనబడును.

విని॥ శ్లో॥ అద్భుతాఖ్యరసేగీతే ప్రబంధేభ్రమరేతథా । ప్రత్యర్థియుద్ధభావేపి ప్రకంపితశిరోభవేత్॥

తా॥ ఆశ్చర్యరసము, పాట, ప్రబంధమునువినుట, తుమ్మెద, శత్రుయుద్ధభావము, వీనియందు ఈశిరస్సుచెల్లును.

౨౮ - సౌందర్యము॥ శ్లో॥ ఊర్ధ్వాభిముఖవిన్యాసాత్పశ్చాద్భాగేనచాలనాత్।
సౌందర్యాఖ్యశిరః ప్రోక్తఃసర్వనాట్యే ప్రశస్యతే॥

తా॥ క్రిందుమీదులకు త్రిప్పుటవలన వెనుకతట్టుచలించుటగలది సౌందర్యశిరస్సు అనియెల్లనాట్యములందుప్రశంసచేయబడుచున్నది.

వి॥ శ్లో॥ కారణాభినయేహస్తభ్రమణాఖ్యేచనర్తనే।
సౌందర్యాఖ్యశిరఃప్రోక్తంయోగాభ్యాసేషుయుజ్యతే॥

తా॥ కారణాభినయము, హస్తభ్రమణము అనుఆట,యోగాభ్యాసము వీనియందు ఈశిరస్సుచెల్లును.

---

## అథాష్టదృష్టిభేదాలక్ష్యన్తే.

శ్లో॥ సమమాలోకితం సాచీప్రలోకితనిమీలితే।ఉల్లోకితాఽనువృత్తేచతథాచైవాఽవలోకితమ్॥ ఇత్యష్ట దృష్టిభేదాస్స్యుర్కీర్తితో భరతాఽగమే॥

తా॥ సమము, ఆలోకితము, సాచి, ప్రలోకితము, నిమీలితము, ఉల్లోకితము అనువృత్తము, అవలోకితము, అనిదృష్టియెనిమిదివిధములుగలదిగా భరతశాస్త్రమునందు జెప్పబడినది.

౧ - సమము॥ శ్లో॥ వీక్షితంసురనారీభిస్సమానంసమవీక్షణమ్॥

తా॥ దేవతాస్త్రీలవలె రెప్పపాటులేక చూచుటసమదృష్టియనబడును.

వి॥ శ్లో॥ నాట్యాఽరమ్భేతులాయాఞ్చఅన్యచిన్తావినిశ్చయే।
ఆశ్చర్యేదేవతారూపే సమదృష్టిరుదాహృతా॥

తా॥ నాట్యారంభము, త్రాసునుచూచుట, ఇతరచింతనునిశ్చయించుట, ఆశ్చర్యము, దేవతారూపము వీనియందు ఈదృష్టియుపయోగింపబడును.

౨ - ఆలోకితము॥ శ్లో॥ ఆలోకితంభవేదాశుభ్రమణంస్ఫుటవీక్షణమ్॥

తా॥ వడితోడితిరుగుడుగలస్పష్టమైనచూపు ఆలోకితము అనబడును.

వి॥ శ్లో॥ కులాలచక్రభ్రమణే సర్వవస్తుప్రదర్శనే।
ఇచ్ఛాయాంచప్రయోక్తవ్యమాలోకితనిరీక్షణమ్॥

తా॥ కుమ్మరి సారెతిరుగుట, అన్నివస్తువులనుజూపుట, ఇచ్ఛ వీనియందు ఈదృష్టి వినియోగింపబడును.

3 - సాచి॥ శ్లో॥ స్వస్థానేతిర్యగాకారమపాఙ్గచలనక్రమాత్।
సాచీదృష్టిరితిజ్ఞేయా నాట్యశాస్త్రాఽర్థకోవిదైః॥

తా॥ స్వస్థానమందుండి కడకంటివరకు అడ్డముగా చలించునది సాచీదృష్టియనబడును.

వి॥ శ్లో॥ ఇఙ్గితేశ్మశ్రుసంస్పర్శేశరలక్ష్యేఽంశుకేస్మృతా।
సూచనాయాంచకులటానాట్యేసాచీనిరీక్షణమ్॥

తా॥ అభిప్రాయము, మీసముదువ్వుట, గురి, వస్త్రము, తలపు, సయిగ, రంకులాడియాట, వీనియందు ఈదృష్టి వినియోగింపబడును.

౪ - ప్రలోకితము॥ శ్లో॥ ప్రలోకితంపరిజ్ఞేయంచలనాత్పార్శ్వభాగయోః॥

తా॥ ఇరుప్రక్కలయందును చలించునట్టిదృష్టి ప్రలోకిత మనబడును.

వి॥ శ్లో॥ ఉభయోర్పార్శ్వయోర్వస్తుదర్శనేచససంజ్ఞికే।
చలనేబుద్ధిజాడ్యేచప్రలోకితనిరీక్షణమ్॥

తా॥ ఇరుప్రక్కలనుండు వస్తువులనుజూచుట, సయిగచేయుట, కదలుట, కలవరము, వీనియందు ఈదృష్టియుపయోగింపబడును.

౫ - నిమీలిత॥ శ్లో॥ దృష్టేరర్ధవికాసేనిమీలితాదృష్టిరీరితా॥

తా॥ సగముకన్నుదెరచిచూచెడి చూపునిమీలితయనబడును.

వి॥ శ్లో॥ ఋషివేషేపారవశ్యేజపేధ్యానేనమస్కృతౌ।
ఉన్మాదే సూక్ష్మదృష్టౌనిమీలితాదృష్టిరీరితా॥

తా॥ ఋషివేషము, పరవశత్వము, జపము, ధ్యానము, నమస్కారము, చిత్తచలనము, సూక్ష్మదృష్టి, వీనియందుఈదృష్టిఉపయోగింపబడును.

౬ - ఉల్లోకితము॥ శ్లో॥ ఉల్లోకితమితిజ్ఞేయమూర్ధ్వభాగోన్నతాఽనతమ్॥

తా॥ మీదికినిక్కించివంపబడినదృష్టి ఉల్లోకితము అనబడును.

వి॥ శ్లో॥ ధ్వజాఽగ్రేగోపురేదేవమణ్టపేపూర్వజన్మని।
ఔన్నత్యేచన్ద్రికాదౌచ ఉల్లోకితనిరీక్షణమ్॥

తా॥ ధ్వజముకొన, గోపురము, దేవమండపము, పూర్వజన్మము, పొడుగు, వెన్నెల మొదలగునవి వీనియందు ఈదృష్టి వినియోగింపబడును.

౭ - అనువృత్తము॥ శ్లో॥ ఊర్ధ్వాఽధోవీక్షణంవేగాదనువృత్తనిరీక్షణమ్॥

తా॥ క్రిందమీదుగాజూచునట్టి వడిగలచూపుఅనువృత్తము అనబడును.

వి॥ శ్లో॥ కోపదృష్టౌప్రియామన్త్రేఽ ప్యనువృత్తనిరీక్షణమ్॥

తా॥ కోపముతోజూచుట, ప్రీతితోపిలుచుట, వీనియందుఈదృష్టివినియోగింపను.

౮ - అవలోకితము॥ శ్లో॥ అధస్తాద్దర్శనంయత్త దవలోకితముచ్యతే॥

తా॥ క్రిందుచూచెడిచూపు అవలోకితము అనబడును.

వి॥ శ్లో॥ ఛాయాఽలోకేవిచారేచ శయ్యాయాంపఠనక్రమే।
స్వాఽఙ్గావలోకనేయానేప్యవలోకితముచ్యతే॥

తా॥ నీడనుచూచుట, విచారము, పాన్పు, చదువుట, తనయవయవములనుజూచుకొనుట, పోవుట వీనియందు ఈదృష్టి వినియోగింపబడును.

## గ్రన్థాన్తరస్థదృష్టిభేదాః.

శ్లో॥ సమాప్రలోకితాస్నిగ్ధా శృంగారాలోకితాద్భుతా । కరుణావిస్మయాదృష్టావిపణ్ణాచభయానకా । సాచీద్రుతావీరరౌద్రేదూరేంగితవిలోకితా । వితర్కితాశంకితాచఅభితప్తావలోకితా । శూన్యాహర్షోగ్రవిభ్రాన్తా శాన్తామీలితసూచనా । లజ్జితామలినాత్రస్తాహ్లానాముకుళకుఞ్చితే । ఆకాశాత్యర్ధముకుళాఅనువృత్తాచవిప్లుతా ।జిహ్మావికోశామదిరాహృద్యాలలితసంజ్ఞికా । చతుశ్చత్వారింశతీతిదృష్టిభేదాఃప్రకీర్తితాః॥

తా॥ సమ, ప్రలోకిత, శృంగార, స్నిగ్ధ, ఉల్లోకిత, అద్భుత, కరుణ, విస్మయ, దృష్ట, విపణ్ణ, భయానక, సాచి, ద్రుత, వీర, రౌద్ర, దూర, ఇంగిత, విలోకిత, వితర్కిత, శంకిత, అభితప్త, అవలోకిత, శూన్య, హర్ష, ఉగ్ర, విభ్రాంత, శాంత, మీలిత, సూచన, లజ్జిత, మలిన, త్రస్త, హ్లాన, ముకుళ, కుంచిత, ఆకాశ, అర్ధముకుళ, అనువృత్త, విప్లుత, జిహ్మ, వికోశ, మదిర, హృద్య, లలిత, ఆనిదృష్టిభేదములు నలువదినాలుగు.

౧ - అందు, సమ॥ శ్లో॥ వీక్షితంసురనారీవసమాచేదభిధీయతే॥

తా॥ దేవతాస్త్రీవలె రెప్పపాటులేకచూడబడినదిసమదృష్టియనబడును.

విని॥ శ్లో॥ సమాదిషుప్రయోక్తవ్యమితినాట్య విదోవిదుః॥

తా॥ సమముగజూచుట మొదలైనవానియందు ఈదృష్టివినియోగింపబడునని నాట్యశాస్త్రజ్ఞులుచెప్పుదురు.

౨ - ప్రలోకిత॥ శ్లో॥ ప్రలోకితా పరిజ్ఞేయాదర్శనంపార్శ్వభాగయోః॥

తా॥ ఇరుప్రక్కలనుజూచెడిచూపుప్రలోకిత యనబడును.

విని॥ శ్లో॥ ఉభయోః పార్శ్వయోర్వస్తు దర్శనాదిషుయుజ్యతే॥

తా॥ ఇరుప్రక్కలనుండు వస్తువులుమొదలైనవానిని జూచుటయందు ఈదృష్టి వినియోగించును.

౩ - స్నిగ్ధ॥ శ్లో॥ సహాస్యా సాభిలాషాచమనోజ్ఞాన్తఃప్రకాశినీ।
స్మరోద్రేకాభవేత్స్నిగ్ధా స్నిగ్ధాదిషునియుజ్యతే॥

తా॥ సంతోషముతోడను అభిలాషముతోడను గూడినదియు, మనోజ్ఞత గలదియు, అంతర్వికాసముగలదియు, మన్మథోద్రేకముగలదియునైన దృష్టిస్నిగ్ధయనబడును. ఇదిస్నేహముగల వస్తువుమొదలైనవానియందు వినియోగించును.

౪-శృంగార॥ శ్లో॥ హర్షోత్పన్నప్రమోదోత్థా కామంకామవశంవదా॥ శృఙ్గారదృష్టిః కాన్తానాం భ్రూక్షేపాపాఙ్గసమ్భవా ॥ భవేన్మనోభవావిష్టకామినీవీక్షణాదిషు॥

తా॥ సంతోషమువలన బుద్ధిసంక్షోభవిశేషమునందు గలిగినదియు, మిక్కిలిమన్మథా ధీనమయినదియు, కనుబొమ్మలు నిక్కించుటగల మనోజ్ఞ రాంద్రకటాక్షముగంటి చూపువలన గలిగినదియునైన చూపు శృంగారదృష్టియనబడును. ఈదృష్టి మన్మథావేశముగల స్త్రీలను జూచుటమొదలగువానియందు చెల్లును.

౫ - ఉల్లోకిత॥ శ్లో॥ ఉల్లోకితాపరిజ్ఞేయాఊర్ధ్వభాగావలోకనమ్॥

తా॥ మీదిభాగమునుజూచుటగలది ఉల్లోకితదృష్టియనబడును.

విని॥ శ్లో॥ అత్యున్నతాదివస్తూనాంపూర్వజన్మనియుజ్యతే॥

తా॥ పొడువులగు పదార్థములనుజూచుటయందును, పూర్వజన్మమునుతలచుట యందును, ఈదృష్టి చెల్లును.

౬ - అద్భుత॥ కిఞ్చిత్కుఞ్చితపక్ష్మాగ్రాపక్ష్మనిర్యద్విస్మయాకులితా।
సవికాసనమాదృష్టిరద్భుతేతి ప్రకీర్త్యతే॥

తా॥ కొంచెమువంపబడినరెప్పలకొనలును, ఆశ్చర్యముచేత నెత్తబడినకనుబొమ్మ లును గలవిలాసముతోడిసమమైనచూపు అద్భుతదృష్టియనబడును.

విని॥ శ్లో॥ ఏషాతుభావశాస్త్రజ్ఞైరద్భుతాదిషుకీర్తితా॥

తా॥ ఈదృష్టిఆశ్చర్యముమొదలైనవానియందు వినియోగించును.

౭ - కరుణ॥ శ్లో॥ విస్రస్తోర్ధ్వపుటానాసాగ్రదృష్టిర్మన్థరతారకా।
నాసావలోకినీదృష్టిఃకరుణాకరుణారసే॥

తా॥ దిగువకువ్యాపించినదియు, సగముతెరవబడినదియు, కన్నీళ్లుగలదియు, మంచి దియు, మెల్లగాతిరుగుచున్న నల్లగ్రుడ్లుగలదియు, ముక్కుకొనయందు నిలుపబడినదియు నైనచూపు కరుణాదృష్టియనబడును. ఈదృష్టి కరుణారసమునందు వినియోగపడును.

౮ - విస్మయ॥ శ్లో॥ ఉద్ధతారచనాత్యర్థంసమావికసితాతథా।
విస్పృష్టపుటయుగ్మాచవిస్మయావిస్మయాదిషు॥

తా॥ మిక్కిలినిక్కను చూపునదియు, సమమయినదియు, వికాసముగలదియు, చక్కగాతెరవబడినరెప్పలు గలదియునైన చూపు విస్మయదృష్టి యనబడును. ఈదృష్టి ఆశ్చర్యముమొదలైనవానియందు చెల్లును.

౯ - దృప్త॥ శ్లో॥ స్థిరావికాసనహితానిశ్చలీకృతతారకా।
స్వసన్నివేశినీదృప్తాదృష్టిరుత్సాహగోచరా॥

తా॥ నిలుకడగలదియు,వికాసముతోగూడినదియు, చలింపనినల్లగ్రుడ్లుగలదియు, స్వస్థానగతమయినదియునై నదృష్టిదృప్తయనబడును. ఇదిఉత్సాహమందు చెల్లును.

౧౦ - విషణ్ణ॥ శ్లో॥ విస్తారితపుటద్వన్ద్వా విశ్లిష్టాస్తనిమేషణా।
స్తబ్ధతారామనాగ్దృష్టిర్విషణ్ణేతినిగద్యతే॥

తా॥ విరిసినరెప్పలును, తొలగినరెప్పపాట్లును, చలింపనినల్లగ్రుడ్లునుగలదివిష ణ్ణదృష్టియనబడును.

వి - శ్లో॥ విషాదేచైవచిన్తాయాందృష్టిరేషాప్రకీర్తితా॥

తా॥ ఖేదమునందును, విచారమునందును, ఈదృష్టివినియోగించును.

౧౧ - భయానక॥ శ్లో॥ స్తబ్ధోద్వృత్తపుటాత్యర్థంచఞ్చలాఫుల్లతారకా॥
భయానకాభవేద్దృష్టిఃభృశంభీతేభయానకే॥

తా॥ చలింపనిమీదికి ఎత్తబడినరెప్పలతో మిక్కిలిచలించుచు వికాసమునొంది యున్ననల్లగ్రుడ్లుగలచూపుభయానకదృష్టియనబడును. ఇదిమిక్కిలి భయపడినదానియం దును, భయానకరసమునందును, వినియోగపడును.

౧౨ - సాచి॥ శ్లో॥ సాచీదృష్టిరితిజ్ఞేయా అపాఙ్గచలనక్రమాత్॥
ఇఙ్గితాదిష్వియంప్రోక్తాభరతాగమవేదిభిః॥

తా॥ క్రమముగాకడకంటివరకుచలించునది సాచీదృష్టియనబడును. ఈదృష్టిజాడ చూపుటమొదలైనవానియందు వినియోగించునని భరతశాస్త్రజ్ఞులుచెప్పుదురు.

౧౩ - ద్రుత॥ శ్లో॥ తారాద్వయస్యచలనాద్ద్రుతదృష్టిరుదాహృతా॥

తా॥ రెండునల్లగ్రుడ్లయొక్కచలనముగలదిద్రుతదృష్టియనబడును.

వి॥ శ్లో॥ ఏతస్యావినియోగస్తుసమ్భ్రమాదిషుకీర్తితా॥

తా॥ ఈదృష్టిసంభ్రమముమొదలైనవానియందువినియోగింపబడును.

౧౪ - వీర॥ శ్లో॥ దీప్తావికసితాఫుల్లామధ్యాగామ్భీర్యశాలినీ।
వీరావీరరసేప్రాహురత్యుద్భాసమతారకా॥

తా॥ వెలుగునదియు, తేటయయినదియు, విరిసినదియు, ఉగ్రమును శాంత మును గాక మధ్యస్థమై యుండునదియు, లోపలనణగిన యభిప్రాయము గల్గదియు, కలక లేనిదియు, సమములయిన నల్లగ్రుడ్లు గలదియునైన చూపు వీరదృష్టి యనబడును. ఈ దృష్టి వీరరసమునందు వినియోగించును.

౧౫ - రౌద్ర॥ శ్లో॥ అస్నిగ్ధాలోహితాక్రూరానిస్తబ్ధపుటతారకా । భ్రుకుటీ
కుటిలోద్వృత్తా రౌద్రారౌద్రేదృగుచ్యతే॥

తా॥ ప్రీతిలేనిదియు, ఎరుపయినదియు, క్రూరమయినదియు, చలించెడిరెప్పలు నల్లగ్రుడ్లు గలిగినదియు, వంకరైన కనుబొమలు గలిగినదియు, మీదికి తెరవబడియునైన చూపు రౌద్ర దృష్టియనబడును. ఈ దృష్టి రౌద్రరసమునందు వినియోగించును.

౧౬ - దూర॥ శ్లో॥ కిఞ్చిదూర్ధ్వవికాసేనదూరదృష్టిరుదాహృతా॥

తా॥ కొంచెముమీది కెత్తబడిన చూపు దూర దృష్టి యనబడును.

వి॥ శ్లో॥ దూరావలోకనేప్రోక్తా భావశాస్త్రవిచక్షణైః॥

తా॥ దూరముననుండు వస్తువులను జూచుటయందు ఈదృష్టి వినియోగపడును.

౧౭ - ఇంగిత॥ శ్లో॥ వమాక్షేఙ్గితదృష్టిస్యాత్కటాక్షచలనక్రమాత్।
ఇఙ్గితాదిష్వియంభావ నేతృభిస్సముదాహృతా॥

తా॥ కడకన్నులచలనమువలన సంతోషముతో గూడిన చూపు ఇంగిత దృష్టి అనబడును. ఇది జాడమాపుట మొదలైనవానియందు వినియోగింపబడును.

౧౮ - విలోకిత॥ శ్లో॥ వీక్షణంపృష్ఠభాగేయు త్తద్విలోకితముచ్యతే।
ఇయందృష్టిర్భవేత్పశ్చాద్దేశవృత్త్యవలోకనే॥

తా॥ వెనుకతట్టు చూచునట్టిచూపు విలోకిత దృష్టియనబడును. ఇది వెనుకతట్టు ఉండువానినిజూచుటయందు వినియోగపడును.

౧౯ - వితర్కితా॥ శ్లో॥ వికాసితోద్వృత్తపుటా తథైవోత్ఫుల్లతారకా।
త్రాసితాసమతారాచ దృష్టిర్జ్ఞేయావితర్కితా॥

తా॥ తేటమై మీదికి తెరవబడిన రెప్పలు గలదియు, ప్రకాశమునైననల్లగ్రుడ్లు గలదియు, భయముతో గూడినదియు, సమములైన నల్లగ్రుడ్లుగలదియునైన చూపు వితర్కితా దృష్టియనబడును.

వి॥ శ్లో॥ ఏషాతుభావశాస్త్రజ్ఞై రూహాదిషునియుజ్యతే॥

తా॥ ఈదృష్టి ఊహించుట మొదలైనవానియందు వినియోగించును.

౨౦ - శఙ్కితా॥ శ్లో॥ కిఞ్చిచ్చలాస్థిరాకిఞ్చి దున్నతాతిర్యగాయతా।
గూఢాచకితతారాచ శఙ్కితాదృష్టిరుచ్యతే॥

తా॥ కొంచెము చలనము గలదియు, కొంచెము నిలుకడగలదియు, నిక్కినదియు, అడ్డపువిరివిగలదియు, మరుగైనదియు, బెదరును తోపించెడి నల్లగ్రుడ్లుగలదియునైనచూపు శంకిత దృష్టియనబడును.

వి॥ శ్లో॥ శఙ్కాదిషుప్రయోక్తవ్యాప్రోక్తానాట్యవిశారదైః॥

తా॥ ఇదిశంక మొదలయినవానియందు వినియోగింపబడును.

౨౧ - అభితప్తా॥ శ్లో॥ పుటప్రచలనంయత్రతారకాదన్యవాలసా।
అభితప్తానకృద్దృష్టిర్నిర్వేదశ్రమఖేదయోః॥

తా॥ రెప్పలకదలికయు నల్లగ్రుడ్లతోపికయుగలమెల్లనిచూపు అభితప్తదృష్టియనబడును. ఇదివిసుగుమొదలగు వానియందు వినియోగించును.

౨౨ - అవలోకిత॥ శ్లో॥ అధస్తాద్దర్శనంయత్తదవలోకితముచ్యతే॥

తా॥ క్రిందుగచూచెడిచూపు అవలోకితదృష్టియనబడును.

వి॥ శ్లో॥ వినియోగోఽథవేదస్యావిచారపఠనాదిషు॥

తా॥ ఈదృష్టివిచారము చదువుటమొదలైన విషయములందువినియోగించును.

౨౩ - శూన్య॥ శ్లో॥ సమతారాపుటాబాహ్యా నిష్కమ్పాశూన్యదర్శనా॥
బాహ్యార్థగ్రహణేచేయంశూన్యదృష్టిరుదాహృతా॥

తా॥ సమములైననల్లగ్రుడ్లును రెప్పలును గలదియు, బయలుపడినదియు, చలనములేనిదియు, శూన్యమునుచూచునదియునైన చూపుశూన్యదృష్టియనబడును.ఇదిబాహ్యార్థగ్రహణమునందువినియోగించును.

# నన్దికేశ్వరప్రోక్తాఽభినయదర్పణమ్.

౨౪ - హృష్ట॥ శ్లో॥ చఞ్చలాదృశ్యతేయత్రరుచిరాచనిమేషభాక్।
ఈషత్సఙ్కోచితాదృష్టిర్హృష్టాహాసేప్రయుజ్యతే॥

తా॥ చలించునదియు, మనోహరమయినదియు, రెప్పపాట్లుగలదియు, కొంచెము వంచబడినయదియునైనచూపుహృష్టదృష్టియనబడును. ఈదృష్టినవ్వునందు వినియోగపడును.

౨౫ - ఉగ్ర॥ శ్లో॥ సమ్యగ్వికసితాకిఞ్చిదపాఙ్గద్వయశోణిమా।
ఉగ్రదృష్టిస్సమాఖ్యాతాఉగ్రాదిషునియుజ్యతే॥

తా॥ రెప్పగావికసించినదియురెండుకనుగొనలందును ఎరుపుగలదియునైనచూపు ఉగ్రదృష్టియనబడును. ఇదిఉగ్రముమొదలైనవానియందుచెల్లును.

౨౬ - విభ్రాన్త॥ శ్లో॥ చలత్తారాచవిభ్రాన్తాదృష్టిర్విస్తృతదర్శనా॥
మధ్యేస్యాద్వికలోత్ఫుల్లావిభ్రాన్తాసమ్భ్రమాదిషు॥

తా॥ చలించుచున్న నల్లగ్రుడ్లుగలిగినదియు, భ్రమించునదియు, ప్రీతినిగనబరుచునదియు, నడుమనడుమవెలవెలపాటును తేటదనమును గలిగినదియునైన చూపు విభ్రాంతదృష్టియనబడును. ఇదిసంభ్రమముమొదలైనవానియందువినియోగపడును.

౨౭ - శాన్త॥ శ్లో॥ క్రమమాణపుటాసన్నాకిఞ్చిచ్చఞ్చలలోచనా।
చలత్తారాకృతాపాఙ్గాదృష్టిశ్శాన్తాశమాదిషు॥

తా॥ క్రమమయిన రెప్పలకూడికగలదియు, కొంచెముచలించునట్టికన్నులు గలిగినదియు, చలించుచున్న నల్లగ్రుడ్లు గలిగినదియునైనచూపు శాంతదృష్టియనబడును. ఇది శమముమొదలైన వానియందుచెల్లును.

౨౮ - మీలిత॥ శ్లో॥ దృష్టేరర్ధవికాసేనమీలితాదృష్టిరీరితా॥

తా॥ సగము తెరవబడిన కన్నులుగలది మీలితదృష్టియనబడును.

విని॥ శ్లో॥ పారవశ్యాదిభావేషు ప్రయోక్తవ్యానిమీలితా॥

తా॥ పరవశత్వముమొదలైనభావములయందు ఈదృష్టియుపయోగింపబడును.

౨౯ - సూచనా॥ శ్లో॥ హస్తాభియోగచలనాత్కిఞ్చిన్ముకుళితాకృతిః।
సూచనాదృష్టిరాఖ్యాతాసూచనాదిషుయుజ్యతే॥

తా॥ చేసైగననుసరించి కొంచెము మూయబడినకన్నులుగలది సూచనాదృష్టియనబడును. ఇదిజాడచూపుటమొదలైనవానియందుచెల్లును.

౩౦ - లజ్జిత॥ శ్లో॥ పతితోర్ధ్వపుటావ్రీడాఅధరచ్యుతతారకా।
కిఞ్చిత్కుఞ్చితపక్ష్మాగ్రాలజ్జితాలజ్జితాదిషు॥

తా॥ వాలినమీది రెప్పలును, సిగ్గువలనవాల్పబడిన నల్లగ్రుడ్లును, కొంచెము ముడిగినరెప్పలకొనలునుగలది లజ్జితదృష్టియనబడును. ఈదృష్టిసిగ్గుపడుట మొదలైనవాని యందు వినియోగించును.

౩౧ - మలిన॥ శ్లో॥ మలినాన్తాచలత్పక్ష్మాకిఞ్చిన్ముకుళితాకృతిః।
అక్ష్ణ్యాచాకృష్టతారాదృఙ్మలినాదృశ్యతేస్త్రియామ్॥

తా॥ సంకోచించినకనుగొనలును చంచలములైనరెప్పలును గలిగికొంచెమువుడిగినకన్నులచే ఆకర్షింపబడిన నల్లగుడ్లుగలది మలినదృష్టి యనబడును. ఇది స్త్రీయందు గనబడును.

౩౨ - త్రస్త॥ శ్లో॥ అత్యర్థవికసితాపూర్వంపశ్చాద్విరళతారకా।
త్రస్తాత్రాసముదేదృష్టి స్పన్దోద్వృత్తపుటద్వయా॥

తా॥ తొలుతవికాసముగలదై పిమ్మటచలించుచున్న నల్లగ్రుడ్లతో సరిగామీదికెత్తబడిన రెప్పలుగలదిత్రస్తదృష్టియనబడును. ఇదిభయమందును మదమునందును చెల్లును.

౩౩ - మ్లాన॥ శ్లో॥ శిథిలామన్థరచలాక్రమాన్నిర్భుగ్నతారకా।
పక్ష్మాగ్రభ్రూపుటామ్లానా రోగాద్యమ్లానాదికేష్వియమ్॥

తా॥ సడలినకొంచెపుకదలికతో క్రమముగాసోలుచున్న నల్లగ్రుడ్లుగలిగి రెప్పలకొనలనంటుచున్నకనుబొమ్మలుగలదిమ్లానదృష్టియనబడును. ఇది వాడినవస్తువులందు చెల్లును.

౩౪ - ముకుళ॥ శ్లో॥ స్ఫురదాసక్తపక్ష్మాగ్రా సౌమ్యామిళితతారకా।
మీలితోర్ధ్వపుటాదృష్టిరానన్దేముకుళాభవేత్॥

తా॥ కదలుచున్న రెప్పలకొనలచేరికయు, తిన్నదనమును, కలసిననల్లగ్రుడ్లును, మూయబడిన పైరెప్పలునుగలది ముకుళదృష్టియనబడును. ఇదియానందమునందువినియోగించును.

౩౫ - కుఞ్చిత॥ శ్లో॥ కిఞ్చిత్కుఞ్చితపక్ష్మాగ్రపుటాత్యర్థం నికుఞ్చితా।
తారాభ్యాంకుఞ్చితాదృష్టి రనిష్టాసూయతాదిషు॥

తా॥ కొంచెమువాల్పబడిన కొనరెప్పలును మిక్కిలిలోగొనబడిన నల్లగ్రుడ్లునుగలది కుంచితదృష్టియనబడును. ఇదిఅనిష్టమునందును అసూయత మొదలైనవానియందును వినియోగపబడును.

౩౬ - ఆకాశ॥ శ్లో॥ ఆకాశదృష్టిరాకాశే బహువ్యావృతతారకా।
ఏషాప్యాకాశసఞ్చారి వస్త్వాదిషునియుజ్యతే॥

తా॥ ఈదృష్టి ఆకాశమునందును, మీదిభాగమునందు సంచరించెడి వస్తువులందును చెల్లును.

౩౭ - అర్ధముకుళ॥ శ్లో॥ సస్మితాచభవేత్తారా కిఞ్చిదున్మిషితాపుటా।
స్యాదర్ధముకుళాదృష్టిశ్చానన్దాహ్లాదగోచరా॥

తా॥ చిరునవ్వుతో మీదికి కూరుకొనబడుచున్న రెప్పలుగలది అర్ధముకుళదృష్టి యనబడును. ఇదిఆనందాహ్లాదములకు గోచరమైయుండును.

౩౮ - అనువృత్త॥ శ్లో॥ అనువృత్తాయదుక్తం తద్భూయోభూయోనిరీక్షణమ్॥

తా॥ మాటిమాటికిచూచుటగలది అనువృత్తదృష్టియనబడును.

వి॥ శ్లో॥ త్వరాదిషుప్రయోక్తవ్యాకలితాభావకోవిదైః॥

తా॥ ఇదితత్తరపాటుమొదలగువానియందు వినియోగింపబడును.

౩౯ - విప్లుత॥ శ్లో॥ స్ఫురితోత్ఫుల్లపతితపుటాదృగ్విప్లుతాభవేత్॥

తా॥ కదలింపబడి విరిసివాలబడిన రెప్పలుగలదివిప్లుతదృష్టియనబడును.

విని॥ శ్లో॥ ఏషాతుసర్వవస్తూనాంసౌన్దర్యాద్యవలోకనే॥

తా॥ ఈదృష్టి అన్నివస్తువులయొక్క సౌందర్యాదులను జూచుటయందుచెల్లును.

౪౦ - జిహ్మ॥ శ్లో॥ ఆకుఞ్చితపుటాగూఢతిర్యఙ్మన్థరలోకినీ।
జిహ్మాదృగ్గూఢతారాస్యాగూఢార్థానూయతాదిషు॥

తా॥ అంతటనువాల్పబడిన రెప్పలుగలిగి పయికితెలియక అడ్డముగాను మెల్లగాను చూచుటగలది జిహ్మదృష్టియనబడును. ఇదిగూఢార్థములయందును అసూయ మొదలైన వానియందునుచెల్లును.

౪౧ - వికోశ॥ శ్లో॥ అనిమేషాచలత్తారా వ్యాకోచితపుటద్వయా।
వికోశాఖ్యాభవేద్దృష్టిః హర్షాదిషునియుజ్యతే॥

తా॥ రెప్పపాటులేనిదియు, చలించుచున్న నల్లగ్రుడ్లుగలదియు, సంకుచితములైన రెప్పలుగలదియునైన చూపువికోశదృష్టియనబడును. ఇది సంతోషము మొదలైనవాని యందుచెల్లును.

౪౨ - మదిర॥ శ్లో॥ ఆఘూర్ణితామార్గితా మధ్యాక్షుద్రాక్షీ కుఞ్చితాచలా।
ఘూర్ణినాకీర్తితాదృష్టిః మదిరాతరుణీమదే॥

తా॥ ఒప్పిదమును ఓక్కలుజూచుటయు కలతపాటునుగలదియు, మధ్యస్థమయి క్రిందికివాల్పబడినదియు, బెదరుగలదియునైన చూపుమదిరాదృష్టియనబడును. ఇదితరుణ మదమునందు చెల్లును.

౪౩ - హృద్య॥ శ్లో॥ అవ్యవస్థితసఞ్చారాస్మనాగ్గళితతారకా।
ఆకుఞ్చితపుటాహృద్యామధ్యమాదిషు యుజ్యతే॥

తా॥ నిలుకడలేనిదైతడబాటుగలిగి కొంచెముచలింప జేయబడిననల్లగ్రుడ్లునువంప బడినరెప్పలునుగలమనోజ్ఞమైన చూపు హృద్యదృష్టి యనబడును. ఇదిమధ్యమములైన వస్తువులయందుచెల్లును.

౪౪ - లలిత॥ శ్లో॥ భ్రూక్షేపాకుఞ్చితాపాఙ్గాస్మితాస్మరకృతేనచ।
వికాసేనాన్వితాదృష్టిఃలలితాలలితాదిషు॥

తా॥ కనుబొమ్మలకదలికచేముడుగజేయబడిన కడకన్నులుమన్మథవికారమువలనిచి రునవ్వును, తేటదనమునుగలది లలితదృష్టియనబడును. ఇదిఆనందకరములైన వస్తువుల యందుచెల్లును.

---

## అథగ్రన్థాన్తరస్థభ్రూభేదానిరూప్యన్తే.

శ్లో॥ సహజాపతితోత్క్షిప్తాచతురారోచితాతథా।
కుఞ్చితేతిషడేవాత్రభ్రూచాతుర్యవతీక్రియా॥

తా॥ సహజ, పతిత, ఉత్క్షిప్త, చతుర, రోచిత, కుంచిత, అని భ్రూభేదములు (కనుబొమలచతురత్వముగల క్రియలు) ఆరువిధములుగా జెప్పబడుచున్నది.

౧ - సహజ॥ శ్లో॥ సహజాస్యాత్స్వభావభ్రూః వికారరహితా ముఖే।
సహజాదిషుయుజ్యేతఇతిభావవిదోవిదుః॥

తా॥ ముఖమందే వికారమును లేక స్వాభావికముగనుండెడి క్రియగలకనుబొమ్మ సహజభ్రూ అనబడును. ఇది. స్వభావము మొదలైనవానియందు చెల్లును.

౨ - పతిత॥ శ్లో॥ అచంచలభ్రూయుగంచపతనాత్పతితామతా॥

తా॥ చలింపనికనుబొమ్మలను వాల్చినట్టి క్రియగలది పతితభ్రూ అనబడును.

విని॥ శ్లో॥ జుగుప్సాయాం విస్మయేచ అసూయాయాంభవేదసౌ॥

తా॥ ఇదిరోతపడుట యందును, ఆశ్చర్యమందును, ఓర్వనితనమందును, చెల్లును.

౩-ఉత్క్షిప్త॥ శ్లో॥ ఏకావాసాద్వితీయావాయదుత్క్షిప్తవతీతరామ్। ఉత్క్షిప్తాసాభవేత్ స్త్రీణాంకోపేసత్యవచస్యపి ॥ శృఙ్గారభావేలీలాయాంభ్రూరేషావినియుజ్యతే॥

తా॥ కనుబొమ్మలురెంటియందును ఒక్కటిగాని రెండునుగాని మిక్కిలినిక్కింపబడునేని ఉత్క్షిప్తభ్రూ అనబడును. ఇది స్త్రీల కోపమునందును, సత్యవచనమునందును, శృంగారభావచేష్టయందును, లీలయందును, వినియోగింపబడును.

౪ - చతుర॥ శ్లో॥ ద్వితీయసహితాస్తోకాస్ఫురితాయదమన్థరా।
చతురాముఖసంస్పర్శ్యాహృదయానన్దసమ్భ్రమే॥

తా॥ రెండు కనుబొమ్మలకూడికతో కొంచెము మెల్లగాచలింపజేయబడియెనేని చతురభ్రూ అగును. ఇదిముఖముతాకుట, మనస్సంతోషము, వేగిరపాటు, వీనియందు ఉపయోగింపబడును.

౫ - రేచిత॥ శ్లో॥ లావణ్యాదనురాక్షిప్తాయద్యేకారేచితామతా॥

తా॥ అందముగాను ఇంపుగాను ఒకబొమ్మ వంపబడునేని అది రేచితభ్రూ అనబడును.

విని॥ శ్లో॥ రహస్యశ్రవణే సాధుకలనేపదవీక్షణే॥

తా॥ ఇదిరహస్యమును వినుట, మంచిదిఅనుట, స్థానవీక్షణము వీనియందు చెల్లును.

౬ - కుంచిత॥ శ్లో॥ ఏకావాసాద్వితీయావా కుఞ్చితాకుఞ్చితామతా॥

తా॥ ఒకబొమ్మయేనియును రెండుబొమ్మలు నేని ముడిగింపబడినయెడ అదికుంచితభ్రూ అనబడును.

విని॥ శ్లో॥ మోట్టాయితే కుట్టమితే విలాసేకిలికించితే॥

తా॥ ఇదిమోట్టాయితము, కుట్టమితము, విలాసము, కిలికించితము, అనుశృంగారచేష్టావిశేషములందు వినియోగింపబడును. మోట్టాయితము మొదలగువానియర్థము భరతరసప్రకరణమందు వివరింపబడియున్నది.

---

## అథచతుర్విధగ్రీవాభేదానిరూప్యన్తే.

శ్లో॥ సున్దరీచతిరశ్చీనాతథైవపరివర్తితా।
ప్రకమ్పితాచభావజ్ఞైర్జ్ఞేయాగ్రీవాచతుర్విధా॥

తా॥ సుందరి, తిరశ్చీన, పరివర్తిత, ప్రకంపిత అని గ్రీవా (మెడ) భేదములు నాలుగువిధములుగా భావజ్ఞులచే జెప్పడిబయున్నవి.

౧ - సున్దరి॥ శ్లో॥ తిర్యక్ప్రచలితా గ్రీవా సున్దరీతి నిగద్యతే॥

తా॥ అడ్డముగా గదలింపబడినది సుందరిగ్రీవయనబడును.

వి॥ శ్లో॥ స్నేహారమ్భే తథాయత్నే సమ్యగర్థేఽపి చస్మృతా।
సరసత్వాఽనుమోదే చ సా గ్రీవా సున్దరీ మతా॥

తా॥ స్నేహారంభము, యత్నము చేయుట, మంచిదనుట, తలచుట, సరసము, అనుమోదము, వీనియందు ఈ గ్రీవయుపయోగింపబడును.

౨ - తిరశ్చీన॥ శ్లో॥ పార్శ్వద్వయోర్ధ్వ భాగే తు చలనాత్సర్పయానవత్।
సా గ్రీవా తు తిరశ్చీనేత్యుచ్యతే నాట్యకోవిదైః॥

తా॥ ఇరుప్రక్కల నూర్ధ్వభాగములయందు సర్పగతివలెగదలించుటగలదితిరశ్చీనాగ్రీవయనబడును.

వి॥ శ్లో॥ ఖడ్గభ్రమే సర్పగత్యాం తిరశ్చీనా నిగద్యతే॥

తా॥ కత్తి నిద్రిప్పుటయందును నాగుబాముపోవుటయందును ఈ గ్రీవవినియోగించును.

౩ - పరివర్తిత॥ శ్లో॥ సవ్యాఽపసవ్యచలితా గ్రీవా యత్రాఽర్ధచన్ద్రవత్।
సా తు నాట్యకలాఽభిజ్ఞైర్విజ్ఞేయా పరివర్తితా॥

తా॥ ఇరుప్రక్కలయందును అర్ధచంద్రాకారముగాకదలింపబడునది పరివర్తితాగ్రీవయనబడును.

వి॥ శ్లో॥ శృఙ్గారనటనే కాన్తాకపోలపరిచుమ్బనే।
నాట్యతన్త్రకలాభిజ్ఞైర్విజ్ఞేయా పరివర్తితా॥

తా॥ శృంగారనటనమునందును, స్త్రీల చెక్కిళ్లు ముద్దుపెట్టుకొనుటయందును, ఈ గ్రీవయుపయోగించును.

౪ - ప్రకమ్పిత॥ శ్లో॥ పురస్తపశ్చాత్ప్రచలనాత్కపోతీకణ్ఠకమ్పవత్।
ప్రకమ్పితేతి సా గ్రీవా ప్రోక్తా నాట్యవిశారదైః॥

తా॥ ముందువెనుకలుగా పావురాయి మెడకదలించునట్లు గదలింపబడునది ప్రకంపిత గ్రీవయనబడును.

వి॥ శ్లో॥ యుష్మదస్మదితిప్రోక్తే దేశీనాట్యవిశేషకే । డోలాయాఙ్గణితే చాఽపి ప్రయోక్తవ్యా ప్రకమ్పితా॥

తా॥ నీవు నేను అనుటయందును, దేశీయనాట్యమునందును, ఉయ్యేలయందును, లెక్కపెట్టుటయందును, ఈ గ్రీవ యుపయోగింపబడును.



## అథద్వాదశహస్తప్రాణలక్షణం నిరూప్యతే.

శ్లో॥ హస్తానాం ద్వాదశ ప్రాణాస్తేషాం లక్షణముచ్యతే॥

తా॥ హస్తప్రాణములు పండ్రెండు, వానిలక్షణము చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ప్రసారణం కుఞ్చితఞ్చ రేచితం పుఙ్ఖితం తథా । అపవేష్టితకం చాఽపి ప్రేరితోద్వేష్టితే తథా ॥ వ్యావృత్తిః పరివృత్తిశ్చ సఙ్కేతస్తదనన్తరమ్।
చిహ్నం పదార్థటీకేతి ప్రాణా ద్వాదశ హస్తజాః॥

తా॥ ప్రసారణము, కుంచితము, రేచితము, పుంఖితము, అపవేష్టితకము, ప్రేరితము, ఉద్వేష్టితము, వ్యావృత్తి, పరివృత్తి, సంకేతము, చిహ్నము, పదార్థటీకము అనిహస్తజప్రాణములు పండ్రెండు.

౧ - ప్రసారణము॥ శ్లో॥ ప్రసారణమితి ప్రోక్తమఙ్గుళీనాం ప్రసారణాత్॥

తా॥ వ్రేళ్లను జాచుటవలననైన హస్తప్రాణము ప్రసారణమనఁబడును.

౨ - కుఞ్చితము॥ శ్లో॥ కుఞ్చనాదఙ్గుళీనాం చ కుఞ్చితం సముదీరితమ్।

తా॥ వ్రేళ్లను ముడిగించుటవలననైన హస్తప్రాణము కుంచితమనఁబడును.

౩ - రేచితము॥ శ్లో॥ అఙ్గుళీనాం ప్రచలనాద్రేచితం పరికీర్తితమ్॥

తా॥ వ్రేళ్లను గదలించుటవలననైన హస్తప్రాణము రేచితమనఁబడును.

౪ - పుఙ్ఖితము॥ శ్లో॥ పురోభాగే కుఞ్చితో వా రేచితో వా ప్రసారితః॥
యో హస్తస్తు పతాకాఽదిర్నామ్నాఽసౌ పుఙ్ఖితో భవేత్॥

తా॥ పతాకాదిహస్తములందు వ్రేళ్లు ముందరికి వంచుట కదలించుట చాచుట వీని వలననైన హస్తప్రాణము పుంఖితము అనఁబడును.

౫ - అపవేష్టితము॥ శ్లో॥ అధస్తాద్గమనం యస్తు హస్తో నామ్నాఽపవేష్టితః॥

తా॥ వ్రేళ్లను క్రిందుగా చాచుటయనెడి హస్తప్రాణము అపవేష్టితమనఁబడును.

౬ - ప్రేరితము॥ శ్లో॥ పశ్చాద్భాగే కుఞ్చితో వా ప్రేరితో వా ప్రసారితః। యో హస్తః కథితస్సోఽయం ప్రేరితః పూర్వసూరిభిః॥

తా॥ వ్రేళ్లను వెనుకప్రక్కకు ముడిగించుట, కదలించుట, చాచుటయునైన హస్తప్రాణము ప్రేరితము అనఁబడును.

౭ - ఉద్వేష్టితము॥ శ్లో॥ హస్తానామూర్ధ్వభాగే యద్గమనం చాఽస్తి నర్తనే।
తదుద్వేష్టితమిత్యాహుర్భరతాఽగమవేదినః॥

తా॥ నాట్యకర్మమునందు చేతులను మీదికెత్తుటచేనైన హస్తప్రాణము ఉద్వేష్టితము అనఁబడును.

౮ - వ్యావృత్తము॥ శ్లో॥ ఉదగ్రతః పార్శ్వభాగే హస్తో వ్యావృత్తకో భవేత్॥

తా॥ పార్శ్వభాగములందు మీదికెత్తఁబడిన చేతులుగల హస్తప్రాణము వ్యావృత్తమనఁబడును.

౯ - పరివృత్తము॥ శ్లో॥ పార్శ్వభాగాచ్చ పురోభాగే యో హస్తో నటనే
కృతః॥ పరివృత్తస్స ఆఖ్యాతో నామ్నా హస్తవిశారదైః॥

తా॥ నాట్యముచేయునపుడు పార్శ్వములనుండి ముందరికట్టునకు చేతులనుతెచ్చుట అనుహస్తప్రాణము పరివృత్తము అనబడును.

౧౦ - సఙ్కేతము॥ శ్లో॥ ఊహః విధాన రచనా వినా స్థాలోక్తి పర్వకమ్।
యోహస్తోనియమం ప్రాప్తస్సనఙ్కేత ఉదాహృతః॥

తా॥ స్థాలోక్తిపరంపరలేక ఊహచేత తెలిసికోదగిన సైగగలహస్తప్రాణము సంకేతమనబడును.

౧౧ - చిహ్నము॥ శ్లో॥ ప్రత్యక్షాణాం పరోక్షాణాం వస్తూనాంనాట్యకర్మణి।
స్థావరత్వం జఙ్గమత్వమేవ మష్టాఽపితాదృశాః । తదాకారప్రకటనం తన్ముఖస్యనిరీక్షణమ్ । తత్థానదర్శనంచాపి తద్వజానాంచదర్శనమ్।
తదాయుధప్రకటనం తద్గతాఽర్థ నివేదనమ్। తద్వ్యాప్తదర్శనంచాఽపి తచ్చేష్టా దర్శనంతథా। తేషాంచ దర్శనేత్యాది నానాచిహ్నం విధీయతే॥

తా॥ నాట్యకర్మమునందు ప్రత్యక్షపరోక్షవస్తువులయొక్క స్థావరజంగమత్వములను దెలుపు చిహ్నములు యెనిమిది. అవి వానియాకారములనుజూపుట, వానిముఖములనుజూపుట, అవి యుండుతావులనుజూపుట, వాని టెక్కెములనుచూపుట, వానియాయుధములను దెలుపుట, వానియందు గలప్రయోజనములను దెలుపుట, వానిచేవ్యాపింపజేయబడినవానిని దెలుపుట, వానిచేష్టలను దెలుపుట, వానిగురుతులను దెలుపుట. ఈ యెనిమిదిలక్షణములుగల హస్తప్రాణము చిహ్నము అనబడును.

౧౨ - పదార్థటీకము॥ శ్లో॥ పదానాంకథితానాంస్యాదర్థనిర్వాహతాయది।
ఇయంపదార్థటీకేతికథితోఽభరతాదిభిః॥

తా॥ చెప్పబడుచుండెడు భావవ్యంజకములైన పదములయర్థములను నిశ్చయపరచునట్టిహస్తప్రాణముపదార్థటీకము అనబడును.

---

## అథహస్తభేదానిరూప్యన్తే.

శ్లో॥ అథేదానీన్తుహస్తానాంలక్షణానియథాక్రమమ్।
అసంయుతాస్సంయుతాశ్చద్వేధాహస్తాఃప్రకీర్తితాః॥

తా॥ ఇకనుహస్తములయొక్క లక్షణములుచెప్పబడును. అవియసంయుతములు సంయుతములు అనిరెండువిధములుగలవి.

---

## అథాష్టావింశతివిధాఽసంయుతహస్తా నిరూప్యన్తే.

శ్లో॥ పతాకస్త్రిపతాకోఽర్ధపతాకఃకర్తరీముఖః । మయూరాఽఖ్యోఽర్ధచన్ద్రశ్చాఽప్యరాళశ్శుకతుణ్డకః । ముష్టిశ్చశిఖరాఽఖ్యశ్చకపిత్థఃకటకాముఖః । సూచీచన్ద్రకలాకోశ సర్పశీర్షకరస్మృతః । మృగశీర్షస్సింహముఖో లాఙ్గూలస్సోళపద్మకః । చతురోభ్రమరశ్చైవ హంసాఽస్యోహంసపక్షకః । సందంశోముకుళశ్చైవతామ్రచూడస్త్రిశూలకః । అష్టావింశతిహస్తానామేవంనామానివైక్రమాత్॥

తా॥ పతాకము, త్రిపతాకము, అర్ధపతాకము, కర్తరీముఖము, మయూరము, అర్ధచంద్రము, అరాళము, శుకతుండము, ముష్టి, శిఖరము, కపిత్థము, కటకాముఖము, సూచి, చంద్రకల, కోశము, సర్పశీర్షము, మృగశీర్షము, సింహముఖము, లాంగూలము, సోలపద్మము, చతురము, భ్రమరము, హంసాస్యము, హంసపక్షము, సందంశము, ముకుళము, తామ్రచూడము, త్రిశూలము, అనుఇరువదియెనిమిదియు అసంయుతహస్తములనబడును.

## పతాకహస్తలక్షణమ్.



శ్లో॥ అఙ్గుళ్యస్సకుఞ్చితాఽఙ్గుష్ఠాస్సంశ్లిష్టాప్రసృతాయది।
సపతాకకరస్సప్రోక్తోనృత్యకర్మవిశారదైః॥

తా॥ అన్నివ్రేళ్లనుచాచిబొటనవ్రేలిని వంచిపట్టినది పతాకహస్తమనినృత్యశాస్త్రవిశారదులుచెప్పుదురు.

వి॥ శ్లో॥ నాట్యాఽరమ్భేవారివాహేవనేవస్తునిషేధనే। కుచస్థలేనిశాయాంచ నద్యామమరమణ్డలే॥ తురఙ్గేఖణ్డనేవాయౌ శయనేగమనోదితే। ప్రతాపేచప్రసాదేచ చన్ద్రికాయాంఘనాఽతపే। కవాటపాటనేసప్తవిభక్త్యర్థేతరఙ్గకే। వీథీప్రవేశభావేఽపి సమత్వేచాఽఙ్గరాగకే। ఆత్మార్థేశపథేచాఽపి తూష్ణీంభావన్యదర్శనే। ఆశీర్వాదక్రియాయాంచ నృపశ్రేష్ఠస్యభావనే। తాళపత్రేచఖేటేచద్రవ్యాదిస్పర్శనేతథా। తత్రతత్రేతివచనేసిన్ధౌతుసుకృతిక్రమే। సంబుద్ధౌతుపురోగేఽపిఖడ్గరూపస్యధారణే। మాసేసంవత్సరేవర్షదినేసమ్మార్జనేతథా। ఏవమర్థేషుయుజ్యన్తేపతాకాహస్తభావనాః॥

తా॥ నాట్యారంభము, మేఘము, వనము, వస్తువులనునిషేధించుట, కుచస్థలము, రాత్రి, నది, దేవసమూహము, అశ్వము, ఖండించుట, వాయువు, శయనము, గమనము, ప్రతాపము, ప్రసాదము, చంద్రిక, మిక్కిలి యెండకాయుట, తలుపుతట్టుట, ఏడువిభక్తులు, అల, వీథిలోప్రవేశించుట, సమముగానుండుట, గంధముపూయుట, తాననుట, పంతము, ఊరకుండుటను తోపించుట, ఆశీర్వదించుట, గొప్పరాజునుజూపించుట, తాటాకు, చెంపపెట్టు, పదార్థమునుస్పృశించుట, అక్కడనేయక్కడనేయనుట, సముద్రము, సుకృతిక్రమము, సంబోధనము, ముందుగాబోవు వాడనుట, కత్తియాకృతినిజూపుట, మాసము, సంవత్సరము, వర్షము, దినము, సమ్మార్జనము, (అనగాతుడుచుట) ఈ అర్థములయందు ఈహస్తమువినియోగపడును.

## గ్రన్థాన్తరస్థపతాకహస్తలక్షణమ్.

శ్లో॥ సంలగ్నతర్జనీమూలేయత్రాఙ్గుష్ఠోనికుఞ్చితః। ప్రసారితతలాఙ్గుళ్యఃపతాకఃప్రభవేత్కరః। ఏకాకినాపురాధాత్రా పరబ్రహ్మనమాగమే। జయేతిస్తుతివేళాయాం పతాకస్యాకృతిఃకరః। యతోభేజేతతోలోకే పతాకఇతివిశ్రుతః॥ అతఏవసమస్తానాం హస్తానామయమాదిమః। పతాకోబ్రహ్మణోజాతః శ్వేతవర్ణోఋషిశ్శివః। బ్రహ్మజాతిర్భవేత్తస్య పరబ్రహ్మాధిదైవతమ్॥

తా॥ తర్జనీమూలమందుజేర్చివంచబడిన బొటనవ్రేలును చాచబడినఅరచేయియు వ్రేళ్లునుగలదిపతాకహస్తమనబడును. ముందుబ్రహ్మయొంటరిగా పరబ్రహ్మను చేరబోయినప్పుడుపతాకాకృతిగాచేయిచాచి జయవిజయీభవయనిస్తోత్రముచేసెను. ఆకారణముచేత అట్లుపట్టబడినచేయి నాటనుండిలోకమునందుపతాకమనిప్రసిద్ధినొందెను. కనుక ఇదియెల్లహస్తములకును మొదటిదాయెను-ఈ పతాకహస్తము బ్రహ్మవలనబుట్టినది. దీని జాతి బ్రాహ్మణజాతి. వర్ణము తెలుపు. ఋషి శివుడు. అధిదేవత బ్రహ్మము.

విని॥ శ్లో॥ జయేతివచనే మేఘే నిషేధే విపినే నిశి । యాహీతివచనే యానే వాహే మరుతి వక్షసి । పురః పుణ్యే చాతిశయే ప్రవాహే విబుధాలయే । హాహాకారే చన్ద్రికాయాం మాతపే సురఖణ్డనే । అర్గళాపుటనే కుడ్యే ఖడ్గే నే పరితోషణే । కపోలే చన్దనాలేపే కృపాణే వారివారణే । సమూహే సైన్యసన్నాహే సమయే భయవారణే । అపాశ్రయే ఆచయే పిధానే శయనే భువి । జ్వాలాసువర్ణధారాసు తరఙ్గే పక్షిపక్షకే । ప్రభువిజ్ఞాపనే త్రేతి వాక్యే యాదృశి తాదృశి । చపేటే వస్తుసంస్పర్శే సరసా ముద్గమర్దనే । వ్యాజస్తుతౌ ప్రతాపే చ దేవతానాం నివేదనే । పార్శ్వాశ్లేషే పతాకాయాం ప్రవాతే వసనాఞ్చలే । శైత్యే తాపే ధాళధళ్యే ఛాయాయాం వత్సరే ఋతౌ । అయనే వాసరే పక్షే మాసే స్వచ్ఛే సుహాసులే । సమానన్నే పాలయేతి లాలయేతి చ భాషణే । బ్రహ్మజాతౌ శుభ్రవర్ణే పతాకోత్ర నియుజ్యతే॥

తా॥ జయజయయనుట, మేఘము, నిషేధము, అడవి, రాత్రి, పొమ్మనుట, నడచుట, గుఱ్ఱము, గాలి, రొమ్ము, ఎదురు, పుణ్యము, అతిశయము, ప్రవాహము, దేవలోకము, హాహాకారము, వెన్నెల, ఎండ, దేవతాసమూహము, గడియతీయుట, గోడ, నరకుట, సంతోషము, చెక్కిలి, గంధముపూయుట, కత్తి, నీటికికట్టవేయుట, గుంపు, దండుయొక్కఆయిత్తము, సమయము, వెరపుతీర్చుట, ఆశ్రయములేమి, కప్పుట, పానుపు, భూమి, నిప్పుమంట, వానధార, అల, పక్షిరెక్క, ప్రభువుతో మనవిచేయుట, కన్న, మాట, ఎట్టిది అట్టిదియనుట, చెంపపెట్టు, వస్తువులనుఅంటుట, కొలను, ఒడలుపిసుకుట, నెపముపెట్టిపొగడుట, ప్రతాపము, దేవతానివేదనము, ప్రక్కకౌగిలింత, పెకెక్కము, పెద్దగాలి, కొంగు, చలి, ఉక్క, తళతళ, నీడ, సంవత్సరము, ఋతువు, అయనము, పగలు, పక్షము, మాసము, తేట, గొప్పవంశము, నమిపించినదిఅనుట, పాలింపుముఅనుట, బ్రాహ్మణజాతి, శుభ్రవర్ణము, వీనియందు ఈహస్తమువినియోగించును.

## త్రిపతాకహస్తలక్షణమ్.



శ్లో॥ సఏవత్రిపతాకస్స్యా ద్వక్రితానామికాఙ్గుళిః॥

తా॥ ముందుచెప్పిన పతాకహస్తమందలి యనామిక, (అనగా చిటికినవ్రేలికి ముందువ్రేలు) వంచబడెనేని యది త్రిపతాకహస్తమగును.

వి॥ శ్లో॥ మకుటే వృక్షభావే చ వజ్రే తద్ధరవాసవే । కేతకీకుసుమే దీపే వహ్నిజ్వాలా విజృమ్భణే ॥ కపోతే పత్రలేఖాయాం బాణార్థే పరివర్తనే । స్త్రీపుంసయోస్సమాయోగే యుజ్యతే త్రిపతాకకః॥

తా॥ కిరీటము, వృక్షభావము, వజ్రాయుధము, ఇంద్రుడు, మొగలిపువ్వు, దీపము, అగ్నిజ్వాలలెగయుట, చెక్కిలి, మకరికా పత్రరేఖ, బాణార్థము, మరల్చు, స్త్రీపురుషులచేరిక, వీనియందు ఈహస్తము వినియోగింపను.

### గ్రన్థాన్తరే త్రిపతాకహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకేఽనామికా వక్రా త్రిపతాకః కరో భవేత్ । శక్రేణానాయతో వజ్రో నస్పృష్ట్వోఽనామికాం వినా । పతాకస్య త్రిభాగేన త్రిపతాక ఇతి స్మృతః । వాసవాత్ త్రిపతాకోఽయం జజ్ఞే తస్య ఋషిర్హరః । రక్తవర్ణః క్షత్ర జాతిరధిదేవో మహేశ్వరః॥

తా॥ క్రిందచెప్పబడిన పతాకహస్తమందు అనామిక (ఉంగరపువేలు) వంచబడినేని యది త్రిపతాకహస్తమగును. ఆదికాలమందు దేవేంద్రుడు వజ్రాయుధము పెట్టుకొనునప్పుడు అనామికనువదలి పతాకముయొక్క మూడుభాగములచేత గ్రహించుటచే నేర్పడినది గనుక ఇది త్రిపతాకము అనబడెను. ఇది ఇంద్రునివలన పుట్టినది. ఎఱ్ఱనివన్నెగలది. క్షత్రియజాతి. దీనికి ఋషిహరుడు. అధిదేవత శివుడు.

వి॥ శ్లో॥ ఆవాహనేఽవతరణే వదనోన్నమనే తథా । స్పర్శే శుభానాం ద్రవ్యాణాం ముఖ్యానేఽనాదరే ఖలే । సన్దేహే కుసుమే వృక్షే వాసవే కులిశాయుధే । అలకానయనే దీపే తిలకోష్ణీషధారణే । కటుగన్ధరసాలేపే నాసాకర్ణస్య సంవృతౌ । అశ్రుసమ్మార్జనే ఘ్రాణే కేతక్యాం పత్రలేఖనే । హాతేభగవిశేషాణాం కేకికలాపి జృంభతే । క్షత్రజాతౌ రక్తవర్ణే త్రిపతాకో నియుజ్యతే॥

తా॥ ఆవాహనము, దిగుట, మొగమెత్తుట, వంచుట, మంగళవస్తువులను ముట్టుట, గురుతిడుట, నమ్మకములేమి, దుర్జనుడు, సందేహము, కిరీటము, వృక్షము, ఇంద్రుడు, వజ్రాయుధము, ముంగురులనెగదువ్వుట, దీపము, బొట్టుపెట్టుకొనుట, పాగాపెట్టుకొనుట, కారైన వాసనగల ద్రవద్రవ్యమును పూయుట, ముక్కుచెవులమూసికొనుట, కన్నులనుతోముట, ఘ్రాణము, మొగలిపువ్వు, మకరికాపత్రములను వ్రాయుట, కొన్నిపక్షులయొక్కపాటు, నిప్పుమంటలులేచుట, క్షత్రియజాతి, ఎఱుపువన్నె వీనియందు ఈహస్తము వినియోగింపను.

### అర్ధపతాకహస్తలక్షణమ్.



శ్లో॥ త్రిపతాకే కనిష్ఠా చేద్వక్రితార్ధపతాకికః॥

తా॥ త్రిపతాకహస్తమందు చిటికెనవ్రేలు వంపబడునేనియది అర్ధపతాకహస్తమనబడును.

వి॥ శ్లో॥ పల్లవే ఫలకే తీరే ఉభయోరితివాచకే । క్రకచే చ్ఛురికాయాం చ ధ్వజే గోపురశృఙ్గయోః । యుజ్యతేఽర్ధపతాకోఽయం తత్తత్కర్మప్రయోగతః॥

తా॥ చిగురు, పలక, గట్టు, ఇద్దరని చెప్పుట, నూరుకత్తి, రంపము, ధ్వజము, గోపురము, కొమ్ము, వీనియందు ఈహస్తము వినియోగించును.

## కర్తరీముఖహస్తలక్షణమ్.



శ్లో॥ అస్యైనచాఽపిహస్తస్యతర్జనీచకనిష్ఠికా।
బహిఃప్రసారితేద్వే చేత్సకరఃస్యాత్కర్తరీముఖః॥

తా॥ అర్ధపతాకహస్తమందలి చిటికెనవ్రేలును చూపుడువ్రేలును వైటికిచాపబడునేనికర్తరీముఖహస్తమగును.

వి॥ శ్లో॥ స్త్రీపుంసయోస్తువిశ్లేషేవిపర్యాసపదేఽపిచ। లుణ్ఠనేనయనాన్తే చమరణేభేదభావనే। విద్యుదర్థేఽప్యేకశయ్యావిరహేపతనేతథా।లతాయాంయుజ్యతేచాఽయంకర్తరీముఖఇష్యతే॥

తా॥ స్త్రీపురుషులయెడబాటు, వ్యత్యస్తస్థానము, దొంగిలించుట, కడకన్ను, చావు, భేదించుట, మెరపు, ఒకపానుపునందలి పడుకవలన నెడబాయుట, క్రిందపడుట, తీగె, వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రన్థాన్తరే.

శ్లో॥ త్రిపతాకేబహిర్యాతాతర్జనీయదికర్తరీ। శశాఙ్కశేఖరః పూర్వంజలన్ధరవధక్షితౌ। చక్రంలిఖితతర్జన్యానికృష్యభువిమధ్యమామ్॥ తదాప్రభృతికర్తర్యుత్పన్నేతిమునిభిస్స్మృతః। కర్తరిశ్శంకరాజ్జాతఃఋషిఃపర్జన్యదేవతా। క్షత్రజాతిస్తామ్రవర్ణశ్చక్రపాణిరధీశ్వరః॥

తా॥ త్రిపతాకహస్తమందు తర్జని బయటచాచబడెనేని కర్తరీ హస్తమగును. పూర్వకాలమునందు శివుడు జలంధరాసురసంహారము కొరకు భూమిలోమధ్యమునుంచి తర్జనిచేచక్రమును వ్రాసెను. అది మొదలుకొని కర్తరిగలిగెనని ఋషులు చెప్పుచున్నారు. కర్తరిహస్తముశివునివలన బుట్టినది. ఇదిక్షత్రియజాతి. ఋషిదేవత పర్జన్యుడు. రక్తవర్ణము. అధిదేవత చక్రపాణి.

వి॥ శ్లో॥ పాదాలక్తకనిర్మాణే పతనేలేఖ్యవాచకే। దమ్పత్యోర్విరహేచైవవిపర్యాసేరమాధవే। చపలాయామేకశయ్యావియోగేమహిషేమృగే। చామరే శైలశృఙ్గేచ వారణే వృషభే గవి। కేశపాశస్యశోధిన్యాంక్షత్రియేతామ్రవర్ణకే। కర్తర్యాం గోపురే సోఽయంకర్తరీవినియుజ్యతే॥

తా॥ కాళ్లకులత్తుకపెట్టుట, వ్రాయుట, దంపతులవిరహము, వ్యత్యాసము, విష్ణువు, మెరపు, ఒకపడుకవలనియెడబాటు, మహిషము, మృగము, చామరము, కొండశిఖరము, ఏనుగు, వృషభము, ఆవు, దువ్వెన, క్షత్రియుడు, రక్తవర్ణము, కత్తెర, గోపురము, వీనియందు ఈహస్తము వినియోగపడును.

## ౫. మయూరహస్తలక్షణమ్.



శ్లో॥ అస్మిన్ననామికాఙ్గుష్ఠౌ శ్లిష్టౌ చాఽన్యే ప్రసారితే।
మయూరహస్తః కథితః కరటీకావిచక్షణైః॥

తా॥ కర్తరీముఖ హస్తమందు అనామికను అంగుష్ఠముతో జేర్చి తక్కిన వ్రేళ్లనుచాచిపట్టినయెడ మయూరహస్తమగును.

వి॥ శ్లో॥ మయూరాఽస్యే లతాయాంచ శకునే వమనే తథా । అళకస్యాపనయనే లలాటే తిలకేషుచ । నేత్రస్థాంకవితేః శాస్త్రవాదే ప్రసిద్ధకే । ఏవమర్థేషు యుజ్యన్తే మయూరకరభావనాః॥

తా॥ నెమిలిముఖము, తీగె, పక్షి, క్రక్కుట, ముంగురులుదిద్దుట, నొసలు, తిలకము, కన్నీరు ఎగజిమ్ముట, శాస్త్రమును వ్యవహరించుట, ప్రసిద్ధి, వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౬. అర్ధచన్ద్రహస్తలక్షణమ్.



శ్లో॥ అర్ధచన్ద్రకరస్సోఽయం పతాకేఽఙ్గుష్ఠసారణాత్॥

తా॥ పతాకహస్తమందు అంగుష్ఠముచాచబడినయెడ అర్ధచన్ద్రహస్తమగును.

వి॥ శ్లో॥ చన్ద్రే కృష్ణాష్టమీభాజి గళే హస్తాఽర్పికేఽపిచ । భల్లాయుధే దేవతానామభిషేచనకర్మణి । భుక్పాత్రేచోద్భవే కట్యాం చిన్తాయామాత్మవాచకే । ధ్యానేచ ప్రార్థనేచాఽపి అఙ్గసంస్పర్శనేతథా । ప్రాకృతానాంనమస్కారేఽప్యర్ధచన్ద్రోనియుజ్యతే॥

తా॥ కృష్ణాష్టమి చంద్రుడు, మెడపట్టిగెంటుట, భల్లాయుధము, దేవాభిషేకము, కంచము, పుట్టుక, మొల, చింత, తన్నుదాను చెప్పుకొనుట, ధ్యానము, ప్రార్థించుట, అవయవములను అంటుట, సలాముచేయుట, వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రన్థాన్తరస్థ అర్ధచన్ద్రహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకేవిరళాంగుష్ఠే సోఽర్ధచన్ద్రకరో భవేత్ । భూషణేచ్ఛావతశ్శంభో రతసీముకుటాకృతిః । జాతశ్చన్ద్రాదర్ధచన్ద్రో ఋషిరస్యాత్రిరుచ్యతే । వైశ్యజాతిర్ధూమ్రవర్ణో మహాదేవోఽధిదేవతా॥

తా॥ పతాకహస్తము చాచబడిన బొటనవ్రేలు గలదగునేని అర్ధచంద్రహస్తమగును. ఇది భూషణేచ్ఛగల శివునినిమిత్తమై చంద్రునినుండి పుట్టినది. ఇది వైశ్యజాతి. దీనికి ఋషి అత్రి. వర్ణము ధూమ్రము. అధిదేవత మహాదేవుడు.

వి॥ శ్లో॥ వలయేమణిబన్ధేచ దర్పణస్యనిరూపణే । ఆశ్చర్యేచప్రయాణే చాప్యమితేనిఖిలేషుచ ॥ తాళమానేమాలికాబన్ధ నిర్మాణేబాలపాదపే । ఖేదాత్కపోలవహనే గజకర్ణనిరూపణే । పాపరాధివినిష్క్రాన్తే ఫాలస్వేదనివారణే । యుద్ధవార్తేచ సమర్థేన శశాఙ్కేప్రాకృతానతౌ । అభిషేకేభ్రూలతాయా మం

షు కేకార్ష్యకేధికే । కటిపట్టధృతీకారే కలశారచనేజ్గకే । చరణాభినయేబాల వహానేపశ్చిమాజ్గకే । గౌరవర్ణేవైశ్యజాతా వర్ధచన్ద్రోనియుజ్యతే॥

తా॥ ముంజేతికడియము, మనికట్టు, అద్దముసుజూచుట, ఆశ్చర్యము, ప్రయాసము, మేరలేమి, సకలము, తాళమానము, సిగముడివేయుట, లేతచెట్టు, దుఃఖమువలన చెక్కిట చెయిసేర్చుట, ఏనుగుచెవులనుచూపుట, తప్పుచేసినవారిని వెడలగొట్టుట, నొసటి చెమటతుడుచుట, యౌవనవంతుడు, సమర్థుడు, చంద్రుడు, ప్రాకృతులు నమస్కరించుట, అభిషేకము, కనుబొమ్మ, వస్త్రము, ధనుస్సు, మిక్కిలి యనుట, నడికట్టు బిగించుట, కుండచేయుట, కాళ్లనుచూపుట, బిడ్డనెత్తుకొనుట, వీపు, తెలుపు, వైశ్యజాతి, వీనియందు ఈహస్తము వినియోగపడును.



## ౭. అరాళహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకేతర్జనీ వక్రానామ్నా సోఽయమరాళకః॥

తా॥ పతాకహస్తమందు చూపుడువ్రేలు వంపడినయెడ అరాళహస్తమగును.

వి॥ శ్లో॥ విషామృతాదిపానేషు ప్రచణ్డపవనేపిచ । యుజ్యతేఽరాళహస్తోయం భరతాఽగమకోవిదైః॥

తా॥ జలము అమృతము మొదలగువానిని త్రాగుటయందును గాలియందును ఈహస్తము ఉపయోగింపబడును.

## గ్రన్థాన్తరస్థాఽరాళహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకాజ్గుష్ఠతర్జన్యౌ వక్రితౌస్యాదరాళకః ॥ సప్తానాం జలధీనాంయో ఆపోశనకృతేపురా।అరాళఃకుమ్భజాజ్జాతో సఏవఋషిరుచ్యతే । పాటలాంశుర్మిశ్రజాతి ర్వాసుదేవోధిదేవతా । ఏవమేతస్యానుపూర్వ్య ముళ్త్రిభరతాదయః॥

తా॥ పతాకహస్తమున అంగుష్ఠతర్జనులు వంచబడినయెడ అరాళహస్తమవును. ఇదిపూర్వకాలమునందు అగస్త్యమహామునివలన సప్తసముద్రములను ఆపోశనముచేయునపుడు పుట్టెను. ఇదిమిశ్రజాతి. దీనికి ఆగస్త్యుడు ఋషి. ఎరుపువర్ణము. వాసుదేవుడు అధిదేవత. దీని ఆనుపూర్వ్యము ఇటువంటిదని భరతాదులుచెప్పిరి.

వి॥ శ్లో॥ ఆపోశనేబ్రాహ్మణానా మాశీర్వచనకర్మణి । విటానాంప్రియవైముఖ్యే కేశానాంచవిశీర్ణకే । అయాహీతిక్రమమిత్యుక్తౌ సన్ధ్యాకర్మప్రదక్షిణే । లలాటస్వేదహరణే కజ్జలాలేపనేదృశోః । ఏవమాదిషు యుజ్యన్తే అరాళకరభావనాః॥

తా॥ బ్రాహ్మణులయొక్క ఆపోశనము, ఆశీర్వాదముచేయుట, విటులప్రియవైముఖ్యము, వెండ్రుకలచిక్కుదీయుట, వేగరమ్మనుట, సంధ్యాకర్మమునందలిప్రదక్షిణము, నొసటిచెమ్మట తుడుచుట, కన్నులకు కాటుకపెట్టుట, వీనియందు ఈహస్తముచెల్లును.



## ౮. శుకతుణ్డహస్తలక్షణమ్.

శ్లో॥ అస్మిన్ననామికా వక్రా శుకతుణ్డః కరో భవేత్॥

తా॥ ముందుచెప్పిన అరాళహస్తమందు అనామిక వంపబడెనేని శుకతుణ్డహస్తమగును.

వి॥ శ్లో॥ బాణప్రయోగే కున్తార్థే మర్మోక్త్యాముగ్రభావనే । శుకతుణ్డకరో జ్ఞేయో భరతాగమవేదిభిః॥

తా॥ బాణప్రయోగము, ఈటె, మర్మమైనమాట, తీక్ష్ణభావము, వీనియందీహస్తము ఉపయోగింపబడును.

## గ్రన్థాన్తరస్థశుక తుణ్డహస్తలక్షణమ్.

శ్లో॥ వక్రే పతాకతర్జన్యనామికే శుకతుణ్డకః । నటయిత్వా ప్రేమకోపం నాట్యప్రవృత్తిసదాశివమ్ । దుర్గాయాం శుకతుణ్డాఖ్యో దుర్వాసా ఋషిరుచ్యతే । ద్విజాన్వయశ్శోణవర్ణో దేవతాస్య మరీచికః॥

తా॥ పతాకహస్తమందు తర్జనీ అనామికలు వంపబడెనేని శుకతుండహస్తమగును. ఇది సదాశివునివలన పార్వతీదేవికి ప్రణయకలహము గలిగినప్పుడు పార్వతీదేవియందు పుట్టెను. ఇది బ్రాహ్మణజాతి, ఋషి దుర్వాసుడు, రక్తవర్ణము, మరీచి అధి దేవత.

విని॥ శ్లో॥ బ్రహ్మాస్త్రే స్యాన్ముఖాగ్రే చ కౌటిల్యే వస్తుమార్గణే । భిన్దిపాలే చ భావ్యస్తే క్రమణే కలహేపి చ ॥ అనాదరే ప్రేమకోపే అభిప్రాయవిసర్జనే । ద్యూతాక్షపాతే కున్తార్థే శుకశాఙ్కనిరూపణే । ఉగ్రభావే చ మర్మోక్తౌ తామ్రే బ్రాహ్మణజాతిజః । శుకతుణ్డకరో భావ వేత్తృభిః పరికీర్తితః॥

తా॥ బ్రహ్మాస్త్రము, మొగముతుద, వంకర, వస్తువులమార్పు, భిందిపాలమను ఆయుధము, నడవబోవువిషయము, చాటుట, కలహము, ప్రీతిలేమి, ప్రణయకలహము, అభిప్రాయము, విడుపు, జూదవుగాయ, ఈటె, చిలుకగోరు వంకలనుజూపుట, ఉగ్రభావము, మర్మోక్తి, తామ్రవర్ణము, వీనియందు బ్రాహ్మణజాతియైన ఈహస్తము చెల్లును.



## ౯. ముష్టిహస్తలక్షణమ్.

శ్లో॥ మేళనాదఙ్గుళీనాఞ్చ కుఞ్చితానాం తలాన్తరే।
అఙ్గుష్ఠేనోపరి యుతో ముష్టిహస్తోఽయముచ్యతే॥

తా॥ నాలుగువ్రేళ్లనుజేర్చి యరచేతిలోనికి వంచి యంగుష్ఠమును మీదజేర్చునెడ ముష్టిహస్తమగును.

వి॥ శ్లో॥ స్థిరే కచగ్రహే దార్ఢ్యే వస్త్వాదీనాంచ ధారణే ।
మల్లానాం యుద్ధభావే చ ముష్టిహస్తోఽయముచ్యతే॥

తా॥ స్థిరమనుట, సిగబట్టుట, దృఢత్వము, పదార్థముల నందుకొనుట, జెట్టీల జగడము, వీనియందు ఈముష్టిహస్తము వినియోగింపబడును.

## గ్రన్థాన్తరస్థ ముష్టిహస్తలక్షణమ్.

శ్లో॥ మధ్యోపరికృతాఙ్గుష్ఠో ముష్టిరుష్ట్యాకృతిఃకరః । మధుకైటభయోర్యుద్ధే
జాతో విష్ణోరయంకరః । అమరేన్ద్రో ఋషిర్నీల శ్శూద్రశ్చన్ద్రోధిదేవతా॥

తా॥ నడిమివ్రేలిమీద అంగుష్ఠమును మడిచి పిడికిలి పట్టినట్లు పట్టబడెనేని యది ముష్టిహస్తమగును. ఇది విష్ణువు మధుకైటభులతో యుద్ధముచేయు కాలమందు విష్ణువు వలన పుట్టెను. ఇది శూద్రజాతి. దీనికి ఋషి అమరేంద్రుడు. వర్ణమునీలము. చంద్రుడు, అధిదేవత.

వి॥ శ్లో॥ ఆలమ్బనేమధ్యభావే ఫలేసఙ్కేతభావనే । భద్రార్థేబలిదానేచ ప్రణామేప్రాకృతైఃకృతే ॥ ఉరుసంవహనేగన్ధ గ్రహణేతిప్రధావనే । లాఘవేమల్లయుద్ధేచ ఖేటకాది గ్రహేస్థిరే॥ కచాకర్షేముష్టిఘాతే గదాకున్తాదిధారణే। నీలవర్ణేశూద్రజాతౌ ముష్టిహస్తోయముచ్యతే॥

తా॥ పట్టు, నడుము, ప్రయోజనము, సంకేతము, క్షేమము, బలియిచ్చుట, ప్రాకృతజనుల నమస్కారము, గట్టిపట్టు, పుస్తకమునుపట్టుట, వడిగాపరుగెత్తుట, తేలిక, జెట్టిపోట్లాట, కేడెము, ఆయుధమునుపట్టుట, నిలుకడ, తలవెండ్రుకలుపట్టుట, పిడికిటిపోటు, గదయీటె మొదలయిన ఆయుధములను పట్టుట, నీలవర్ణము, శూద్రజాతి, వీనియందు ఈహస్తము వినియోగింపబడును.

## ౧౦. శిఖరహస్తలక్షణమ్.



శ్లో॥ చేన్ముష్టిరున్నతాఙ్గుష్ఠ స్సఏవశిఖరఃకరః॥

తా॥ ముందుచెప్పిన ముష్టిహస్తమందు అంగుష్ఠమును పొడవుగా నెత్తినయెడ శిఖరహస్తమగును.

వి॥ శ్లో॥ మదనేకార్ముకేస్తమ్భే నిశ్శబ్దేపితృతర్పణే।ఓష్ఠేనాథేచరదనే ప్రవిష్టేప్రశ్నభావనే । అఙ్గేనాఽస్తీతివచనే స్మరణేఽభినయాన్తరే । కటిబన్ధాఽకర్షణేచ పరిరమ్భవిధౌధవే । శక్తితోమరయోర్మోక్షేఘణ్టానాదేచపేషణే । శిఖరోయుజ్యతే సోఽయంభరతాగమవేదిభిః॥

తా॥ మన్మథుడు, ధనుస్సు, స్తంభము, శబ్దములేమి, పితృతర్పణము, పెదవి, పెనిమిటి, దంతము, ప్రవేశించుట, ప్రశ్నచేయుట, అవయవము, లేదనుట, తలచుట, ఇతరాభినయము, నడికట్టు నీడ్చుట, కౌగిలింత, ప్రియుడు, శక్త్యాయుధము, తోమరాయుధము, వానిని ప్రయోగించుట, ఘంటానాదము, వీనియందు ఈ హస్తము ఉపయోగింపబడును.

## గ్రన్థాన్తరస్థ శిఖరహస్తలక్షణమ్.

శ్లో॥ ముష్టిరూర్ధ్వకృతాఙ్గుష్ఠ స్సఏవశిఖరఃకరః । సమేరుకార్ముకీకృత్య తస్మ్యేచన్ద్రశేఖరః । హస్తేనయేనజగ్రాహ సోభవచ్ఛిఖరస్స్మృతః । శిఖరంమేరుధనుషో జాతంతస్యఋషిర్జినః । గన్ధర్వజాతిశ్శ్యామాంశు రథీశోరతివల్లభః॥

తా॥ ముష్టిహస్తము పైకెత్తిన బొటన వ్రేలుగలదయ్యెనేని శిఖరహస్తమగును. ఇది పూర్వకాలమందు శివుడు త్రిపురాసురులతో యుద్ధము చేయుటకు మేరుపర్వతమును విల్లుగా చేసి దాని నడిమిభాగమును పట్టినపుడు శివునివలన బుట్టెను. ఇది గంధర్వజాతి. దీనికి ఋషిజీరుడు, వర్ణ్నచామన, అధిదేవత మన్మథుడు.

వి॥ శ్లో॥ పితౄణాంతర్పణే స్థైర్యే కుటుమ్బస్థాపనేపిచ । నాయకే శిఖరే మిత్రే తిర్యక్క్షేప ప్రస్థాపనే ॥ వ్యజనే తాలవృన్తస్య ధ్వజే కేదాంతిభాషణే । శృఙ్గారరసయన్తోపానే చతుస్సఙ్ఖ్యావిభావనే । శక్తితోమరయోర్మోక్షే ఫలాంశక పరిగ్రహే । విలాసినీసమ్భ్రమభావే లజ్జాయాం కార్ముకే స్మరే । పురుషే నిశ్చయే స్తమ్భే ఘంటావాద్యేవనర్తనే । నాస్తీతి వచనేవానే స్థాణుయాగే చవినాయకే । మహిషాసురమర్దన్యాం వీరాంశే హాస్యకల్పనే । అర్ధచన్ద్రాదితిలకే కబరీచిహ్నధారణే । ఇన్ద్రనీలే గాఢభావే శిఖరస్సంప్రయుజ్యతే॥

తా॥ పితృతర్పణము, కుటుంబమును నిలుపుట, నాయకుడు, శిఖరము, స్నేహితుడు, అడ్డముగ బట్టినయెడ పంపుటలో ముకోనుట, విసనకఱ్ఱ, ఏమనియు డుగుట, గిండిచెంబు, నీళ్లు త్రాగుట, నాలుగని లెక్కపెట్టుట, శక్తిఅను ఆయుధమును వైచుట, ఈటెను విసరుట, ఫలాంశమును గ్రహించుట, ఆడువారియడకువ, సిగ్గు, విల్లు, మన్మథుడు, మగడు, నిశ్చయము, స్తంభము, గంటవాయించుట, బోగమాట, లేదనుట, ఈవి, నిలుకడగలిగియుండుట, శివ్లారి, మహిషాసురమర్దని, వీరుడు, నుజ్జమును దాటించుట, అర్ధచంద్రతిలకము మొదలగునవి, కొప్పునకుపూలు పూనుట, ఇంద్రనీలము, దృఢత్వము, వీనియందు ఈహస్తము ఉపయోగింపబడును.

## ౧౧. కపిత్థహస్తలక్షణమ్.



శ్లో॥ అఙ్గుష్ఠమూర్ధ్ని శిఖరేవక్రితా యదితర్జనీ।
కపిత్థాఽఖ్యకరస్సోఽయంతన్నిరూపణముచ్యతే॥

తా॥ ముందుచెప్పిన శిఖరహస్తాంగుష్ఠమందు చూపుడువ్రేలువంపబడెనేని కపిత్థహస్తమగును.

వి॥ శ్లో॥ లక్ష్మ్యాంచైవసరస్వత్యాం వేష్టనే తాళధారణే । గోదోహనేచాఽఞ్జనేచ లీలాపుష్పధారణే । చేలాఞ్చలాఽదిగ్రహణే పటస్యైవాఽవకుణ్ఠనే । ధూపదీపార్చనే చాఽపి కపిత్థస్సంప్రయుజ్యతే॥

తా॥ లక్ష్మీదేవియందును, సరస్వతియందును, చుట్టుట, తాళమును పట్టుట, పాలుపిదుకుట, కాటుకపెట్టుకొనుట, వినోదముగా పూలచెండ్లుధరించుట, కొంగు మొదలగువాని పట్టుకొనుట, గుడ్డమునుగు వేసికొనుట, ధూపదీపార్చనము వీనియందును ఈహస్తము వినియోగింపబడును.

## గ్రన్థాన్తరస్థకపిత్థహస్తలక్షణమ్.

శ్లో॥ శిఖరాఙ్గుష్ఠ తర్జన్యా లగ్నా చేత్సకపిత్థకః । సముద్రమథనేపూర్వంమన్దరాకర్షణోచితః । జాతఃకపిత్థో శ్రీవిష్ణోర్నారదో ఋషిరుచ్యతే । ఋషిజాతిర్గౌరవర్ణః పద్మగర్భోఽధిదేవతా॥

తా॥ శిఖరహస్తమునందలి బొటనవ్రేలును చూపుడు వ్రేలును చేర్చబడునేని కపిత్థహస్తమగును. పూర్వకాలమునందు సముద్రమును చిలుకుటకు అనుకూలముగా మందరపర్వతమును పట్టునపుడు ఈకపిత్థహస్తము విష్ణువువలన బుట్టెను. ఇది ఋషిజాతి. దీనికి ఋషినారదుడు, వర్ణము తెలుపు, అధిదేవత పద్మగర్భుడు.

వి॥ శ్లో॥ మన్థానాఽకర్షణే లక్ష్మ్యాం ధూపదీపనివేదనే। వరాటికానాం విక్షేపే వహనేఽఙ్కుశవజ్రయోః। క్షేపణగ్రహణే తాళధారణే నాట్యదర్శనే। లీలాబ్జధారణే వాణ్యాం జపదామనిరూపణే। పేషణే యావకాదీనాం చేలాఞ్చల సమావృతౌ। ఋషిజాతౌ గౌరవర్ణే కపిత్థోఽయం నియుజ్యతే॥

తా॥ కవ్వమునుబట్టి చిలుకుట, లక్ష్మి, ధూపదీపములను నివేదించుట, గవ్వలను ఎగజిమ్ముట, అంకుశ వజ్రాయుధములను పట్టుట, ఒడిసెల త్రిప్పుట, తాళము పట్టుట, నాట్యమును జూపుట, వినోదముగా తామరపువ్వు చేతపట్టుకొనుట, సరస్వతి జపమాలికనుధరించుట, లత్తుక మొదలగువాని మెదుపుట, కొంగును లాగుట, ఋషిజాతి, గౌరవర్ణము, వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౧౨. కటకాముఖహస్తలక్షణమ్.



శ్లో॥ కపిత్థతర్జనీ చోర్ధ్వం మిశ్రితాఽఙ్గుష్ఠమధ్యమా।
కటకాముఖహస్తోఽయం కీర్తితో భరతాదిభిః॥

తా॥ ముందుచెప్పిన కపిత్థహస్తమందు చూపుడువ్రేలిని నడిమివ్రేలితోను బొటనవ్రేలితోను జేర్చిపట్టబడునేని కటకాముఖహస్తమగును.

వి॥ శ్లో॥ కుసుమాఽపచయే ముక్తాస్రజాం దామ్నాంచ ధారణే। శరమన్దాఽకర్షణేచ నాగవల్లీప్రదానకే। కస్తూరికాఽదివస్తూనాం పేషణే గన్ధవాసనే। వచనే దృష్టిభావేచ కటకాముఖ ఇష్యతే॥

తా॥ పువ్వులుకోయుట, ముత్యాలసంష పూలదండలుధరించుట, బాణమును మెల్లగా ఆకర్షించుట, ఆకుమడుపులిచ్చుట, కస్తూరి మొదలగుద్రవ్యములనుకలపుట, వాసనద్రవ్యములు చేర్చుట, మాట, చూపు, వీనియందు ఈహస్తము ఉపయోగింపబడును.

### గ్రన్థాన్తరస్థకటకాముఖలక్షణమ్.

శ్లో॥ అత్యఙ్గుష్ఠయుతోత్క్షిప్తో కపిత్థో కటకాముఖః। అభ్యస్యచధనుర్విద్యాం గుహేన శివసన్నిధౌ॥ కటకాముఖహస్తోఽభూద్భార్గవో ఋషిరుచ్యతే। దేవజాతిస్తామ్రవర్ణో రఘురామోఽస్య దేవతా॥

తా॥ కపిత్థహస్తముయొక్క బొటనవ్రేలు ఎత్తిపట్టబడునేని కటకాముఖహస్తమగును. శివునియొద్దకుమారస్వామి విలువిద్య నేర్చునపుడు కటకాముఖహస్తము పుట్టెను. ఇది దేవజాతి. దీనికి ఋషి భార్గవుడు, వర్ణము తామ్రము, అధిదేవత రఘురాముడు.

వి॥ శ్లో॥ ముక్తాస్రజాం పుష్పదామ్నాం చామరాణాం చ ధారణే। ఆకర్షణే శరాదీనాం దర్పణాభిముఖగ్రహే। ఖలీనే వాహనే వృన్తభేదనే దన్తధావనే। కుసుమాపచయే నాగవల్లీదళపరిగ్రహే। కస్తూరికాదినిష్పేషే వారస్త్రీణాం ని

గూహనే । ధనురాకర్షణే చక్రధారణే వ్యజనగ్రహే । సర్వత్రైతే దేవ
జాత్యాంయుజ్యతే కటకాముఖః॥

తా॥ ముత్యాలసరము పూలదండ వింజామరము వీనినిధరించుట, బాణము మొ
దలైనవానిని ఆకర్షించుట, అద్దము నెదుటికి తెచ్చుట, కల్లము, వాహనము, తోడిమను
త్రుంచుట, పండ్లుతోముట, పుష్పాలుకోయుట, ఆకుమడుపులిచ్చుట, కస్తూరి మొదలగు
వస్తువులను మెదుపుట, భోగమువారికౌగిలింత, వింటినిలిగుచుట, చక్రాయుధమును ధరిం
చుట, విసనకఱ్ఱపట్టుట, బంగారువన్నె, దేవజాతి, వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౭. సూచీహస్తలక్షణమ్.



శ్లో॥ ఊర్ధ్వంప్రసారితా యత్ర కటకాముఖతర్జనీ । భవేత్సూచీ
కరస్సోఽయం కీర్తితో భరతాగమే॥

తా॥ ముందుచెప్పిన కటకాముఖహస్తమునందలి చూపుడువ్రేలు
పొడుగుగా చాచబడినయెడ సూచీహస్తమగును.

వి॥ శ్లో॥ ఏకార్థేఽపి పరబ్రహ్మభావనాయాం శతేఽపి చ । రవౌ
నగర్యాం లోకార్థే తథేతివచనేఽపి చ । యచ్ఛబ్దేఽపి చ త
చ్ఛబ్దే వ్యజనార్థేఽపి తర్జనే। కార్శ్యే శలాకావపుషో రాశ్చ
ర్యే వేణిభావనే। ఛత్రే సమర్థే కోణే చ॥ రోమాళ్యాం భేరిభేద
నే। కులాలచక్రభ్రమణే రథాంగే మండలే తథా। వివేచనే దినాఽ
న్తే చ సూచీహస్తః ప్రకీర్తితః॥

తా॥ ఒకటిఅనుఅర్థము, పరబ్రహ్మము, తలపు, నూరుఅనుట, సూర్యుడు,
నగరము, లోకము అనునర్థము, అట్లు అనుట, ఎవడు ఎవతె ఏదియనుట, వాడు ఆ
మె అదియనుట, విసనకఱ్ఱ, వెరపించుట, కృశించుట, సలాక, దేహము, ఆశ్చర్య ప
డుట, జడనుచూపుట, గొడుగు, నేర్పరితనము, మూల అనుట, నూగారు, భేరివాయిం
చుట, కుమ్మరవానిచక్రముతిరుగుట, బండిచక్రము, సమూహము, వివరించుట, సాయం
కాలము, వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రన్థాన్తరస్థసూచీముఖహస్తలక్షణమ్.

శ్లో॥ సూచీముఖోభవేదూర్ధ్వం కటకాముఖతర్జనీ । అహమేక ఇతి బ్రహ్మా నిర్దే
శమకరోద్యతః । తస్మాత్పరాత్పరాజ్జాతో సూచిరస్యాఋషీరవిః । దేవజా
తిశ్శ్వేతవర్ణో విశ్వకర్మాధిదేవతా॥

తా॥ కటకాముఖహస్తముయొక్క చూపుడు వ్రేలుపైకెత్తబడెనేని సూచీహస్త
మగును. పూర్వకాలమునందు బ్రహ్మ నేనొకడనేయని నిర్దేశించునపుడు ఆబ్రహ్మవలన
ఈసూచీ హస్తము పుట్టెను. ఇది దేవజాతి. దీనికిఋషి సూర్యుడు. వర్ణము శ్వేతము.
అధిదేవత విశ్వకర్మ.

విని॥ శ్లో॥ శ్లాఘాయాంసత్యవచనేమారదేశనిరూపణే । ప్రాణార్థేచపురోగేపి
ఏకనక్షత్రనిరూపణే ॥ సభాశ్రయాం విజనేవాశే సాధువాదనిరీక్షణే । త
థేతివచనేలోకే పరబ్రహ్మనిరూపణే । ఏకార్థేపిశలాకాయాం రథాంగభ్రమ
ణేరవౌ । ఉదయాస్తమయేబాణే హంసేనాయకదర్శనే । కీలీముఖేసంయచ్ఛబ్దే

తచ్ఛబ్దేలోహనాళయోః। తర్జనేనీచసంబుద్ధౌ శ్రవణేవిరహేస్మృతౌ।ఘ్రాణే చక్షుష్వేం శ్వేతవర్ణేదర్శనేసూచికఃకరః॥

తా॥ శ్లాఘించుట, నిజము, దూరమునుజూపుట, ప్రాణమనుట, ముందుగబోవువానిజూపుట, పదినిజూపుట. సంధ్యాకాలము, ఏకాంతప్రదేశము, తూడు, బాగనుట, చూపు, అశ్లేయనుట, లోకము, పరబ్రహ్మనిరూపణము, ఒకటేయనువర్థము, సలాక, చక్రమునుత్రిప్పుట, సూర్యుడు, ఉదయాస్తమయములు, బాణము, రహస్యము, నాయకునిజూచుట, అలుగుగలబాణము, ఎది అదిఅనుట, ఇనుము, కమ్మి, బెదరించుట, నీచునిపిలుచుట, వినుట, విరహము, తలచుట, ముక్కు, పక్షిముక్కు, తెల్లవర్ణము, చూచుట, వీనియందు ఈహస్తము వినియోగపడును.



## ౧౪. చన్ద్రకలాహస్తలక్షణమ్.

వి॥ శ్లో॥ సూచ్యామఙ్గుష్ఠమోక్షేతుభవేచ్చన్ద్రకలాకరః।
ఏషాచన్ద్రకలాచన్ద్రకలాయామేవయుజ్యతే॥

తా॥ ముందుచెప్పిన సూచీహస్తమునందు బొటనవ్రేలిని విడిచినయెడచన్ద్రకలాహస్తమగును. ఈచంద్ర కలాహస్తము కలామాత్రచంద్రునియందు వినియోగింపబడును.



## ౧౫. పద్మకోశహస్తలక్షణమ్.

శ్లో॥ అఙ్గుళ్యోవిరళాఙ్గకిఞ్చిత్కుఞ్చితాస్తలనిమ్నగాః।
పద్మకోశాఽభిధోహస్తస్తన్నిరూపణముచ్యతే॥

తా॥ అయిదువ్రేళ్లను ఎడముగాచాచి కొంచెమువంచి అరచేయిపల్లమగునట్లుపట్టబడునెడపద్మకోశహస్తమగును.

వి॥ శ్లో॥ ఫలేబిల్వకపిత్థాఽదౌస్త్రీణాంచకుచయుగ్మయోః।
వర్తులేకన్దుకేస్వల్పభోజనే పుష్పకోశకే॥సహకారఫలేపుష్పవర్షేమఞ్జరికాఽదిషు।
జపాకుసుమభావేపిఘణ్టారూపవిధానకే॥వల్మీకేకుముదేప్యణ్డేపద్మకోశోభిధీయతే॥

తా॥ మారేడుపండు, వెలగపండు, స్తనములు, వట్రువ, పువ్వుచెండు, అల్పాహారము, పూమొగ్గ, మామిడిపండు, పూలవాన, పూగుత్తిమొదలుగునది, మంకెనపువ్వు, ఘంటారూపమును జూపుట, పాములపుట్ట, నల్లకలువ, గ్రుడ్డు, వీనియందు ఈ హస్తము ఉపయోగించును.

## గ్రన్థాన్తరస్థపద్మకోశహస్తలక్షణమ్.

శ్లో॥ వరశ్వేతామ్బుజాకారో పద్మకోశోభిధీయతే। చక్రార్థేపద్మనికరైశ్శమ్భుపూజాంవితన్వతః। నారాయణాత్పద్మకోశోజాతోపద్మధరోఋషిః। యక్షాన్వయః కిన్నరాంశో అధిదేవోస్యభార్గవః॥

తా॥ శ్రేష్ఠమయిన తెల్లదామరయాకృతిగాపట్టబడినది పద్మకోశహస్తమనబడును. పూర్వకాలమునందు చక్రాయుధముకొరకుపద్మసమూహములచేత శివపూజ చేయుచున్నవిష్ణుదేవునివలన ఈపద్మకోశహస్తముగలిగెను. ఇదియక్షజాతి. కిన్నరాంశము. దీనికి బ్రహ్మఋషి, భార్గవుడు అధిదేవత.

వి॥ శ్లో॥ శుణ్డాయాంధారకర్త్వేచ హేమరౌప్యాదిభాజనే । స్రుక్షితేచమితాశ్చైవ
లావణ్యేసాధువాదనే ॥ శుణ్డాయాంకన్దుకేపద్మేవల్మీకేవర్తులేస్తనే । నారికేళే
చూతఫలే కర్ణికారేచదర్పణే । శాఖావతౌపుష్పవర్షే కలశేద్రోవికాసనే।బిల్వే
కపిత్థేయుజ్యేత పద్మకోశాహ్వయఃకరః॥

తా॥ ఏనుగుతొండము, గడగళయనుకాంతి, బంగారువెండి మొదలయినపాత్రము, కొప్పు, కొలది, అందము, బాగుఅనుట, ఘంట, పుట్టచెండు, తామర, పుట్ట, గుండ్రన, కుచము, టెంకాయ, మామిడిపండు, కొండగోగు, అద్దము, బొమ్మవంగుట, పూలవాన, మారేడుపండు, వెలగపండు, వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౧౬. సర్పశీర్షహస్తలక్షణమ్.



శ్లో॥ పతాకతలనిమ్నత్వాత్సర్పశీర్షకరోభవేత్॥

తా॥ పతాకహస్తముయొక్క అరచెయ్యికొంచెముపల్లముగ వంపబడిన యెడసర్పశీర్షహస్తమగును.

వి॥ శ్లో॥ చన్దనేభుజగేమన్దే ప్రోక్షణే పోషణాదిషు । దేవర్ష్యుదకదానేష్వప్యాస్ఫాలే గజకుమ్భయోః। భుజాస్ఫాలేతు మల్లానాం యుజ్యతే సర్పశీర్షకః॥

తా॥ గంధము, పాము, మెల్లగాననుట, నీళ్లుచిలుకరించుట, ప్రోచుట మొదలగునవి, దేవర్షితర్పణములు, ఏనుగుకుంభస్థలములను చరచుట, జెట్టీలు బుజముచరచుట, వీనియందు ఈహస్తము ఉపయోగపడును.

## గ్రన్థాన్తరస్థసర్పశీర్షహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకేనిమ్నమధ్యత్వంసర్పశీర్ష ఇతిస్మృతః। నిరీక్ష్యనిర్జరాన్భీతాన్పురావి
న్యాసపూర్వకమ్।బలింవఞ్చయితుంఖర్వోభవేయమితి భావతః। వామనాత్సర్ప
శీర్షోయం వాసవోఋషిరుచ్యతే । హరిద్వర్ణో దేవజాతిః కాలకంఠోధిదేవతా॥

తా॥ పతాకహస్తమునందలి అరచేయిపల్లముగా పట్టబడునేని సర్పశీర్షహస్తమవును. పూర్వకాలమునందుబలిచక్రవర్తికి వెరచితన్నుశరణుచొచ్చినదేవతలనుగూర్చివిష్ణుదేవుడు వామనావతారమెత్తి బలినివంచించిమిమ్ము కాపాడెదనని చేయిచాచిచెప్పినపుడు ఆవామనునివలన ఈసర్పశీర్షహస్తముపుట్టెను. ఇదిదేవజాతి. దీనికిఇంద్రుడుఋషి, పసుపువర్ణము, శివుడుఅధిదేవత.

వి॥ శ్లో॥ కుఙ్కుమేపఙ్కభావేపి ప్రాణాయామనిరూపణే।ముఖప్రక్షాళనవిధౌ దానవేళావివేచనే । చన్దనేచగజేఖర్వే మల్లాస్ఫాలేచలాలనే । క్షీరేనీరేచకాశ్మీరేలజ్జాయాం గోప్యకేశికే । ప్రతిమాయాం పయఃపానే లీనేసత్పరిభాషణే । బ్రహ్మజాతౌ హరిద్వర్ణేయుక్తమిత్యుత్తరీకృతౌ । పటవానవరిక్షేపే చన్దనాదివిలేపనే । కుచాదిగ్రహణేస్త్రీణాంసర్పశీర్షోనియుజ్యతే॥

తా॥ కుంకుమము, అడుసు, ప్రాణాయామమునుజూపుట, మొగముకడుగుకొనుట, దానకాలమునునిరూపించుట, గంధము, ఏనుగు, పొట్టివాడు, జెట్టీలుబుజము చరచుట, బుజ్జగించుట, పాలు, నీరు, కుంకుమపువ్వు, సిగ్గు, దాచదగినవస్తువు, పవిత్ర,

బొమ్మ, నీళ్లుత్రాగుట, ఐక్యము, మంచిదనుట, బ్రహ్మజాతి, పసుపువన్నె, తగుననుట, ఉత్తరముచెప్పుట, గండపాడిచల్లుట, గండముమొదలగువానిపూత, స్తనముమొదలగువానిని పట్టుకొనుట, వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౧౩. మృగశీర్షహస్తలక్షణమ్.



శ్లో॥ అస్మిన్కనిష్ఠికాఙ్గుష్ఠే ప్రసృతేమృగశీర్షకః॥

తా॥ ముందుచెప్పిన సర్పశీర్షహస్తమందలి చిటికెనవ్రేలును బొటనవ్రేలును చాచబడునేని మృగశీర్షహస్తమగును.

వి॥ శ్లో॥ స్త్రీణామర్థేకపోలేచ క్రమమర్యాదయోరపి । భీతేవివాదేనైపథ్యేఽప్యావాసేచత్రిపుణ్డ్రకే। ముఖాముఖేరఙ్గవల్ల్యాం పాదసంవాహనేపిచ । సర్వసమ్మేళనేకార్యేమన్దిరేచఛత్రధారణే । సోపానేపదవిన్యాసే ప్రియాఽహ్వానేతథైవచ । సఞ్చారేచప్రయుజ్యేత భరతాఽగమకోవిదైః॥

తా॥ స్త్రీవిషయము, చెక్కిలి, క్రమము, మర్యాద, వెరపు, వాదు, అలంకారము, ఉనికిపట్టు, విబూదిపెట్టుకొనుట, ఎదురెదురు, ముగ్గు, కాళ్లుపిసుకుట, అన్నిటినికూర్చుట, ఇల్లు, గొడుగుపట్టుకొనుట, మెట్టు, అడుగుపెట్టుట, ప్రియులనుబిలుచుట, తిరుగుట, వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రన్థాన్తరస్థ మృగశీర్షహస్తలక్షణమ్.

శ్లో॥ ఊర్ధ్వగశ్చతురాఙ్గుష్ఠో మృగశీర్షకరఃస్మృతః । శివంప్రతితపఃకర్తుం ధారయిత్వాత్రిపుణ్డ్రకమ్ । మృగశీర్షోభవద్గౌర్యాః ఋషిరస్య మృకణ్డుజః । ఋషిజాతిశ్శుభ్ర వర్ణోఽస్యాధి శోపిమహేశ్వరః॥

తా॥ చతురహస్తాంగుష్ఠమువెలుపలికెత్తబడెనేని మృగశీర్షహస్తమగును. మహేశ్వరునిగూర్చి తపస్సుచేయుటకు పార్వతీదేవి త్రిపుండ్రమునుధరింపగా ఈహస్తముపుట్టెను. ఇదిఋషిజాతి. దీనికి ఋషిమార్కండేయుడు. వర్ణముతెలుపు, అధిదేవత మహేశ్వరుడు.

వి॥ శ్లో॥ భిత్తౌవిచారేసమయే ఆవాసేఛత్రధారణే । పద్మిన్యామపిశఙ్ఖిన్యాం హస్తిన్యాంమన్దవాచకే ॥ లేపనేచన్దనాదీనాం స్త్రీణామభినయక్రమే । తిరస్కరిణ్యాం సోపానేసాక్షాత్కారే పిచక్రమే । త్రిపుణ్డ్రధారణేచైవ వితర్కేచమృగాననే । అన్మదర్థేశరీరేచ సంజ్ఞాపూర్వ సమాహృతా । ఋషిజాతౌ సుధావర్ణేమృగశీర్షకరః స్మృతః॥

తా॥ గోడ, విచారము, సమయము, నివాసస్థానము, గొడుగుపట్టుట, పద్మినీశంకినీహస్తినీ జాతిస్త్రీలు, మెల్లగాననుట, గంధముమొదలగువానిపూత, స్త్రీబోధకాభినయము, త్రిపుండ్రధారణము, వితర్కము, మృగముయొక్కమొగము, తెర, మిద్దెల్లోనగుదానిమెట్టు, ప్రత్యక్షము, క్రమము, నేనుఅనుట, దేహము, సైగచేగ్రహించుట, ఋషిజాతి, తెల్లనివన్నె, వీనియందు ఈహస్తము ఉపయోగించును.



## ౧౭. సింహముఖహస్తలక్షణమ్.

శ్లో॥ మధ్యమాఽనామికాఽగ్రాభ్యామఙ్గుష్ఠో మిళితో యది।
శేషౌ ప్రసారితౌ యత్ర స సింహముఖ ఈరితః॥

తా॥ నడిమివ్రేలు ఉంగరపువ్రేలు ఈరెంటికొనలను బొటనవ్రేలితోచేర్చి తక్కినవ్రేళ్లనుజాచి పట్టినయెడ సింహముఖహస్తమగును.

వి॥ శ్లో॥ విద్రుమే మౌక్తికే చైవ సుగన్ధే లకస్పర్శనే। ఆకర్ణనే చ పృషతి మోక్షార్థే హృదిసంస్థితః॥ హోమే శశే గజే దర్భచలనే పద్మదామని। సింహాననే వైద్యపాకశోధనే సింహవక్త్రకః॥

తా॥ పగడము, ముత్యము, మంచివాసన, ముంగురులుదిద్దుట, వినుట, నీటిబొట్టు, (రొమ్మున నిలిపినయెడ) మోక్షవిషయము, హోమము, కుందేలు, ఏనుగు, దర్భను విదలించుట, తామరపూలదండ, సింహముయొక్క మొగము, వైద్యుడుమందువండుటను శోధించుట, వీనియందు ఈహస్తము వినియోగించును.



## ౧౮. లాఙ్గూలహస్తలక్షణమ్.

శ్లో॥ పద్మకోశేఽనామికా చేన్నమ్రా లాఙ్గూలకో భవేత్॥

తా॥ పద్మకోశహస్తమందు ఉంగరపువ్రేలు వంచిపట్టినయెడ లాంగూలహస్తమగును.

వి॥ శ్లో॥ లికుచస్య ఫలే బాలాకుచే కల్హారకే తథా। చకోరే క్రముకే బాలకికిణ్యాం ఘుటికాదికే। చాతకే యుజ్యతే చాయం లాఙ్గూలకరనామకః॥

తా॥ గజనిమ్మపండు, పడుచులచన్నులు, వాసనగలయెఱ్ఱకలువ, చకోరము, పోక, చిరుగజ్జెలు, రనగుండు మొదలుగునవి, చాతకపక్షి, వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రన్థాన్తరస్థలాఙ్గూలహస్తలక్షణమ్.

శ్లో॥ మధ్యమాఙ్గుష్ఠతర్జన్యా నారికేళాక్షవత్కృతా। లాఙ్గూలే నామికా వక్రా ప్రోన్నతా చ కనిష్ఠికా। క్షీరోదధిజః కాలకూటః గుళికాకృతికే పురా। లాఙ్గూలో హరసఞ్జాతో ఋషిః క్రౌఞ్చవిదారణః। సిద్ధజాతిస్స్వర్ణవర్ణః పద్మాతస్యాధిదేవతా॥

తా॥ నడిమివ్రేలు బొటనవ్రేలు చూపుడువ్రేలు వీనిని టెంకాయకన్నులతీరున నిలిపి ఉంగరపువ్రేలినివంచి చిటికెనవ్రేలినిపైకెత్తి పట్టబడునది లాంగూలహస్తముఅనబడును. ఈహస్తము పూర్వకాలమునందు పాలసముద్రమునందుబుట్టిన కాలకూటవిషమును మ్రింగుటకై శివుడుగుళికగాజేసిపట్టినపుడు శివునివలనబుట్టినది. దీనికి ఋషికుమారస్వామి. వన్నెబంగారు. అధిదేవతలక్ష్మి.

వి॥ శ్లో॥ ద్రాక్షాఫలే చ రుద్రాక్షే చుబుకగ్రహణేఽపి చ। కుచప్రరోహే క్రముకే కికిణ్యాముత్పలే ఫలే। విద్రుమే చ మితగ్రాసే నక్షత్రే బదరీఫలే। వర్తులాయాం

పక్షిరాజా చకోరేచాతకేఽల్పకే । కరకాయాంసిద్ధజాతౌ హేకితక్యాంసువర్ణకే । ఏవమాదిషుయుజ్యేత హస్తోఽలాఙ్గూలసంజ్ఞికః॥

తా॥ ద్రాక్షపండు, రుద్రాక్ష, నిమ్మపండు, గజ్జెముపట్టుకొనుట, మొలకచన్ను, పోక, చిరుగజ్జెలు, కలువ, పండు, పగడము, కొద్దిపాటికబళము, నక్షత్రము, రేగుపండు, పత్రుటి, మల్లెపువ్వు, చకోరపక్షి, చాతకపక్షి, అల్పవస్తువు, వడగల్లు, సిద్ధజాతి, కిసకకాయ, బంగారు, ఇవి మొదలగు వానియందు ఈహస్తము వినియోగించును.

## ౨౦. సోలపద్మహస్తలక్షణమ్.



శ్లో॥ కనిష్ఠాఽద్యావర్తితాశ్చేద్విరళాస్సోలపద్మకః॥

తా॥ చిటికెనవ్రేలు మొదలగువ్రేళ్లనంగులుగలవిగా త్రిప్పిపట్టబడిన యెడసోలపద్మహస్తమగును.

వి॥ శ్లో॥ వికచాబ్జేకపిత్థాదిఫలేఽప్యావర్తకేకుచే । విరహేముకురేపూర్ణచన్ద్రే సౌన్దర్యభాజనే । ధమ్మిల్లచన్ద్రశాలాయాం గ్రామేఽప్యుద్ధతకోపయోః । తటాకేశకటేచక్రవాకేకలకలారవే । శ్లాఘనేసోలపద్మశ్చ కీర్తితోభరతాగమే॥

తా॥ వికసినతామర, వెలగపండుమొదలగుపండు, తిరుగుడు, చన్ను, ఎడబాటు, అద్దము, పూర్ణచంద్రుడు, అందమయిన పాత్రము, కొప్పు, మేడమీదియిల్లు, ఊరు, ఎత్తు, కోపము, చెరువు, బండి, చక్రవాకపక్షి, కలకలధ్వని, మెప్పు, వీనియందు ఈహస్తమువినియోగించునని భరతశాస్త్రమునందుచెప్పబడియున్నది.

## గ్రన్థాన్తరస్థ సోలపద్మ హస్తలక్షణమ్.

శ్లో॥ వ్యావృత్తికరణం యత్రనభవేదలపల్లవః । వ్యావృత్తహస్తఃకలశనవనీతముషఃపురా । జజ్ఞేలపల్లవః కృష్ణాత్ వసంతోఋషిరుచ్యతే।గన్ధర్వజాతిశ్శ్యామాంశురధీశోఽస్యదినేశ్వరః॥

తా॥ వ్రేళ్లనువిరళములుగ త్రిప్పిపట్టినయెడ అలపల్లవహస్తమగును. ఈయలపల్లవహస్తముపాలువెన్నలు దొంగిలించిన కృష్ణునివలనబుట్టెను. ఇదిగంధర్వజాతి. దీనికివసంతుడు ఋషి, శ్యామమువర్ణము, సూర్యుడు అధిదేవత.

వి॥ హైయంగవీనేవిరహే మౌళౌమోదకభావనే । ఫుల్లపద్మేచ మఞ్జర్యాం కిరీటేవర్తులేపిచ ॥ శ్లాఘాయాంరూపసౌన్దర్యే నర్తనేదుర్గసౌధయోః । ధమ్మిల్లే చన్ద్రశాలాయాం మాధుర్యేసాధువాదనే । నియుజ్యతే తాళఫలేహస్తోఽయమలపల్లవః॥

తా॥ అప్పుడుకాచిన నెయ్యి, విరహము, తల, కుడుమునుజూపుట, వికసించినతామరపువ్వు, పూగుత్తి, కిరీటము, చక్రాకారము, శ్లాఘించుట, ఆకృతి, చక్కదనము, బోగమాట, కోట, మేడ, కొప్పు, మేడమీదియిల్లు, బాగుబాగుఅనుట, తాటిపండు, వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౯ - కేతుహస్తలక్షణమ్.

శ్లో॥ వామేకరేతుసూచీస్యాద్దక్షిణేఽర్ధపతాకకః । కేతుగ్రహకరఃప్రోక్తో భరతాగమవేదిభిః॥

తా॥ ఎడమచేతసూచీహస్తముసు కుడిచేతపతాకహస్తమునుపట్టబడినయెడ కేతుహస్తమగును.

## అథ దశావతారహస్తానిరూప్యన్తే.

## ౧ - మత్స్యాఽవతారహస్తలక్షణమ్.

శ్లో॥ మత్స్యహస్తం దర్శయిత్వాతతస్కన్ధసమాకరౌ । త్రిపతాకౌయదిధృతౌ యుజ్యతేమత్స్యజన్మని।

తా॥ మత్స్యహస్తమును జూపి రెండు త్రిపతాకహస్తములను భుజశిరస్సులకు సమముగా బట్టినయెడ మత్స్యావతారహస్తమగును. ఇది మత్స్యావతారమం దుపయోగించును.

## ౨ కూర్మావతారహస్తలక్షణమ్.

శ్లో॥ కూర్మహస్తందర్శయిత్వా తతస్కన్ధ సమాకరౌ।
త్రిపతాకౌయదిధృతౌయుజ్యతేకూర్మజన్మని॥

తా॥ కూర్మహస్తమునుజూపి భుజశిరస్సులకు సమముగా త్రిపతాకహస్తములు పట్టినయెడకూర్మావతారహస్తమగును. ఇదికూర్మావతారమందు చెల్లును.

## 3 - వరాహాఽవతారహస్తలక్షణమ్.

శ్లో॥ దర్శయిత్వావరాహంతుకటిపార్శ్వ సమాకరౌ।
ధృతౌవరాహదేవస్యహస్తఇత్యభిధీయతే॥

తా॥ వరాహహస్తమునుజూపి పిరుదులయందుహస్తములనుంచునెడ వరాహావతారహస్తమగును,

## ౪ - నృసింహాఽవతార హస్తలక్షణమ్.

శ్లో॥ వామేసింహముఖంధృత్వాదక్షిణేత్రిపతాకకః।
నరసింహాఽవతారస్యహస్తఇత్యభిధీయతే॥

తా॥ ఎడమచేత సింహముఖహస్తమును కుడిచేత పతాకహస్తమునుబట్టిన యెడ నృసింహాఽవతారహస్తమగును.

## ౫ - వామనాఽవతారహస్తలక్షణమ్.

శ్లో॥ ఊర్ధ్వాఽధోధృతముష్టిభ్యాం సవ్యాన్యాభ్యాంయదిస్థితః।
సవామనాఽవతారస్యహస్తఇత్యభిధీయతే॥

తా॥ మీదుగాను క్రిందుగాను ఎడమకుడిచేతులచే రెండుముష్టిహస్తములు పట్టబడినయెడవామనాఽవతారహస్తమగును.

౬ - పరశురామావతారహస్తలక్షణమ్.

శ్లో॥ వామంకటితటేన్యస్య దక్షిణేర్ధపతాకకః।
ధృతోపరశురామస్య హస్తఇత్యభిధీయతే॥

తా॥ ఎడమచేతిని నడుమునందుంచి కుడిచేత అర్ధపతాకహస్తమునుబట్టు నెడ పరశురామావతారహస్తమగును.

౭ - రఘురామావతారహస్తలక్షణమ్.

శ్లో॥ కపిత్థందక్షిణేహస్తేవామేతుశిఖరఃకరః।
ఆధరోత్తరభాగేతురామచన్ద్రకరఃస్మృతః॥

తా॥ కుడిచేతకపిత్థహస్తమును ఎడమచేతశిఖరహస్తమును క్రిందుమీదులుగా పట్టబడినయెడ రామచంద్రావతారహస్తమగును.

౮ - బలరామావతారహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకందక్షిణేహస్తేముష్టిర్వామకరేతథా।
బలరామావతారస్యహస్తఇత్యభిధీయతే॥

తా॥ కుడిచేతపతాకహస్తమును, ఎడమచేతముష్టిహస్తమునుపట్టబడినయెడ బలరామావతారహస్తమగును.

౯ - కృష్ణావతారహస్తలక్షణమ్.

శ్లో॥ మృగశీర్షేతుహస్తాభ్యామన్యోన్యాభిముఖీకృతే।
అంసోపకణ్ఠేకృష్ణస్యహస్తఇత్యభిధీయతే॥

తా॥ రెండుమృగశీర్షహస్తములు భుజశిరస్సులసమీపమున ఎదురెదురుగా పట్టబడినయెడ కృష్ణావతారహస్తమగును.

౧౦ - కల్క్యవతారహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకందక్షిణేవామేత్రిపతాకకరోధృతః।
కల్క్యవతారహస్తస్యాదితినాట్యవిదోవిదుః॥

తా॥ కుడిచేతపతాకహస్తమును ఎడమచేతత్రిపతాకహస్తమునుపట్టబడినయెడ కల్క్యవతారహస్తమగును.

రాక్షసహస్తలక్షణమ్.

శ్లో॥ ముఖేకరాభ్యాం శకటోరాక్షసానాంకరస్మృతః॥

తా॥ రెండుచేతులచేముఖమునందుశకటహస్తముపట్టబడెనేనిరాక్షసహస్తమగును.

అథ చతుర్వర్ణహస్తానిరూప్యన్తే.

బ్రాహ్మణహస్తలక్షణమ్.

శ్లో॥ కరాభ్యాంశిఖరంధృత్వాయజ్ఞసూత్రప్రదర్శనే।
దక్షిణేనకృతేతిర్యగ్బ్రాహ్మణానాంకరస్మృతః॥

తా॥ రెండుశిఖరహస్తములనుబట్టికుడిచేత అడ్డముగా జన్నిదమును జూపునెడ బ్రాహ్మణహస్తమగును.

### క్షత్రియహస్తలక్షణమ్.

శ్లో॥ వామేనశిఖరంతిర్యగ్ధృత్వాఽన్యేనపతాకకః।
ధృతోయదిక్షత్రియాణాంహస్త ఇత్యభిధీయతే॥

తా॥ ఎడమచేతశిఖరహస్తమును అడ్డముగాబట్టి కుడిచేతపతాకహస్తమునుపట్టునెడ క్షత్రియహస్తమగును.

### వైశ్యహస్తలక్షణమ్.

శ్లో॥ వామేకరేతుహంసాస్యందక్షిణేకటకాముఖః।
వైశ్యహస్తోఽయమాఖ్యాతోభరతాఽగమవేదిభిః॥

తా॥ ఎడమచేతహంసాస్యహస్తమును కుడిచేతకటకాముఖహస్తమునుపట్టబడిన యెడవైశ్యహస్తమగును.

### శూద్రహస్తలక్షణమ్.

శ్లో॥ వామేతుశిఖరంసూచీదక్షిణేశూద్రహస్తకః॥

తా॥ ఎడమచేతశిఖరహస్తమును కుడిచేతసూచీహస్తమును పట్టబడినయెడ శూద్రహస్తమగును.

శ్లో॥ అష్టాదశానాంజాతీనాంకర్మతేనకరాస్స్మృతాః॥

తా॥ పదునెనిమిదిజాతులకును వారివారిక్రియలచే అందులకుతగినట్టు హస్తములు చెప్పబడును.

శ్లో॥ తత్తద్దేశజనానాంచఏవమూహ్యంబుధోత్తమైః॥

తా॥ ఆయాదేశముల జనులకును ఈరీతిగానేహస్తము లూహింపవలసినదని పెద్దలచేతచెప్పబడుచున్నది.

శ్లో॥ యావదర్థాఃప్రయోగాణాంతావద్భేదాస్కరాస్స్మృతాః।
అర్థాత్ప్రకరణాల్లిఙ్గాదౌచిత్యాదర్థనిర్ణయః॥

తా॥ ప్రయోగములకెన్నివిధములయర్థభేదములుగలవో అన్నివిధముల హస్తభేదములునుగలవు. శబ్దార్థములచే ఆయాప్రకరణమునుజూచి స్త్రీలింగపుంలింగ భేదముల వలన ప్రకృతోచితాఽర్థనిర్ణయముచేసికోవలయును.

శ్లో॥ తత్తత్సమ్యక్సమాలోక్యసఙ్గృహ్యోక్తమిదంమయా।
సమాలోచ్యప్రయోక్తవ్యంభావజ్ఞైరిహశాస్త్రతః॥

తా॥ ఈవిషయముబాగుగావిమర్శించిచూచిననాచేతసంగ్రహముగాచెప్పబడెను కనుకభావజ్ఞులీశాస్త్రరీతిని చక్కగానాలోచించి తత్తద్విషయానుగుణముగ ఉపయోగింప దగును.

—: (౦) :—

## గ్రంథాన్తరస్థప్రసిద్ధరాజహస్తానిరూప్యన్తే.

శ్లో॥ శుకతుణ్డో హరిశ్చన్ద్రే మయూరో నళభూపతౌ । పురుకుత్సేఽలపద్మాఖ్యో ముష్టిహస్తః పురూరవే। అలపద్మశ్శిరస్థాయీ సగరార్థే నియుజ్యతే। దిలీపాఖ్యే పతాకస్స్యాదమ్బరీషే తు కర్తరీ। శిబిరాజ్ఞి కపిత్థస్స్యాత్పురోభాగే ప్రచాలితః। ఉభౌ పతాకౌ భుజయోరన్తే దేవవిభావనే। కథితౌ కార్తవీర్యే తు విరళాఙ్గుష్ఠరన్ధ్రకః। ఏతౌ వహేత్పృష్ఠితౌ చేద్రావణార్థే ప్రకీర్తితౌ। భుజదేశే ప్రచలితో సూచిస్స్యాద్ధర్మరాజకే। త్రిపతాకో పురోభాగే చాలితశ్చ పునఃపునః। అర్జునార్థే నాట్యభేదే యుజ్యతే నాట్యవేదిభిః। భీమే ముష్టిః పురోభాగే చలితో యది కల్ప్యతే। ఉక్తో శైబ్యే సూచిరేవ కిఞ్చిదుద్వేష్టితాఙ్గుళిః। కటకో నకులార్థే చ శిఖరస్సహదేవకే। నహుషే చలహస్తస్స్యాద్యయాతౌ తామ్రచూడకః। అర్ధచన్ద్రకరస్సోఽయం త్రిపతాకాకృతిర్భవేత్। భగీరథార్థే యోజ్యస్స్యాద్రాహుంగ్రస్తేన్దుమణ్డలే॥

తా॥ శుకతుండహస్తము హరిశ్చంద్రునియందును, మయూరహస్తము నలునియందును, అలపద్మహస్తము కుత్సునియందును, ముష్టిహస్తముపురూరవుని యందును, శిరస్సునందు జేర్చినయలపద్మహస్తము సగరునియందును, పతాకహస్తముదిలీపుని యందును, కర్తరీముఖహస్తము అంబరీషునియందును,ఎదురుగాచలింపచేయబడినకపిత్థహస్తము శిబియందును, ఎడముగాజేయబడి భుజముల కొనలయందు దేవభావనగాపట్టబడిన రెండుపతాకహస్తములు కార్తవీర్యునియందును, ఆపతాకహస్తములే ముందువెనుకలుగా గూర్చిపట్టినయెడ రావణునియందును, భుజప్రదేశమందు చలింపజేయబడినసూచీహస్తము ధర్మరాజునందును, త్రిపతాకహస్తము ఎదురుగ మాటికి మాటికిచలింపజేయబడెనేని అర్జునునియందును, ముష్టిహస్తము ఎదురుగచలింపజేయబడెనేనిభీమసేనునియందును రేచితాంగుళములుగలసూచీహస్తముశైబ్యునియందును, కటకాముఖహస్తమునకులునియందును, శిఖరహస్తముసహదేవునియందును,చలపతాకహస్తము నహుషునియందును, తామ్రచూడహస్తము యయాతియందును, అర్ధచంద్ర హస్తమును త్రిపతాకాకృతిగబట్టినయెడ భగీరథునియందును, రాహుగ్రస్తమైన చంద్రమండలమందును చెల్లును.

శ్లో॥ మాన్ధాతాగ్రిమభూపాలే మరుత్వానితి భూభుజి । నిరూపణార్థే ముకుళ సూచిర్ముష్టికరోఽపిచ । కరోప్యర్ధపతాకస్స్యాదుద్వేష్టిత తనప్యభుజః । ఏతేచతుర్విధాహస్తాః ప్రయోజ్యాస్తేయథాక్రమాత్ । రఘావజ మహీపాలే దక్షిణే తరభాగతః । క్రమేణ పరియోజ్యన్తే పూర్వోక్తార్ధ పతాకికా । అలపద్మస్స్వస్తికశ్చేద్యోజ్యో దశరథేనృపే। రామే శిఖరహస్తోసౌ విశేషాచ్చాపపాణిషు ? యోజ్యో శాస్త్రప్రయోగేషు పూర్వధర్మ విశారదైః । శిఖరోఽయం దక్షిణాంస గామీ చేద్భరతే భవేత్ । అయం వామాంసగామీ చేల్లక్ష్మణార్థే నియుజ్యతే । అయం లలాటగామీ చే చ్ఛత్రుఘ్నార్థే నియుజ్యతే। సోమవంశేజనిజుషాం యేతు వామాంసయోజనాత్ । కల్పతో నాట్యకుశలైః యుక్త ధర్మప్రయోగతః॥

తా॥ మాంధాతయనెడి రాజశ్రేష్ఠుని యందును, మరుత్తుఅనెడి మహారాజునందును ముకుళహస్తము, సూచిహస్తము, ముష్టిహస్తము, ఉద్వేష్టిత త్రిపతాకహస్తము ఈనాలుగు హస్తములును చెల్లును.రఘుమహారాజు,అజమహారాజువీరియందుకుడిచేతిత్రిపతాకహస్తము చెల్లును. దశరథమహారాజునందు, స్వస్తికాలపద్మహస్తము చెల్లును.

శిఖరహస్తము రామునియందును, చాపపాణులైన రాజులయందును చెల్లును. శిఖరహస్తము కుడిమూపునందు జేర్చిపట్టబడినయెడ భరతుని యందును, ఎడమమూపునందు జేర్చిపట్టినయెడ లక్ష్మణునియందును, నొసటికిసరిగా పట్టబడినయెడ శత్రుఘ్నునియందును చెల్లును. ఇట్లు ఈహస్తములు క్రమముగా సూర్యవంశపు రాజుల విషయమందు చెప్పబడెను. ఈహస్తములే యెడమప్రక్కగా పట్టబడునెడ చంద్రవంశపు రాజుల విషయమునందు వినియోగించునని నాట్యశాస్త్రజ్ఞులచేత జెప్పబడుచున్నది.

## సప్తసముద్రహస్తానిరూప్యన్తే.

శ్లో॥ లవణేక్షుసురాసర్పి దధిక్షీరజలార్ణవాః।
ఏతేషాంహస్త కలనావిశేషాత్ప్రతిపాద్యతే॥

తా॥ లవణము, ఇక్షువు, సుర, సర్పి, దధి, క్షీరము, జలము, అని సముద్రములు ఏడు. వీనియ హస్తసందర్భములు విశేషముగా జెప్పబడును.

## లవణసముద్రహస్తమ్.

శ్లో॥ ముకుళాఖ్యాకరౌ చైవవ్యావృత్తౌ చాపవేష్టితౌ।
ప్రయోజ్యౌలవణాబ్ధౌధిషణస్యమతాన్తరే॥

తా॥ విరివిగా త్రిప్పబడిన ముకుళహస్తములను అధోముఖములుగ బట్టినయెడల లవణసముద్రమందు చెల్లును అని బృహస్పతిమతము.

## ౨ - ఇక్షుసముద్రహస్తమ్.

శ్లో॥ అలపద్మౌతథాభూతౌ ఇక్ష్వబ్ధౌసమ్ప్రయుజ్యతే॥

తా॥ అలపద్మహస్తమును క్రిందచెప్పినప్రకారమే పట్టినయెడ ఇక్షుసముద్రమందు చెల్లును.

## 3 - సురాసముద్రహస్తమ్.

శ్లో॥ సఙ్కీర్ణాఖ్యపతాకౌచ తథైవగుణమాశ్రితౌ।
సురామ్బుధౌప్రయోక్తవ్యౌ శుక్రాచార్యమతాన్తరే॥

తా॥ సంకీర్ణపతాకములను అదేరీతిని విరివిగాత్రిప్పి దిగుమొగములుగా బట్టినయెడ సురాసముద్రమందు చెల్లును. అని శుక్రాచార్యులమతము.

## ౪ - సర్పిసముద్రహస్తమ్.

శ్లో॥ సర్పిరబ్ధేస్తుచతురో వాయుసూనుమతాన్తరే॥

తా॥ సర్పి (నేతి) సముద్రమందు చతురహస్తముచెల్లును. అని హనుమంతునిమతము.

## ౫ - దధిసముద్రహస్తమ్.

శ్లో॥ త్రిపతాకాభిధాహస్తౌ గుణపూర్వపదాశ్రితౌ। దధ్యర్ణవేప్రయోక్తవ్యౌ దత్తిలాచార్యసమ్మతౌ॥

తా॥ త్రిపతాకహస్తములను ముందుచెప్పినరీతిని బట్టినయెడ దధిసముద్రమందు చెల్లును. అని దత్తిలాచార్యమతము.

## ౬ - క్షీరసముద్రహస్తమ్.

శ్లో॥ సర్పశీర్షాహ్వయౌహస్తౌయథాపూర్వగుణాశ్రయౌ । క్షీరసాగరరూపార్థే నారదాభిమతోఽభవత్॥

తా॥ సర్పశీర్షహస్తములను మునుపటివలెనేపట్టినయెడ క్షీరసముద్రమందు చెల్లును అనినారదమహాముని మతము.

## ౭ - శుద్ధోదకసముద్రహస్తమ్.

శ్లో॥ పతాకగుణసంయుక్తౌ పూర్వవన్మిళితాకృతౌ । జలార్ణవేప్రయోక్తవ్యౌకోహళాచార్యసమ్మతౌ॥

తా॥ పతాకహస్తములను మునుపటివలెనే విరివిగాత్రిప్పి క్రిందుముఖముగబట్టినయెడశుద్ధోదకసముద్రమందుచెల్లును. అనికోహళాచార్యమతము.

## ప్రసిద్ధనదీనాంహస్తానిరూప్యన్తే.

శ్లో॥ గఙ్గాదీనాంనిర్ణయేతు వాన్యవృత్తశ్చాపవేష్టితః । నదీనామపిసర్వాసాం పతాకస్సముదాహృతః॥ గఙ్గాదీనాంవిశేషేణతద్గుణాద్యనువర్ణనాత్ । హస్తానాంభేదకలనా గురుణాపూర్వమీరితా। తత్స్వరూపంప్రవక్ష్యామి నాట్యాభినయయోగతః॥

తా॥ గంగ మొదలైన నదులను నిర్ణయించుటయందు ముందరికిచాచిక్రిందుగా బట్టబడిన పతాకహస్తము వినియోగించును. ఆగంగాదినదులకు వానివాని విశేషగుణాదులనుబట్టివర్ణించుటవలన నాట్యాభినయమునందు కొన్నిహస్తములు వినియోగింపబడును గనుక వానిస్వరూపములిచ్చట చెప్పబడుచున్నవి.

## గంగాదినదుల హస్తములు.

శ్లో॥ గంగాయాంతామ్రచూడస్స్యాత్సూర్యజాయాన్తురేఖికః। కృష్ణవేణ్యాంసింహముఖః కావేర్యాంచతురఃకరః॥ పతాకచతురౌహస్తౌ సరస్వత్యాం ప్రకీర్తితౌ । నర్మదాయాంవిధేయస్స్యాత్కరోహ్యర్ధపతాకికః॥ హంసాస్యస్తుఙ్గభద్రాయాంశరావత్యాన్తుబాణకః॥ సూచీహస్తోవేత్రవత్యాం చన్ద్రభాగార్ధకేవలః । సరయ్వామపిపద్మాఖ్యోభీమరథ్యామరాళకః॥ సువర్ణముఖనద్యాంచ కరోర్ధచతురోమతః । శుకతుణ్డో పాపనాశ్యాంయుజ్యతే భావవేదిభిః॥ అనుక్తానాంనదీనాంచ పతాకస్సమ్ప్రయుజ్యతే॥

తా॥ తామ్రచూడహస్తము గంగానదియందును, రేఖాహస్తము యమునానదియందును, సింహముఖహస్తము కృష్ణవేణీనదియందును, చతురహస్తము కావేరీ నదియందును, పతాకచతురహస్తములు సరస్వతీనదియందును, అర్ధపతాకహస్తము నర్మదానది యందును, హంసాస్యహస్తము తుంగభద్రానదియందును, బాణహస్తము శరావతీ నదియందును, అలపద్మహస్తము సరయూనదియందును, అరాళహస్తము భీమరథీనదియందును, అర్ధచతురహస్తము స్వర్ణముఖ నదియందును, శుకతుండ హస్తము పాపనాశనీనదియందును చెల్లును. ఇవిగాక తక్కిన నదులయందు పతాకహస్తము చెల్లును.

## ౧ - ఊర్ధ్వలోకహస్తమ్.

శ్లో॥ భూలోకశ్చభువర్లోక స్స్వర్గలోక స్తతఃపరః । జనోలోక స్తపోలోకః
సత్యలోకాభిధ స్తతః । మహర్లోకశ్చసప్తైతే లోకాశ్చోర్ధ్వంసమాశ్రితాః ।
పతాకోద్వేష్టితముఖః ఏతేషువినియుజ్యతే॥

తా॥ భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకము, మహర్లోకము, ఇవి మీది యేడులోకములు. వీనియందు ఉద్వేష్టిత పతాకహస్తము వినియోగించును.

## ౨ - అధోలోకహస్తమ్.

శ్లో॥ అతలోవితలశ్చైవ సుతలశ్చతలాతలః । మహాతలఇతిఖ్యాతో రసాతల
ఇతీరితః । పాతాళశ్చైవసప్తైతే హ్యధోలోకాఃప్రకీర్తితాః । అధోలోకే
షుయుజ్యేత పతాకశ్చాపవేష్టితః॥

తా॥ అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళము, ఈ యేడును క్రింది యేడులోకములు. వీనియందు అపవేష్టిత పతాకహస్తము వినియోగించును.

## అథవృక్షభేదానాంహస్తానిరూప్యన్తే.

## ౧ - అశ్వత్థవృక్షహస్తమ్.

శ్లో॥ అలపద్మౌరేచితౌచేదశ్వత్థేసమ్ప్రయుజ్యతే॥

తా॥ రెండుఅలపద్మహస్తములనుచలింపజేసినయెడఅశ్వత్థవృక్షమందుచెల్లును.

## ౨ - కదలీవృక్షహస్తమ్.

శ్లో॥ కదళ్యాంశ్లిష్టముకుళో రేచితోద్వేష్టితోభవేత్॥

తా॥ శ్లిష్టముకుళహస్తమును పొడువుగ కదలించి పట్టినయెడ కదళీవృక్షమందుచెల్లును.

## ౩ - ౪ - నారఙ్గలికుచవృక్షహస్తమ్.

శ్లో॥ నారఙ్గేపద్మకోశస్స్యాద్భ్రమరోలికుచేభవేత్॥

తా॥ నారింజచెట్టునందు పద్మకోశహస్తమును, గజనిమ్మచెట్టునందుభ్రమర హస్తమును చెల్లును.

## ౫ - ౬ - పనసబిల్వావృక్షహస్తమ్.

శ్లో॥ పనసేచతురః ప్రోక్తో బిల్వాశ్వత్థేచతురోభవేత్॥

తా॥ పనసబిల్వావృక్షములయందు చతురహస్తముచెల్లును,

## ౭ - పున్నాగవృక్షహస్తమ్.

శ్లో॥ పతాకచతురౌప్రోక్తౌ పున్నాగతరునిర్ణయే॥

తా॥ పతాకచతురహస్తములు పొన్నమ్రానియందుచెల్లును.

## ౧౦ - ౧౧ - మన్దారవకుళవృక్షహస్తమ్.

శ్లో॥ మన్దారే ఖణ్డచతురో సందంశో వకుళే భవేత్॥
తా॥ ఖండచతురహస్తము మందారవృక్షమందును, సందంశహస్తము వకుళవృక్షమందును చెల్లును.

## ౧౫ - ౧౬ - వటార్జునవృక్షహస్తమ్.

శ్లో॥ పతాకో వటవృక్షేస్యా దర్జునే సింహవక్త్రకః॥
తా॥ మఱ్ఱిమ్రానియందు పతాకహస్తమును, ఏరుమద్దిమ్రానియందు సింహముఖహస్తమును చెల్లును.

## ౧౮ - ౧౯ - పాటలీహిన్తాలవృక్షహస్తమ్.

శ్లో॥ పాటల్యాంశుకతుణ్డస్స్యాత్ హిన్తాలే కర్తరీముఖః॥
తా॥ పాదిరిచెట్టునందుశుకతుణ్డహస్తమును, ఈదాటిచెట్టునందుకర్తరీముఖహస్తమును చెల్లును.

## ౨౦ - పున్నాగవృక్షహస్తమ్.

శ్లో॥ పద్మకోశౌస్వస్తికాస్స్యా త్పున్నాగవృక్షరూపణే॥
తా॥ రెండుపద్మకోశహస్తములు స్వస్తికములుగ బట్టబడినయెడ పొన్నమ్రానియందుచెల్లును.

## ౨౨ - చమ్పకవృక్షహస్తమ్.

శ్లో॥ చమ్పకే పూర్వశాస్త్రిజ్ఞై రధోలాఙ్గూలమిష్యతే॥
తా॥ సంపెగమ్రానియందు అధోలాంగూలహస్తమును వినియోగింపవలెనని పూర్వశాస్త్రజ్ఞులచే చెప్పబడెను.

## ౨౩ - ఖదిరవృక్షహస్తమ్.

శ్లో॥ అరంవతస్తామ్రచూడో వ్యఙ్గఃఖదిరవర్ణనే॥
తా॥ తామ్రచూడహస్తమును మిక్కిలిక్రిందుమొగముగవంచిపట్టుచెండ్రతుమ్మచెట్టునందుచెల్లును.

## ౨౪ - శమీవృక్షహస్తమ్.

శ్లో॥ శమీవృక్షే సమాఖ్యాతః కరో యస్త్రిపతాకకర్తరీ
తా॥ త్రిపతాకకర్తరీహస్తముజమ్మిచెట్టునందుచెల్లును.

## ౨౫ - అశోకవృక్షహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకామణిబన్ధస్థా సమ్యక్తిర్యక్కృతౌ యది। పతాకస్వస్తికోహస్తః కథితో భరతాదిభిః। పతాకస్వస్తికోహస్తః అశోకాభినయేస్మృతః॥
తా॥ పతాకహస్తములు మనికట్టులందుచేర్చి యడ్డముగాబట్టబడినయెడ పతాకస్వస్తికహస్తమగును. ఇదిఅశోకవృక్షమునందు చెల్లును.

## ౨౬ - సిన్దువారవృక్షహస్తమ్.

శ్లో॥ సిన్దువారతరౌయోజ్యఃకరశ్శ్లిష్టమయూరకః॥
తా॥ వావిలిచెట్టునందుశ్లిష్టమయూరహస్తముచెల్లును.

## ౨౭ - ఆమలకవృక్షహస్తలక్షణమ్.

శ్లో॥ తర్జనీమధ్యమాహస్తతలేసమ్మిశ్రితోయది। ఇతరే ప్రసృతాస్సోఽయం కరో నంయమనామకః । సంయమాభిధహస్తోఽపియత్తదామలకేద్రుమే॥

తా॥ తర్జనీమధ్యమలను అరచేతిలోజేర్చితక్కినవ్రేళ్లను చాచిపట్టిన నదిసంయమహస్తమౌను. ఈహస్తము ఉసిరికచెట్టునందుచెల్లును.

## ౨౮ - కురవకవృక్ష హస్తమ్.

శ్లో॥ కర్తరీత్రిపతాకాచజ్ఞేయాకురవకద్రుమే॥
తా॥ కర్తరీత్రిపతాకహస్తములు ఎఱ్ఱపువ్వులగోరంటచెట్టునందుచెల్లును.

## ౨౯ - కపిత్థవృక్షహస్తమ్.

శ్లో॥ అలపద్మౌస్వస్తికౌచేత్కపిత్థార్థేనియుజ్యతే॥
తా॥ అలపద్మహస్తములనుస్వస్తికములుగబట్టినయెడవెలగమ్రానియందు చెల్లును.

## ౩౦ - కేతకీవృక్షహస్తమ్.

శ్లో॥ పతాకచతురాభిఖ్యౌస్వస్తికౌమణిబన్ధయోః। కేతకీవృక్షభేదేపి యుజ్యతే దేవమన్త్రిణి॥

తా॥ పతాకచతురహస్తములను మణిబంధములందుస్వస్తికములుగబట్టినయెడపచ్చమొగలిచెట్టునందుచెల్లును. ఇదిదేవమంత్రిసమ్మతము.

## ౩౧ - శింశపావృక్షహస్తమ్.

శ్లో॥ అర్ధచన్ద్రౌస్వస్తికౌస్యాత్ప్రయోజ్యోశింశపాతరౌ॥
తా॥ అర్ధచంద్రహస్తములను స్వస్తికములుగబట్టిన నది ఇరుగుడు మ్రానియందు చెల్లును.

## ౩౨ - నిమ్బసాలవృక్షహస్తలక్షణమ్.

శ్లో॥ శుకతుణ్డౌస్వస్తికౌచేన్నిమ్బేసాలేనిరూపితౌ॥

తా॥ శుకతుణ్డహస్తములను స్వస్తికములుగబట్టినయెడ వేపమ్రానియందును, ఏపెమ్రానియందును చెల్లును.

## ౩౩ - పారిజాతవృక్షహస్తలక్షణమ్.

శ్లో॥ వామేపతాకకోహస్తస్త్రిపతాకికః । ఉద్వేష్టితకృతోహస్తోత్రిజ్ఞానః పరికీర్తితః। త్రిజ్ఞానఃపారిజాతస్యక్రోడేయదిధృతఃకరః॥

తా॥ ఎడమచేతనుకుడిచేతనుపతాకహస్తమునుపైకిత్రిప్పిపట్టినయెడత్రిజ్ఞానహస్తమౌను. ఈహస్తము రొమ్మునకెదురుగబట్టినయెడ పారిజాతవృక్షమందుచెల్లును.

### ౩౪ - తిన్త్రిణీజమ్బూవృక్షహస్తమ్.

శ్లో॥ తిన్త్రిణ్యాముపిలాఙ్గూలోజమ్బ్వామర్ధపతాకికః॥
తా॥ చింతచెట్టునందులాంగూలహస్తమును, నేరేడుచెట్టునందు అర్ధపతాకహస్తమునుచెల్లును.

### ౩౫ - పాలాశరసాలవృక్షహస్తమ్.

శ్లో॥ పాలాశేచార్ధచన్ద్రశ్చరసాలేత్రిపతాకికః॥
తా॥ మోదుగుచెట్టునందుఅర్ధచంద్రహస్తమును, తియ్యమామిడిచెట్టునందుత్రిపతాకహస్తమునుచెల్లును.

## అథసింహాదిమృగాణాంహస్తానిరూప్యన్తే.

### ౧ - సింహహస్తమ్.

శ్లో॥ దక్షిణేసింహవక్త్రస్యాత్తత్పృష్ఠేవామహస్తకః। పతాకమాపమాశ్రిత్య
చలత్ప్రవిరళాఙ్గులిః। శ్లిష్టసింహముఖస్సోఽయం సింహార్థేవినియుజ్యతే॥
తా॥ కుడిచేత సింహముఖహస్తమునుబట్టి దానివెనుక తట్టుపతాకహస్తమును ఎడమైనవ్రేళ్లు గలుగబట్టిన నదిశ్లిష్ట సింహముఖ హస్తమనబడును. ఈహస్తము సింహమునందు చెల్లును.

### ౨ - వ్యాఘ్రహస్తలక్షణమ్.

శ్లో॥ అర్ధచన్ద్రోఽధోముఖశ్చే ద్వ్యాఘ్రార్థేసమ్ప్రయుజ్యతే॥
తా॥ అర్ధచంద్రహస్తమును అధోముఖముగబట్టినయెడ పెద్దపులియందుచెల్లును.

### ౩ - సూకరహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోక్తమత్స్యహస్తేతు దక్షిణఃకుఞ్చితశ్చలః। అస్యాఙ్గుళ్యఃప్రవిరళాః
పశ్చాన్నక్ష్యాయథాక్రమమ్। యుజ్యతేస్తబ్ధరోమార్థే సఙ్కీర్ణమకరఃకరః॥
తా॥ ముందుచెప్పిన మత్స్యహస్తమందు దక్షిణహస్తము వంచికదలించుచు ఇతరహస్తము వ్రేళ్లవైదింటిని విరళములుగబట్టిన నది సంకీర్ణమకరహస్తమనబడును. ఈహస్తము పందియందు వినియోగించును,

### ౪ - కపిహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోక్తముష్టిహస్తస్తు మధ్యమాఙ్గుష్ఠయోగతః।
నామ్నాధోముష్టిముకుళః కపేరర్థేనిరూప్యతే॥
తా॥ ముందుచెప్పిన ముష్టిహస్తము మధ్యమాంగుష్ఠముల చేరికవలన అధోముష్టి ముకుళహస్తమనబడును. ఈహస్తము కోతియందు వినియోగించును.

## ౫ - భల్లూకహస్తలక్షణమ్.

శ్లో॥ వామహస్తేపద్మకోశో ధోముఖత్వముపాశ్రితః । దక్షిణేతుపతాకాఖ్య స్త స్యపృష్ఠతలశ్రితః । భల్లూకార్థేప్రయోగస్యా త్పద్మకోశపతాకకః॥

తా॥ ఎడమచేత దిగుమొగముగా పద్మకోశహస్తమునుబట్టి కుడిచేతపట్టబడిన పతాకహస్తమును దానిపై నుంచినయెడ పద్మకోశపతాకహస్తమౌను. ఇది ఎలుగుగొడ్డునందు వినియోగించును.

## ౬ - మార్జారహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోక్తముష్టిహస్తస్యా నామికాఙ్గుష్ఠయోగతః ।
నామ్నాయమర్ధముకుళో మార్జారేసమ్ప్రయుజ్యతే॥

తా॥ ముందుచెప్పబడిన ముష్టిహస్తముయొక్క అనామికాంగుష్ఠములను జేర్చిపట్టినన అది అర్ధముకుళహస్తమవును. ఈహస్తము పిల్లియందుచెల్లును.

## ౭ - చమరీమృగహస్తలక్షణమ్.

శ్లో॥ వామేముష్టిర్దక్షిణేవా మణిబన్ధేనమిశ్రితః । ముద్రికాధోముఖో ముష్టిముద్రాహస్తోయమీరితః । ముష్టిముద్రాకరశ్చాపి చమర్యాంసమ్ప్రయుజ్యతే॥

తా॥ ఎడమచేత ముష్టిహస్తమును కుడిచేత ముద్రాహస్తమును మనికట్టుతోజేర్చి క్రిందుమొగముగాబట్టినయెడ ముష్టిముద్రాహస్తమౌను. ఇది చమరీమృగమునందు వినియోగించును.

## ౮ - గోధాహస్తలక్షణమ్.

శ్లో॥ ఊర్ధ్వేకనిష్ఠికాఙ్గుష్ఠౌ పతాకేకిఞ్చిదీరితౌ । నామ్నాతలపతాకోయం గోధాయాంపృక్షితోభవేత్॥

తా॥ పతాకహస్తమందు కనిష్ఠికాఙ్గుష్ఠములను కొంచెముమీదికి ఎత్తిపట్టినయెడ తలపతాకహస్తమగును. ఈహస్తము ఉడుమునందుచెల్లును.

## ౯ - శల్యమృగహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోక్తమృగశీర్షస్య తర్జన్యాద్ధ్వప్రసారితా ।
నామ్నాచన్ద్రమృగోహస్త శ్శల్యార్థేసమ్ప్రయుజ్యతే॥

తా॥ మునుపుచెప్పిన మృగశీర్షహస్తమందు చూపుడువ్రేలు పైకెత్తబడినయెడ చంద్రమృగహస్తమగును. ఇది శల్యమృగమందు వినియోగించును.

## ౧౦ - కురఙ్గహస్తమ్.

శ్లో॥ కురఙ్గేచప్రయోక్తవ్యోమృగశీర్షకనామకః॥
తా॥ మృగశీర్షహస్తము జింకయందుచెల్లును.

## ౧౩ - కృష్ణసారహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోక్తముష్టిహస్తేతుకనిష్ఠాఙ్గుష్ఠసారణాత్।
నామ్నాముష్టిమృగోహస్తః కృష్ణసారేప్రయుజ్యతే॥

తా॥ మునుపు చెప్పిన ముష్టిహస్తమందు కనిష్ఠాఙ్గుష్ఠములనుచాచి పట్టినయెడముష్టి మృగహస్తమౌను. ఇదినల్లజింకయందు చెల్లును.

## ౧౪ - గోకర్ణహస్తమ్.

శ్లో॥ ధేనుకర్ణే నాగబన్ధో రేచితో యదియోజితో॥

తా॥ నాగబంధహస్తములను మీదికిచలింపజేయుచుపట్టినయెడ గోకర్ణమ్మునకము నందు చెల్లును.

## ౧౫ - మూషికహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోక్తముకుళేహస్తేతర్జనీవప్రసారితా।
నామ్నాయంఖణ్డముకుళో మూషికార్థేనియుజ్యతే॥

తా॥ మునుపు చెప్పిన ముకుళహస్తమందు చూపుడువ్రేలిని బాగుగచాచిపట్టినయెడలఖండముకుళహస్తముఅనబడును. ఈహస్తము ఎలుకయందు చెల్లును.

## ౧౬ - గిరికాహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోక్తముకుళే భూయస్తర్జనీకుఞ్చితాయది।
తిర్యక్ప్రసారితఃఖడ్గముకుళోగిరికార్థకే॥

తా॥ మునుపుచెప్పినముకుళహస్తమందు చూపుడువ్రేలిని వంచి అడ్డముగ చాచి పట్టినయెడఖడ్గముకుళహస్తమౌను. ఇదిచిట్టెలుకయందు చెల్లును.

## ౧౭ - శశహస్తమ్.

శ్లో॥ హస్తస్థలపతాకాఖ్యోశశకేతిర్యగాశ్రయః॥

తా॥ వెలికిల బట్టిన పతాకహస్తము అడ్డముగ త్రిప్పబడినయెడ కుందేటి యందుచెల్లును

## ౧౮ - వృశ్చికహస్తము.

శ్లో॥ అధోముఖోరేచితశ్చేత్కర్కటోవృశ్చికేభవేత్॥

తా॥ కర్కటహస్తమును అధోముఖముగ చలింపజేయుచు పట్టినయెడ తేలు నందు చెల్లును.

## ౧౯ - శునకహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకాభిధహస్తేతు కుఞ్చితాచేత్కనిష్ఠికా।
నామ్నామధ్యపతాకోయంశునకార్థేప్రయుజ్యతే॥

తా॥ పతాకహస్తమందు చిటికెనవ్రేలు ముడువబడెనేని మధ్యపతాకహస్తమౌను. ఇది కుక్కయందు చెల్లును.

## ౨౦ - ఉత్ప్లవహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వోదితాఞ్జలి కరేచాఙ్గుష్ఠౌకుఞ్చితౌయుతౌ । ప్రసారితేచోర్ధ్వభాగే చలితౌసోఽప్యధోముఖః ॥ నామ్నా ఖణ్డాఞ్జలిరయం ఉష్ట్రార్థేసమ్ప్రయుజ్యతే॥

తా॥ మునుపు చెప్పిన అంజలిహస్తమందు అంగుష్ఠములను వంచిచేర్చి పాదుగుగ జాచి అధోముఖముగ చలింపజేయుచు పట్టినయెడ ఖండాంజలిహస్తముగును-ఇది ఒంటెయందు చెల్లును.

## ౨౧ - అజహస్తమ్.

శ్లో॥ శిఖరౌశ్లిష్టవదనౌ మేషార్థేసమ్ప్రయుజ్యతే॥

తా॥ శిఖర హస్తములను ముఖభాగము చేర బట్టినయెడ మేకయందు వినియోగించును.

## ౨౨ - గార్దభహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వఖణ్డాఞ్జలౌమిశ్రకుఞ్చితేతర్జనీద్వయే। భిన్నాఞ్జలిరయంనామ్నా గార్దభార్థేనియుజ్యతే॥

తా॥ మునుపుచెప్పిన ఖండాంజలిహస్తమందు తర్జనీ ద్వయమును జేర్చి వంచిపట్టినయెడ భిన్నాంజలిహస్తమువును. ఇది గాడిదయందు చెల్లును.

## ౨౩ - వృషభహస్తలక్షణమ్.

శ్లో॥ మధ్యమానామికేకిఞ్చిత్కుఞ్చితేతలమాశ్రితే । అఙ్గుష్ఠేనోపరియుతే శేషే ద్వేచప్రసారితే.తలసింహకరస్సోయమ్వృషభార్థేనియుజ్యతే॥

తా॥ మధ్యమానామికలను కొంచెము అరచేతితట్టునకువంచి వానిమీద అంగుష్ఠమును జేర్చి తక్కిన రెండువ్రేళ్లను చాచిపట్టినయెడ తలసింహహస్తమౌను - ఇది వృషభార్థమందు వినియోగించును.

## ౨౪ - ధేనుహస్తలక్షణమ్

శ్లో॥ మధ్యమావక్రితాయత్ర శేషాస్సర్వేప్రసారితాః॥
ధేనావోజ్యోయస్త్రిభేధేభ వేత్సఙ్కీర్ణముద్రకః॥

తా॥ నడిమివ్రేలినివంచి తక్కినవ్రేళ్లనుచాచిపట్టినయెడ సంకీర్ణముద్రహస్తమౌను. ఇది ఆవునందును, యంత్రభేదమునందును చెల్లును,

## అథపక్షిభేదహస్తానిరూప్యన్తే.

## ౧ - పారావతహస్తలక్షణమ్.

శ్లో॥ పారావతేకపోతాఖ్యకరస్స్యాత్పుఙ్ఖితాకృతిః॥

తా॥ కపోత హస్తమును పుంఖితాకారముగ బట్టినయెడ పావురాయియందు వినియోగించును.

## ౨ - కపోతహస్తమ్.

శ్లో॥ కపోతస్తిర్యగాకారః కపోతే వినియుజ్యతే॥
తా॥ కపోతహస్తమును అడ్డముగా బట్టినయెడ అది పావురాయియందు వినియోగించును.

## ౩ - శశాదనహస్తమ్.

శ్లో॥ బ్రహ్మోక్తశుకతుణ్డస్స్యాచ్ఛశాదననిరూపణే॥
తా॥ బ్రహ్మోక్తశుకతుండహస్తము డేగయందు వినియోగించును.

## ౪ - ఉలూకహస్తలక్షణమ్.

శ్లో॥ గజదన్తౌ శ్లిష్టముఖౌ సంశ్లిష్టగజదన్తకః।
సంశ్లిష్టగజదన్తోయములూకార్థే నియుజ్యతే॥
తా॥ గజదంతహస్తముల మొనలను జేర్చిపట్టినయెడ సంశ్లిష్టగజదంతహస్తమగును - ఇది గుడ్లగూబయందు చెల్లును.

## ౫ - గణ్డభేరుణ్డహస్తలక్షణమ్.

శ్లో॥ మణిబన్ధావనాశ్లిష్టావర్ధచన్ద్రావధోముఖౌ । సవ్యాపసవ్యౌ విరళౌ నామ్నా
స్వస్తికచన్ద్రికః । గణ్డభేరుణ్డకాఖ్యస్య వినియోగః ప్రకీర్తితః॥
తా॥ అర్ధచంద్రహస్తములను అధోముఖములుగ మనికట్లు చేరపట్టి ప్రేళ్లను విరళములుగా జేసినయెడ స్వస్తిక చంద్రహస్తమనబడును. ఇది గండభేరుండపక్షియందు వినియోగింపబడును.

## ౬ - చాతకహస్తమ్.

శ్లో॥ లాఙ్గూలశ్చాతకే భూయాత్పుఙ్ఖితత్వముపాశ్రితః॥
తా॥ లాంగూలహస్తమును పుంఖితముగఁబట్టినయెడ చాతకపక్షియందు చెల్లును.

## ౭ - కుక్కుటహస్తమ్.

శ్లో॥ పూర్వోక్తభ్రమరో భూయాత్తామ్రచూడనిరూపణే॥
తా॥ మునుపుచెప్పబడిన భ్రమరహస్తమే కోడియందు వినియోగించును.

## ౮ - పికహస్తలక్షణమ్.

శ్లో॥ అరాళః పుఙ్ఖితాకారః కోకిలార్థే నియుజ్యతే॥
తా॥ అరాళహస్తమును పుంఖితముగబట్టినయెడ కోయిలయందు వినియోగించును.

## ౯ - వాయసహస్తలక్షణమ్.

శ్లో॥ భరతార్ణవసమ్ప్రోక్తభ్రమరాఙ్గుష్ఠకస్తథా । అగ్రభాగేన తర్జన్యాః మిళితో
యది పుఙ్ఖితః । సందంశముకుళో భూయాద్వాయసార్థే నియుజ్యతే॥

తా॥ భరతశాస్త్రమందు చెప్పబడియుండెడి ఖర్పరహస్తాంగుష్ఠము చూపుడువ్రేలి తో కలసి పుంఖితముగ ఎదుటబట్టబడినయెడ సందంశ ముకుళహస్తమనబడును. ఇది కాకి యందు వినియోగించును.

## ౧౦ - కురరహస్తమ్.

శ్లో॥ కురరా[illegible] సూచీ చేదపి ప్రయుజ్యతే॥

తా॥ సూచిహస్తము అపవిద్ధముగ బట్టబడినయెడ కురరపక్షియందు చెల్లును.

## ౧౧ - శుకహస్తమ్.

శ్లో॥ శుకతుణ్డో భ్రమరాత్ప్రోక్తః శుకార్థే పక్షికాకృతిః॥

తా॥ శుకతుండహస్తము పుంఖితాకారముగబట్టినయెడ చిలుకయందు విని యోగించును.

## ౧౨ - సారసహస్తలక్షణమ్.

శ్లో॥ ముకులే తు కనిష్ఠాపి కిఞ్చిద్వక్రీతభావతః ।
నామ్నా ప్రదేశముకులో యోజ్యోऽయం సారసార్థకే॥

తా॥ ముకుళహస్తము నందలి చిటికెనవ్రేలు కొంచెము వంకరగా పట్టబడినయెడ ప్రదేశ ముకుళహస్తమవును. ఇది సారసపక్షియందు వినియోగించును.

## ౧౩ - బకహస్తలక్షణమ్.

శ్లో॥ తర్జన్యఙ్గుష్ఠసంయోగే మధ్యమానామికాపి చ । ప్రసారితే కనిష్ఠా చేద్వక్రితా తలమాశ్రితా । నామ్నా సఙ్కీర్ణహస్తోऽయం శుక్రాచార్యమతోదితః । బకార్థే మన్త్రభేదేషు యోజ్యస్సఙ్కీర్ణహంసకః॥

తా॥ తర్జనీ అంగుష్ఠములను చేర్చి మధ్యమానామికులను చాచి కనిష్ఠను అరచేతి తో వంచిపట్టినయెడ సంకీర్ణ హంసహస్తమనబడును. ఇది శుక్రాచార్యునిమతము. ఈహస్తము బకము-కొంగయందును, మంత్రభేదమునందును చెల్లును.

## ౧౪ - క్రౌఞ్చపక్షిహస్తలక్షణమ్.

శ్లో॥ పూర్వాలపద్మహస్తే తు కనిష్ఠా తలకుఞ్చితా । లీనాలపద్మహస్తోऽయం క్రౌఞ్చార్థే సమ్ప్రయుజ్యతే॥

తా॥ ముందుచెప్పిన అలపద్మహస్తమందు చిటికెనవ్రేలు అరచేతిలో వంచబడిన యెడ లీనాలపద్మహస్తమనబడును. ఇది క్రౌంచపక్షి (గుడ్డికొంగ) యందు వినియోగించును,

## ౧౫ - ఖద్యోతహస్తలక్షణమ్.

శ్లో॥ అఙ్గుష్ఠో మధ్యమాయాస్స్యాదగ్రపర్వనిపీడితః ।
ముఖహంసకరస్సోऽయం ఖద్యోతార్థేऽపవిద్ధకః॥

తా॥ బొటనవ్రేలిచే నడిమివ్రేలి కొనగనుపు ఒరయునట్లు అపవిద్ధముగ బట్టినయెడ ముఖహంస హస్తమవును. ఇది మిడుగురు పురుగునందు వినియోగించును.

## ౧౬ - భ్రమరహస్తమ్.

శ్లో॥ అపరభ్రమరో హస్తో భ్రమరే సంప్రయుజ్యతే ॥
తా॥ ఇతరమైన భ్రమరహస్తమును పుంఖితముగ బట్టినయెడ భ్రమరమందు వినియోగించును.

## ౧౭ - మయూరహస్తమ్.

శ్లో॥ మయూరాఖ్యః ప్రయోజ్యస్స్యా న్మయూరేపుంఖితో యది
తా॥ మయూరహస్తమును పుంఖితాకారముగ బట్టినయెడ నెమలియందు వినియోగించును.

## ౧౮ - హంసహస్తమ్.

శ్లో॥ హంసాస్యః కథితో యోజ్యస్స్యాత్ హంసాస్త్వష్టాకృతిః
తా॥ మునుచెప్పిన హంసాస్యహస్తము హంసపక్షియందు వినియోగించును.

## ౧౯ - చక్రవాకహస్తమ్.

శ్లో॥ అలపద్మః పుంఖితాచే చ్చక్రవాకే నియుజ్యతే॥
తా॥ అలపద్మహస్తములను పుంఖితములుగ బట్టినయెడ చక్రవాకపక్షియందు వినియోగించును.

## ౨౧ - కోయష్టికహస్తలక్షణమ్.

శ్లో॥ అరాళో దక్షిణే వామే పతాకేన విమిశ్రితః ।
నామ్నారాళపతాకోఽయం కోయష్టికనిరూపణే॥
తా॥ కుడిచేతి అరాళహస్తమును ఎడమచేతి పతాకహస్తములో జేర్చిపట్టినయెడ అరాళపతాకహస్తమగును. ఇది కోయష్టికమనెడి పక్షియందు వినియోగించును.

## ౨౨ - వ్యాళీహస్తలక్షణమ్.

శ్లో॥ తర్జనీమధ్యమే చాగ్రే చాపవద్వక్రితే యుతే । అనామికాఙ్గుష్ఠసన్ధౌ వక్రితా సంప్రతిష్ఠితా । కనిష్ఠావక్రితా నామ్నాయం వ్యాళీ వ్యాళాఖ్యాయాం నియుజ్యతే॥
తా॥ తర్జనీమధ్యమలను జేర్చి ధనుస్సువలె వంచి అనామికను అంగుష్ఠసంధియందుంచి కనిష్ఠను వంచిపట్టినయది వ్యాళీహస్తమనబడును. ఇది వ్యాళియనెడి పక్షియందు వినియోగించును.

## అథ జలజన్తుహస్తానిరూప్యన్తే.

## ౧ - భేకహస్తలక్షణమ్.

శ్లో॥ చక్రాఙ్గుష్ఠా చ తర్జన్యౌ హస్తయోరన్తరస్థితా । మధ్యమే మిశ్రితే కిఞ్చి త్కుఞ్చితే చాప్యనామికే । ప్రసారితే కనిష్ఠే చ శ్లిష్టచక్రోఽయమిష్యతే। ఏతస్యవినియోగస్తు భేకార్థే సమ్ప్రయుజ్యతే ॥
తా॥ చక్రహస్తములయొక్క అఙ్గుష్ఠతర్జనులను చేతిలోపలికి మడిచి మధ్యములను జేర్చి అనామికలను వంచి కనిష్ఠలను చాచిపట్టిన నది శ్లిష్టచక్రహస్తమనబడును. ఈహస్తము భేకార్థమందు చెల్లును.

## ౨ - కుళీరహస్తలక్షణమ్.

శ్లో॥ దక్షిణో కర్కటో భూయా దపవేష్టితరూపకః । వామహస్తోపరిస్థాయః ।
శ్లిష్టశ్చాపాఙ్గుళిత్రయాత్ । తీనకర్కటకహస్తోఽయం కుళీరేసమ్ప్రయుజ్యతే॥

తా॥ కర్కటహస్తమును కుడిచేతియందు అపవేష్టితముగ మీదికిచాచిపట్టి క్రేళ్ల
ను జేర్చినయది తీనకర్కటహస్తమగును. ఇది కుళీరార్థమందు వినియోగించును.

## 3 - రక్తపాయిహస్తమ్.

శ్లో॥ రక్తపాయినిసూచీహస్తా క్రేడితౌతిర్యగేవచ॥
తా॥ సూచీహస్తములను కదలించుచు అడ్డముగబట్టిన నదిజలగయందు చెల్లును.

## ౪ - నక్రహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకస్స్వస్తికోహస్తో మిళితశ్చవిదర్శితః ।
నక్రార్థేపేటికార్థేచ యోజితఃపూర్వసూరిభిః ॥
తా॥ పతాకహస్తమును స్వస్తికముగబట్టి విడిచిన నది నక్రహస్తమగును. ఇది
మొసలియందును, పెట్టెయందును వినియోగించును.

## ౫ - డుణ్డుభహస్తలక్షణమ్.

శ్లో॥ దక్షిణేకర్తరీభూతః కరస్స్యోర్ధ్వముఖోయది । అన్యప్రకోష్ఠే వామస్యో
త్కటకాముఖరూపతః । కర్తరీదణ్డహస్తోఽయం డుణ్డుభార్థే ప్రయుజ్యతే॥

తా॥ కుడిచేతియందు కర్తరీముఖహస్తమును ఊర్ధ్వముఖముగాబట్టి యెడమముం
జేతియందు దక్షిణహస్తమున కర్తరీముఖమునుబట్టి అన్యప్రకోష్ఠమందు కటకాముఖహ
స్తమునుబట్టిన నదికర్తరీదండహస్తమగును. ఇది యిరుదలలపామునందు వినియోగించును.

---

శ్లో॥ సరసాభినయాదీనాం మాపాదనసుధీజుషా । వేంకటాచార్యవర్యేణ నీడామఙ్గ
లవాసినా । భరతాగమగ్రన్థాది భావశాస్త్రేష్వనేకశః । సంగృహ్యావిష
యాన్సమ్యక్ పూర్వాచార్యైస్సుయుతాన్ । గ్రథితోఽయంసమాలోచ్య
నితరాంవిదుషాంముదే । ఏవమాలోక్యసుధియ స్తుష్యేయురితిసాదరమ్ ।
దర్పణాఖ్యేనగ్రన్థేన ముద్రితోస్సాయథామతి॥

తా॥ సరసాభినయాదులను జెప్పుటయందు సమర్థుడైన నీడామంగలం తిరువేంక
టాచార్యులచే భరతశాస్త్రాదులవలననుండి అనేకవిషయములు సంగ్రహింపబడి అభిజ్ఞుల
సంతోషముకొరకు అభినయ దర్పణము అనుగ్రంథముతో జేర్చి అచ్చువేయింపబడెను.

ఇతి అభినయదర్పణాఖ్యోగ్రన్థః.

గ్రన్థాన్తరస్థ శిరోభేదాది సహితః

సమాప్తః.

శ్రీసన్తాన రామార్పణమస్తు.

శ్రీరస్తు.

# శృంగారరసప్రధానంబగు

# భారతరసప్రకరణము.

ఇది.

నిడామంగలం

తిరువేంకటాచార్యులవారిచేత

కూర్పబడి

తెనుగుభాషతోతాత్పర్యమువ్రాయబడి

వంగీపురం, రామకృష్ణమాచార్యులవారి

శ్రీసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

౧౮౭౯ సం.

శ్రీరస్తు.

శ్రీసంతానరామపరబ్రహ్మణేనమః.

అభినయశాస్త్రమందు దానికి కావలసినహస్తములు మొదలయినవి చెప్పబడియున్నవి. వానినభినయమున జూపునపుడు భావముల నతదనుగుణముగా జూపవలయును కాబట్టి అభినయించువారికిని దాని జూచియానందించువారికిని భావజ్ఞానమవశ్యము. కావున శృంగారశాస్త్రములననేకములశోధించి వానియందు ముఖ్యములయిన సాహిత్యచింతామణి, ప్రతాపరుద్రీయము, రసార్ణవసుధాకరము మొదలయినగ్రంథములనుండి అవశ్యమయిన విషయములనెత్తికూర్చి వానికి తెలుగున అర్థము వ్రాసి భరతరసప్రకరణంబను పేర ఈ గ్రంథము రచించితిని. ఇది శృంగారరసము దానిభావములు మొదలగువానిని విచారించువారికిని భరతవిద్యను విచారించువారికిని మిక్కిలియుపయుక్తము. అభినయవిషయమును దెలుపు నభినయదర్పణమను గ్రంథము పూర్వమే ముద్రింపబడియున్నది. ఇదియునుంగాక ఈ గ్రంథము మొదలగు నలంకారగ్రంథములయందుండు నాయికానాయకరసవ్యభిచారిభావాలంకార సహితములగు రాజమన్నారుగుడిలోనుండు భరతవిద్యాప్రవీణులగు సభాపతయ్యగారిచే రచింపబడిన కొన్ని పదములు ముద్రింపబడబోవుచున్నవి.

విషయసూచికా.


| విషయసంఖ్యా. | | పుటసంఖ్యా. |
|---|---|---|
| ౧ | భరతసూత్రం | ౧ |
| ౨ | విభావలక్షణం | ,, |
| ౩ | అనుభావలక్షణం | ,, |
| ౪ | వ్యభిచారిభావలక్షణం | ౨ |
| ౫ | విభావస్థాయిసంయోగః | ,, |
| ౬ | స్థాయ్యనుభావసంయోగః | ,, |
| ౭ | స్థాయివ్యభిచారిసంయోగః | ,, |
| ౮ | రసలక్షణం | ,, |
| ౯ | నిష్పత్తిలక్షణం | ,, |
| ౧౦ | విభావనిరూపణం | ,, |
| ౧౧ | ఆలంబనవిభావలక్షణం | ౩ |
| ౧౨ | స్థాయిరసాలంబననాయికానిరూపణం | ,, |
| ౧౩ | స్వీయాలక్షణం | ,, |
| ౧౪ | ముగ్ధాలక్షణం | ,, |
| ౧౫ | మధ్యాలక్షణం | ,, |
| ౧౬ | మానలక్షణం | ౪ |
| ౧౭ | లఘుమానలక్షణం | ,, |
| ౧౮ | మధ్యమానలక్షణం | ,, |
| ౧౯ | గురుమానలక్షణం | ,, |
| ౨౦ | ధీరమధ్యాలక్షణం | ,, |
| ౨౧ | అధీరమధ్యాలక్షణం | ,, |
| ౨౨ | ధీరాధీరమధ్యాలక్షణం | ,, |
| ౨౩ | ప్రగల్భాలక్షణం | ౫ |
| ౨౪ | ధీరప్రగల్భాలక్షణం | ,, |
| ౨౫ | అధీరప్రగల్భాలక్షణం | ,, |
| ౨౬ | ధీరాధీరప్రగల్భాలక్షణం | ,, |
| ౨౭ | జ్యేష్ఠాకనిష్ఠాలక్షణం | ,, |
| ౨౮ | పరకీయాలక్షణం | ,, |
| ౨౯ | పరకీయకన్యాలక్షణం | ౬ |
| ౩౦ | పరకీయపరోఢాలక్షణం | ,, |
| ౩౧ | సామాన్యాలక్షణం | ,, |
| ౩౨ | అష్టవిధనాయికానిరూపణం | ౭ |

| విషయసంఖ్యా. | | పుటసంఖ్యా. |
|---|---|---|
| ౩౩ | స్వాధీనపతికాలక్షణం | ,, |
| ౩౪ | వాసకసజ్జికాలక్షణం | ,, |
| ౩౫ | విరహోత్కంఠితాలక్షణం | ,, |
| ౩౬ | విప్రలబ్ధాలక్షణం | ,, |
| ౩౭ | ఖండితాలక్షణం | ౮ |
| ౩౮ | కలహాంతరితాలక్షణం | ,, |
| ౩౯ | ప్రోషితభర్తృకాలక్షణం | ,, |
| ౪౦ | అభిసారికాలక్షణం | ,, |
| ౪౧ | ఉత్తమాలక్షణం | ౯ |
| ౪౨ | మధ్యమాలక్షణం | ,, |
| ౪౩ | అధమాలక్షణం | ,, |
| ౪౪ | నాయికాసంఖ్యా | ,, |
| ౪౫ | దూత్యాదినిరూపణం | ౧౦ |

| | | |
|---|---|---|
| ౪౬ | నాయకప్రకరణం | ,, |
| ౪౭ | పతిలక్షణం | ,, |
| ౪౮ | ఉపపతిలక్షణం | ,, |
| ౪౯ | వైశికలక్షణం | ,, |
| ౫౦ | అనుకూలలక్షణం | ,, |
| ౫౧ | దక్షిణలక్షణం | ౧౧ |
| ౫౨ | ధృష్టలక్షణం | ,, |
| ౫౩ | శఠలక్షణం | ,, |
| ౫౪ | పీఠమర్దాదిలక్షణం | ,, |

| | | |
|---|---|---|
| ౫౫ | ఉద్దీపనవిభావనిరూపణం | ,, |
| ౫౬ | ఆలంబనగుణాః | ౧౨ |
| ౫౭ | యౌవననిరూపణం | ,, |
| ౫౮ | ప్రథమయౌవనలక్షణం | ,, |
| ౫౯ | ద్వితీయయౌవనలక్షణం | ,, |
| ౬౦ | తృతీయయౌవనలక్షణం | ౧౩ |
| ౬౧ | రూపలక్షణం | ,, |
| ౬౨ | లావణ్యలక్షణం | ౧౪ |
| ౬౩ | సౌందర్యలక్షణం | ,, |

| విషయసంఖ్యా. | | పుటసంఖ్యా. |
|---|---|---|
| ౬౪ | [illegible] | ,, |
| ౬౫ | మార్దవలక్షణం | ,, |
| ౬౬ | సౌకుమార్యలక్షణం | ,, |
| ౬౭ | ఉత్తమసౌకుమార్యలక్షణం | ,, |
| ౬౮ | మధ్యమసౌకుమార్యలక్షణం | ,, |
| ౬౯ | అధమసౌకుమార్యలక్షణం | ,, |
| ౭౦ | చేష్టాలక్షణం | ౧౫ |
| ౭౧ | అలంకృతినిరూపణం | ,, |
| ౭౨ | తటస్థనిరూపణం | ,, |
| ౭౩ | అనుభావనిరూపణం | ,, |
| ౭౪ | చిత్తజానుభావనిరూపణం | ,, |
| ౭౫ | భావలక్షణం | ,, |
| ౭౬ | హావలక్షణం | ౧౬ |
| ౭౭ | హేలాలక్షణం | ,, |
| ౭౮ | శోభాలక్షణం | ,, |
| ౭౯ | కాంతిలక్షణం | ,, |
| ౮౦ | దీప్తిలక్షణం | ,, |
| ౮౧ | ప్రాగల్భ్యలక్షణం | ,, |
| ౮౨ | మాధుర్యలక్షణం | ,, |
| ౮౩ | ధైర్యలక్షణం | ,, |
| ౮౪ | ఔదార్యలక్షణం | ,, |
| ౮౫ | గాత్రజానుభావనిరూపణం | ,, |
| ౮౬ | లీలాలక్షణం | ౧౭ |
| ౮౭ | విలాసలక్షణం | ,, |
| ౮౮ | విచ్ఛిత్తిలక్షణం | ,, |
| ౮౯ | విభ్రమలక్షణం | ,, |
| ౯౦ | కిలికించితలక్షణం | ,, |
| ౯౧ | మోట్టాయితలక్షణం | ,, |
| ౯౨ | కుట్టమితలక్షణం | ,, |
| ౯౩ | బిబ్బోకలక్షణం | ,, |
| ౯౪ | లలితలక్షణం | ౧౮ |
| ౯౫ | విహృతలక్షణం | ,, |
| ౯౬ | వాగారంభానుభావాః | ,, |
| ౯౭ | ఆలాపవిలాపలక్షణం | ,, |
| ౯౮ | సల్లాపలక్షణం | ,, |
| ౯౯ | ప్రలాపానులాపలక్షణం | ,, |
| ౧౦౦ | అపలాపలక్షణం | ,, |
| ౧౦౧ | సందేశలక్షణం | ,, |
| ౧౦౨ | అతిదేశలక్షణం | ౧౯ |
| ౧౦౩ | నిర్దేశలక్షణం | ,, |
| ౧౦౪ | అపదేశలక్షణం | ,, |
| ౧౦౫ | ఉపదేశలక్షణం | ,, |
| ౧౦౬ | వ్యపదేశలక్షణం | ,, |
| ౧౦౭ | బుద్ధ్యారంభానుభావాః | ,, |
| ౧౦౮ | సాత్త్వికభావాః | ,, |
| ౧౦౯ | స్తంభలక్షణం | ౨౦ |
| ౧౧౦ | స్వేదలక్షణం | ,, |
| ౧౧౧ | రోమాంచలక్షణం | ,, |
| ౧౧౨ | స్వరభేదలక్షణం | ,, |
| ౧౧౩ | వేపథులక్షణం | ,, |
| ౧౧౪ | వైస్వర్యలక్షణం | ,, |
| ౧౧౫ | అశ్రులక్షణం | ,, |
| ౧౧౬ | ప్రళయలక్షణం | ౨౧ |
| ౧౧౭ | వ్యభిచారిభావాః | ,, |
| ౧౧౮ | నిర్వేదాదినిరూపణం | ,, |
| ౧౧౯ | నిర్వేదలక్షణం | ౨౨ |
| ౧౨౦ | గ్లానిలక్షణం | ,, |
| ౧౨౧ | శంకాలక్షణం | ,, |
| ౧౨౨ | అసూయాలక్షణం | ౨౩ |
| ౧౨౩ | మదలక్షణం | ,, |

| విషయసంఖ్యా. | | పుటసంఖ్యా. |
|---|---|---|
| ౧౨౪ | శ్రమలక్షణం | ౨౪ |
| ౧౨౫ | ఆలస్యలక్షణం | ,, |
| ౧౨౬ | దైన్యలక్షణం | ,, |
| ౧౨౭ | చింతాలక్షణం | ,, |
| ౧౨౮ | మోహలక్షణం | ౨౫ |
| ౧౨౯ | ధృతిలక్షణం | ,, |
| ౧౩౦ | స్మృతిలక్షణం | ,, |
| ౧౩౧ | వ్రీడాలక్షణం | ,, |
| ౧౩౨ | చపలతాలక్షణం | ,, |
| ౧౩౩ | హర్షలక్షణం | ౨౬ |
| ౧౩౪ | ఆవేగాష్టకలక్షణం | ,, |
| ౧౩౫ | జడతాలక్షణం | ౨౮ |
| ౧౩౬ | గర్వలక్షణం | ,, |
| ౧౩౭ | విషాదలక్షణం | ,, |
| ౧౩౮ | జ్యేష్ఠవిషాదః | ,, |
| ౧౩౯ | మధ్యమవిషాదః | ,, |
| ౧౪౦ | అధమవిషాదః | ౨౯ |
| ౧౪౧ | ఔత్సుక్యలక్షణం | ,, |
| ౧౪౨ | నిద్రాలక్షణం | ,, |
| ౧౪౩ | అపస్మారలక్షణం | ,, |
| ౧౪౪ | సుప్తిలక్షణం | ,, |
| ౧౪౫ | విబోధలక్షణం | ౩౦ |
| ౧౪౬ | అమర్షలక్షణం | ,, |
| ౧౪౭ | అవహిత్థాలక్షణం | ,, |
| ౧౪౮ | ఉగ్రతాలక్షణం | ,, |
| ౧౪౯ | మతిలక్షణం | ,, |
| ౧౫౦ | వ్యాధిలక్షణం | ౩౧ |
| ౧౫౧ | శీతజ్వరవ్యాధిః | ,, |
| ౧౫౨ | దాహజ్వరవ్యాధిః | ,, |
| ౧౫౩ | ఉన్మాదలక్షణం | ,, |
| ౧౫౪ | వియోగజోన్మాదః | ,, |
| ౧౫౫ | ఇష్టనాశజోన్మాదః | ౩౨ |
| ౧౫౬ | మరణలక్షణం | ,, |
| ౧౫౭ | వ్యాధిజమరణం | ,, |
| ౧౫౮ | అభిఘాతమరణం | ,, |
| ౧౫౯ | త్రాసలక్షణం | ౩౩ |
| ౧౬౦ | వితర్కలక్షణం | ,, |
| ౧౬౧ | వ్యభిచారివర్గచతుష్టయలక్షణం | ,, |
| ౧౬౨ | అనౌచిత్యద్వితయలక్షణం | ౩౪ |
| ౧౬౩ | స్థాయినిరూపణం | ,, |
| ౧౬౪ | రతిస్థాయిలక్షణం | ,, |
| ౧౬౫ | ప్రేమలక్షణం | ౩౫ |
| ౧౬౬ | మానలక్షణం | ,, |
| ౧౬౭ | ప్రణయలక్షణం | ,, |
| ౧౬౮ | స్నేహలక్షణం | ,, |
| ౧౬౯ | ప్రౌఢస్నేహలక్షణం | ,, |
| ౧౭౦ | మందస్నేహలక్షణం | ,, |
| ౧౭౧ | మధ్యస్నేహలక్షణం | ,, |
| ౧౭౨ | రాగలక్షణం | ౩౬ |
| ౧౭౩ | కుసుంభరాగలక్షణం | ,, |
| ౧౭౪ | నీలరాగలక్షణం | ,, |
| ౧౭౫ | మాంజిష్ఠరాగలక్షణం | ,, |
| ౧౭౬ | అనురాగలక్షణం | ,, |
| ౧౭౭ | ఉత్సాహస్థాయిలక్షణం | ,, |
| ౧౭౮ | శోకస్థాయిలక్షణం | ౩౭ |
| ౧౭౯ | విస్మయస్థాయిలక్షణం | ,, |
| ౧౮౦ | హాసస్థాయిలక్షణం | ,, |
| ౧౮౧ | భయస్థాయిలక్షణం | ,, |
| ౧౮౨ | జుగుప్సాస్థాయిలక్షణం | ౩౮ |
| ౧౮౩ | క్రోధస్థాయిలక్షణం | ,, |
| ౧౮౪ | శత్రువిషయక్రోధః | ,, |
| ౧౮౫ | భృత్యవిషయక్రోధః | ,, |
| ౧౮౬ | మిత్రవిషయక్రోధః | ,, |
| ౧౮౭ | పూజ్యవిషయక్రోధః | ౩౯ |
| ౧౮౮ | రసభేదనిరూపణం | ౪౦ |
| ౧౮౯ | శృంగారరసలక్షణం | ,, |
| ౧౯౦ | విప్రలంభశృంగారలక్షణం | ౪౧ |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౧౯౧ | అయోగవిప్రలంభలక్షణం | ,, |
| ౧౯౨ | దశావస్థానిరూపణం | ౪౨ |
| ౧౯౩ | చక్షుఃప్రీతిలక్షణం | ,, |
| ౧౯౪ | చింతాలక్షణం | ,, |
| ౧౯౫ | సంకల్పలక్షణం | ,, |
| ౧౯౬ | గుణనుతిలక్షణం | ౪౩ |
| ౧౯౭ | క్రియాద్వేషలక్షణం | ,, |
| ౧౯౮ | తాపలక్షణం | ,, |
| ౧౯౯ | లజ్జాత్యాగలక్షణం | ,, |
| ౨౦౦ | ఉన్మాదలక్షణం | ,, |
| ౨౦౧ | మూర్ఛాలక్షణం | ౪౪ |
| ౨౦౨ | మృతిలక్షణం | ,, |
| ౨౦౩ | విరహవిప్రలంభలక్షణం | ,, |
| ౨౦౪ | మానవిప్రలంభలక్షణం | ౪౫ |
| ౨౦౫ | ప్రణయమానలక్షణం | ,, |
| ౨౦౬ | ఈర్ష్యామానలక్షణం | ,, |
| ౨౦౭ | శ్రవణాదినిరూపణం | ,, |
| ౨౦౮ | ప్రవాసవిప్రలంభలక్షణం | ,, |
| ౨౦౯ | శాపవిప్రలంభలక్షణం | ,, |
| ౨౧౦ | సంభోగశృంగారలక్షణం | ౪౬ |
| ౨౧౧ | వీరరసలక్షణం | ,, |
| ౨౧౨ | యుద్ధవీరలక్షణం | ౪౭ |
| ౨౧౩ | దయావీరలక్షణం | ,, |
| ౨౧౪ | దానవీరలక్షణం | ,, |
| ౨౧౫ | కరుణరసలక్షణం | ,, |
| ౨౧౬ | అద్భుతరసలక్షణం | ౪౮ |
| ౨౧౭ | హాస్యరసలక్షణం | ౪౯ |
| ౨౧౮ | స్మితాదినిరూపణం | ,, |
| ౨౧౯ | స్మితలక్షణం | ౫౦ |
| ౨౨౦ | హసితలక్షణం | ,, |
| ౨౨౧ | విహసితలక్షణం | ,, |
| ౨౨౨ | ఉపహసితలక్షణం | ,, |
| ౨౨౩ | అపహసితలక్షణం | ,, |
| ౨౨౪ | అతిహసితలక్షణం | ,, |
| ౨౨౫ | భయానకరసలక్షణం | ౫౧ |
| ౨౨౬ | బీభత్సరసలక్షణం | ,, |
| ౨౨౭ | రౌద్రరసలక్షణం | ౫౨ |
| ౨౨౮ | రసాప్రసోత్పత్తిః | ౫౩ |
| ౨౨౯ | రసానాంవిరోధః | ,, |
| ౨౩౦ | శృంగారవ్యభిచారిణామానుకూల్యం | ౫౪ |
| ౨౩౧ | వీరవ్యభిచారిణామానుకూల్యం | ,, |
| ౨౩౨ | కరుణవ్యభిచారిణామానుకూల్యం | |
| ౨౩౩ | అద్భుతవ్యభిచారిణామానుకూల్యం | ,, |
| ౨౩౪ | హాస్యవ్యభిచారిణామానుకూల్యం | |
| ౨౩౫ | భయానకవ్యభిచారిణామానుకూల్యం | ,, |
| ౨౩౬ | బీభత్సవ్యభిచారిణామానుకూల్యం | ,, |
| ౨౩౭ | రౌద్రవ్యభిచారిణామానుకూల్యం | ౫౫ |


| పుట. | పఙ్క్తి. | అసాధు. | సాధు. |
|---|---|---|---|
| ౧౪ | ౩౧ | మసమా | మసహం |
| ౩౨ | ౧౦ | మరలక్షణం | మరణలక్షణం |
| ౪౯ | ౮ | స్వర్గాను | స్వరాను |
| | ౩౨ | ఖేదాస్యాస్త్రా | ఖెదాస్త్రా |

శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# భరతరసప్రకరణమ్.

శ్లో॥ శృంగారరససందోహం శ్రితకల్పమహీరుహం।
శ్రయే శ్రీనాథమేవాహం శ్రాంతలోకసుఖావహం॥ ౧

తా॥ శృంగారవ్యాపారములకాటపట్టయినను, స్వాశ్రితజనులకోరికల దీర్చుకల్పవృక్షమును, సంసారాదితాపత్రయశ్రాంతులగుజనులకుశాశ్వతబ్రహ్మానందమొసగువాడు నగులక్ష్మీవల్లభుని నామనోరథసంపూర్తికొరకునాశ్రయించెదను.

శ్లో॥ కంఠేనాలంబయేద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్।
చక్షుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళమాచరేత్॥ ౨

తా॥ నటనముజేయునట్టి స్త్రీ మొదటగానముచేసి యావలగీతార్థమునుహస్తాభినయములచేదెలుపవలయును. నేత్రములచేభావమును దెలుపవలయును. పాదములచేతాళమునాచరించవలయును. ... ...

శ్లో॥ యతో హస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః।
యతో మనస్తతో భావో యతో భావస్తతో రసః॥ ౩

తా॥ ఎచ్చటహస్తముజూపబడుచున్నదో అచ్చటదృష్టినుంచవలయును. దృష్టియుండెడుచోటమనస్సునుంచవలయును. మనస్సుండెడుచోటభావముంచవలయును. ఎచ్చటభావమున్నదో అచ్చటరసముగలుగుచున్నది. ...

సూ॥ విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిరితిభరతసూత్రం॥

తా॥ విభావ అనుభావ వ్యభిచారిభావములచేరికవలనరసముగలుగుచున్నదనిభరతసూత్రము.

విభావో నామ.

శ్లో॥ రత్యాదిస్థాయినో యేన భావ్యంతే నితరామితి।
అతోఽసౌ భావపారజ్ఞైర్విభావ ఇతి కథ్యతే॥ ౪

తా॥ రతిమొదలగుస్థాయిభావములు దేనిచేమిక్కిలిభావింపబడుచున్నవో అవిభావజ్ఞులచేవిభావమనిచెప్పబడుచున్నది. ... ...

అనుభావో నామ.

శ్లో॥ రత్యాదిస్థాయినస్సమ్యక్చింతాదీంశ్చ తతః పరం।
అనుభావయతీత్యేష త్వనుభావ ఇతీర్యతే॥ ౫

తా॥ ఏదిరతిమొదలగుస్థాయిభావములనుచింతమొదలగువ్యభిచారిభావములనుస్మరణమునకుతెచ్చుచున్నదో యదియనుభావమనిచెప్పబడును.

వ్యభిచారిభావోనామ.

శ్లో॥ విశేషేణాభిముఖ్యేనసంయాతిస్థాయినంప్రతి।
వ్యభిచారిణస్తేప్రోక్తాభావాభావార్థకోవిదైః॥౬

తా॥ విశేషముగ రత్యాదిస్థాయిభావములకెదురుగాసంచరించుచున్నవో అవివ్యభి
చారిభావములనిభావార్థజ్ఞులచే నెరుగబడినది. ... ... *

విభావాదిభావానాంస్థాయినాంచసంయోగోయథా.

శ్లో॥ కార్యకారణతాయోగోవిభావస్థాయినోర్మిథః॥

తా॥ స్థాయియైనది విభావములచేపుట్టింపబడునదిగనుక స్థాయివిభావములకొకటొ
కటికి కార్యకారణభావముసంబంధమని చెప్పబడుచున్నది. *

స్థాయ్యనుభావసంబంధోయథా.

శ్లో॥ జ్ఞాప్యజ్ఞాపకసంయోగస్తథాస్థాయ్యనుభావయోః॥౭

తా॥ స్థాయిఅనుభావములచేజ్ఞాపింపబడుచున్నదిగనుక స్థాయ్యనుభావములకు
జ్ఞాప్యజ్ఞాపకభావముసంబంధమనిచెప్పబడుచున్నది. *

స్థాయివ్యభిచారిసంబంధోయథా.

శ్లో॥ పోష్యపోషకసంయోగఃస్థాయినాంవ్యభిచారిణాం॥

తా॥ స్థాయిభావములువ్యభిచారిభావములచేపోషింపబడుచున్నదిగనుకస్థాయివ్య
భిచారులకుపోష్యపోషకభావముసంబంధమనబడుచున్నది. *

శ్లో॥ అయంసూత్రస్థసంయోగశబ్దార్థఃపరికీర్తితః॥౮

తా॥ ముందుచెప్పినతెఱగుభేదములుసూత్రములోనుండెడుసంయోగ శబ్దార్థముల
నిచెప్పబడును.

రసోనామ.

శ్లో॥ విభావైరనుభావైశ్చవ్యభిచారిభిరేవచ।
ఆనీయమానస్స్వాదుత్వంస్థాయిభావోరసస్స్మృతః॥౯

తా॥ స్థాయి విభావానుభావవ్యభిచారిభావములచేమనోజ్ఞత్వమును పొందింపబడి
రసమగుచున్నది.

నిష్పత్తిర్నామ.

శ్లో॥ కార్యోత్పత్తిర్విభావస్యకార్యజ్ఞప్తిస్తతఃపరం।అనుభావస్యకార్యస్య
సంపుష్టిర్వ్యభిచారిణః॥౧౦॥ఇతిసూత్రస్థనిష్పత్తిశబ్దార్థఃపరికీర్తితః॥

తా॥ విభావమునకుకార్యమునుగలుగజేయుటయును, అనుభావమునకుకార్యమును
జ్ఞాపించుటయును, వ్యభిచారిభావమునకుకార్యమునుపోషించుటయును, నిష్పత్తిశ
బ్దార్థమనిచెప్పబడును. ... ... ... *

విభావోనిరూప్యతే.

శ్లో॥ ఆలంబనోద్దీపనాత్మావిభావోద్వివిధోమతః॥ ౧౧

తా॥ విభావము ఆలంబనవిభావమనియును,ఉద్దీపనవిభావమనియును,ఇరుదెఱగులు
గజెప్పబడినది. ... ... ... *

ఆలంబనవిభావో యథా-

శ్లో॥ యానాలంబ్య ప్రజాయంతే రత్యాది స్థాయినో౽ఖిలాః ।
ఆలంబనాఖ్యాస్తై ప్రోక్తా నాయికాద్యా విచక్షణైః ॥ ౧౨॥

తా॥ ఏవస్తువులనాశ్రయించి రతి మొదలగు స్థాయిభావములు రసములుగా నగుచున్నవో నాయిక మొదలగు ఆవస్తువులు ఆలంబనములని భావశాస్త్ర ప్రవీణులచే జెప్పబడెను. స్థాయిరసాలంబనభూతా నాయికా యథా.

శ్లో॥ రసాలంబనభూతా యా నాయికాత్ర నిరూప్యతే ।
సా స్వీయా పరకీయేతి సామాన్యేతి త్రిధా మతా ॥ ౧౩

తా॥ ఏ నాయిక రసమునకు నాధారముగ జెప్పబడుచున్నదో ఆనాయిక స్వీయ-పరకీయ-సామాన్య-అని మూడువిధములుగ నుండును.

స్వీయాలక్షణం.

శ్లో॥ సంపత్కాలే విపత్కాలే యా న ముంచతి వల్లభం ।
శీలార్జవగుణోపేతా స్వా స్వీయా పరికీర్తితా ॥ ౧౪
ముగ్ధా మధ్యా ప్రగల్భేతి త్రేధా సాతు నిగద్యతే ॥

తా॥ సంపత్కాలమందును, విపత్కాలమందును, శీలము-ఆర్జవము మొదలగు సద్గుణములు గలిగి నాయకుని విడువకయున్నట్టి స్త్రీ స్వీయయని చెప్పబడును. అది ముగ్ధయనియును, మధ్యయనియును, ప్రగల్భయనియును, మూడు విధములుగలది.

ముగ్ధాలక్షణం.

శ్లో॥ ముగ్ధా నవవధూః కామరతౌ వామా మృదుః క్రుధి ॥ ౧౫॥ యతతే రతిచేష్టాసు గాఢలజ్జా మనోహరా । కృతాపరాధే దయితే వీక్షతే రుదతీ సతీ ।
౧౬॥ అప్రియం వా ప్రియం వాపి న కించిదపి భాషతే ॥

తా॥ ఏయువిద మన్మథవిహారమందు నూతనస్త్రీగాను, మన్మథక్రీడయందు అస్వాధీనురాలుగాను, గాఢమైన లజ్జగలదిగాను, మనోహరగాను, కోపకాలమందు క్షమితగాను, నాయకుడపరాధియయినను రోదనము చేయుచు చూచుచుండునదిగాను, రతివ్యాపారములు యత్నము జేయుచు హితాహితములను జెప్పకయుండునో యది ముగ్ధనాయిక.

మధ్యానాయికాలక్షణం.

శ్లో॥ సమానలజ్జామదనా ప్రోద్యత్తారుణ్యశాలినీ ॥ ౧౭
మధ్యా కామయతే కాంతం మోహాంతే సురతక్షమా ।
మధ్యా త్రిధా మానవృత్త్యా ధీరాధీరోభయాత్మికా ॥ ౧౮

తా॥ సమానములైన సిగ్గును కామమును గలదియును, వృద్ధిబొందు యౌవనముగలదియును, మోహవ్యాపారమధ్యమందు సురతయోగ్యతగలదియనగుచు నాయకుని అపేక్షించు నాయిక మధ్యయనబడును. ఆమధ్యనాయిక మానమనెడు కోపవ్యాపారముచే ధీర- అధీర- ధీరాధీర- అనిమూడు తెఱంగులుగలది॥

మానలక్షణం.

శ్లో॥ ప్రియాపరాధావగమాత్సంజాతో మాన ఇష్యతే।
లఘుమానో మధ్యమానో గురుమాన ఇతి త్రిధా॥ ౧౯

తా॥ నాయకాపరాధము దెలిసినపిదప గలుగు మనోవ్యాపారవిశేషము మానమని చెప్పబడును. ఆమానము లఘుమానమనియును, మధ్యమానమనియును, గురుమానమనియును, మూడు తెఱంగులు గలిగియుండును.

లఘుమానలక్షణం.

శ్లో॥ అన్యస్త్రీదర్శనాదిభ్యో లఘుమానః ప్రజాయతే।
వాగాద్యైస్సైరసౌ మానస్త్వపనేయః ప్రకల్పితః॥ ౨౦

తా॥ అన్యస్త్రీదర్శనము మొదలైనవానివలన గలుగు కోపము లఘుమానమనబడును, ఇది మంచిమాటలు మొదలయినవానిచే తొలగింపబడును.

మధ్యమానలక్షణం.

శ్లో॥ మధ్యమానస్తథాన్యస్త్రీనామగ్రహణతో భవేత్।
ఏష మానోపనేతవ్యశ్శపథాద్యనువర్తనైః॥ ౨౧

తా॥ నాయకునితోడి సరససల్లాపకాలమందు అన్యస్త్రీ పేరు చెప్పుటవలన గలుగు మనోవ్యాపారము మధ్యమానమనబడును. ఈమానము ప్రమాణము చేయుట మొదలగు అనుసరణములచేత తొలగింపబడును.

గురుమానలక్షణం.

శ్లో॥ అన్యాసంగమచిహ్నైస్తైర్గురుమానః ప్రజాయతే।
పాదప్రణామానునయైరపనేయో భవేదసౌ॥ ౨౨

తా॥ అన్యస్త్రీసంభోగపు గుఱుతులు మొదలైనవానివలన గలుగు చిత్తావేగము గురుమానమనబడును. ఈమానము నమస్కరించుట అనునయించుట మొదలైనవానిచే తొలగింపబడును.

మధ్యాధీరాలక్షణం.

శ్లో॥ ధీరాతు వక్తి వక్రోక్త్యా సోత్ప్రాసం సాగసం ప్రియం॥

తా॥ అపరాధమైనయందు నాయకుని జూచి సాభిప్రాయమైన వంకరమాటలాడునది మధ్యాధీరానాయిక యని చెప్పబడును.

మధ్యాఅధీరానాయికాలక్షణం.

శ్లో॥ అధీరా పరుషైర్వాక్యైః ఖేదయేద్వల్లభం రుషా॥ ౨౩

తా॥ అపరాధియగు నాయకుని క్రూరమైన పలుకులచే ఖేదపఱుచునది మధ్యాధీరానాయిక యనబడును.

మధ్యాధీరాధీరానాయికాలక్షణం.

శ్లో॥ ధీరాధీరాతు వక్రోక్త్యా సబాష్పం వదతి ప్రియం॥

తా॥ కన్నెకొలది నాయకుని ప్రార్థనలకు లొంగిన నాయిక మధ్యాధీరాధీరా నాయికయనబడును. ప్రగల్భానాయికాలక్షణం.

శ్లో॥ సంపూర్ణయౌవనోన్మత్తా ప్రగల్భారూఢమన్మథా ॥ ౨౪ ॥ దయితాంగే విలీనేవ యతతే రతికేళిషు । రతప్రారంభమాత్రేణ గచ్ఛత్యానందమూర్ఛనాం॥ ౨౫॥ మానవృత్త్యా ప్రగల్భాపి త్రిధా ధీరాదిభేదతః॥

తా॥ నిండుయౌవనముచే మదించినదిగాను, మన్మథవ్యాపారపారంగతురాలుగాను, ఉండునది ప్రగల్భానాయికయనబడును. అది రతిలీలయందు నాయకాంగలీనయై ప్రయత్నపడుచున్నది. క్రీడారంభములోనే ఆనందమూర్ఛను బొందును. ఆ ప్రగల్భానాయిక మానవ్యాపారముచే మూడంగులైన ధీరాదిభేదములను బొందును.

ప్రగల్భాధీరాయథా.

శ్లో॥ ఉదాస్తే సురతే ధీరా సావహిత్థా చ సాదరా॥ ౨౬

తా॥ కపటమానసయై అపరాధియగు నాయకునియందు ప్రేమతో రతివిషయములలో ఉపేక్షచేయునది ప్రగల్భాధీరయనబడును.

ప్రగల్భా అధీరాయథా.

శ్లో॥ సంతర్జయత్యరం రోషా దధీరా తాడయేత్ప్రియం॥

తా॥ అపరాధియగు నాయకుని మిక్కిలి బెదిరించి కొట్టునది ప్రగల్భాధీరానాయిక యనబడును. ప్రగల్భాధీరాధీరానాయికాయథా.

శ్లో॥ ధీరాధీరగుణోపేతా ధీరాధీరేతి కథ్యతే॥ ౨౭
ఏతే జ్యేష్ఠాకనిష్ఠాభిఖ్యతో ద్వివిధమతే॥

తా॥ అపరాధియగు నాయకునియందు రతివ్యాపారములో ఉపేక్షయు, బెదిరింపు, తిట్లు, కొట్టును గలది ప్రగల్భాధీరాధీరానాయికయని చెప్పబడును. ముందు చెప్పిన మధ్యాప్రగల్భలలోగల భేదము నొందిన నాయికలు జ్యేష్ఠ కనిష్ఠ అను భేదమువలన ఇరుదెఱంగులగుదురు. జ్యేష్ఠాకనిష్ఠాలక్షణం.

శ్లో॥ ప్రియాధికప్రేమపాత్రం జ్యేష్ఠా సా తు నిగద్యతే॥ ౨౮॥ న్యూనవిస్రంభపాత్రం చేత్కనిష్ఠా సా ప్రకీర్తితా। మధ్యాప్రౌఢే ద్వాదశధా ముగ్ధా త్వేకవిధా మతా॥ ౨౯॥ ఏవం త్రయోదశవిధా స్వీయా సా పరికీర్తితా॥

తా॥ నాయకునికి ఎవతెయందు ప్రేమ అధికముగా నుండునో ఆమె జ్యేష్ఠయనబడును. తక్కువప్రేమ ఎవతెయందుండునో ఆమె కనిష్ఠయనబడును. మధ్యాప్రగల్భానాయికలు పండ్రెండువిధములు గలవారనియు, ముగ్ధ ఏకవిధము గలదనియు జెప్పబడుచున్నది. ఈ చెప్పిన ప్రకారము మొదట జెప్పబడిన స్వీయ పదమూడువిధములగుచున్నది.

పరకీయాలక్షణం.

శ్లో॥ పరానురాగవ్యాపార గోపనే దత్తమానసా॥ ౩౦ ॥ పరకీయేతి సా ప్రోక్తా భరతాగమవేదిభిః। సా చ కన్యా పరోఢేతి ద్వివిధా పరికీర్తితా॥ ౩౧॥

తా॥ పరపురుషునియందునుగల ఇచ్ఛావ్యాపారములను మఱుగుపఱుచుటయందు దక్షచిత్తురాలైయున్ననాయిక పరకీయయనఁబడును. అది కన్యయనియు, పరోఢయనియు, ఇరువిధంబులుగలిగియుండును. ... *

పరకీయాకన్యాలక్షణం.

శ్లో॥ కన్యాత్వనూఢా యువతిస్సలజ్జా పితృపాలితా।
సఖీకేలిషు విస్రబ్ధా ప్రాయో ముగ్ధగుణాన్వితా॥ ౩౨

తా॥ [illegible]గాను, యౌవనసంపన్నయగాను, సిగ్గుగలదిగాను, తల్లిదండ్రులచే పోషితగాను, చెలులతో విహారములయందు ప్రియురాలుగాను, ప్రియునియందు ముగ్ధగుణముగలదిగానునుండునది పరకీయకన్య॥ ... *

పరకీయాపరోఢాలక్షణం.

శ్లో॥ పరోఢా తు ప్రియేణోఢా త్వన్యస్య సంగమలాలసా।
నిపుణా గృహకృత్యేషు భర్తృచిత్తానువర్తినీ॥ ౩౩

తా॥ ప్రియునిచే పెండ్లియాడఁబడినదిగాను, పెనిమిటిమనస్సునకు సరియైననడతలుగలదిగాను, గృహకృత్యములందు సమర్థురాలుగాను, ఉండియును పరపురుషసంగమమందాసక్తిగలదిగానుండునది పరోఢయనఁబడును. ... ... *

సామాన్యానాయికాలక్షణం.

శ్లో॥ సామాన్యా సైవ గణికా కలాప్రాగల్భ్యధౌర్త్యయుక్। విత్తమాత్రాశయా లోకే పురుషేష్వనురాగిణీ ॥ ౩౪ ॥ ఏతస్యా నానురాగస్స్యాద్గుణవత్యపి నాయకే। భగ్నకామాన్ కృతార్థాంశ్చ బాలపాషండషండకాన్॥ ౩౫॥ రక్తేవ రంజయేన్నిత్యం నిస్స్వాన్నిర్వాసయేత్ ।
తస్యా దౌత్యప్రభృతయో గుణాస్తదుపయోగినః॥ ౩౬ *

తా॥ సంగీతాభినయాద్యనేక విద్యాప్రాగల్భ్యధైర్యములుగలదిగాను, జనులయందు ధనాశచేతనే అనురాగముగలదిగానునుండునది సామాన్య, ఇదే గణిక. ఈనాయికకు నాయకుఁడు గుణవంతుఁడైనను ధనాగమము లేకున్నవానియందు ప్రేమగలుగదు. ధనాగమముగలవారు భగ్నకాములైనను, బాలురైనను, పాషండులైనను, షండులైనను, వారలయందు ప్రేమగలదానివలెనే వారిని సంతోషపఱచును. ఈచెప్పఁబడినవారు కపటము తెలుగనివారుగానునుండవలయును. ధనములేనివానిని తఱుమకొట్టును. దానికి దౌత్యము మొదలైన గుణములు సహాయములని చెప్పఁబడుచున్నవి. *

శ్లో॥ ఏతాష్షోడశ నాయికా హ్యవస్థాభేదతః క్రమాత్।
ప్రత్యేకమష్టధా ప్రోక్తా భావశాస్త్రవిచక్షణైః॥ ౩౭

తా॥ ఈపదునారునాయికలకును శృంగారావస్థాభేదములచే ఒక్కొకతెకు నెనిమిదివిధములుగా భేదములు చెప్పఁబడినవి. ... ... *

శృంగారరసప్రకరణమ్.

అష్టవిధనాయికానిరూప్యంతే.

శ్లో॥ స్వాధీనపతికాచైవ తథా వాసకసజ్జికా। విరహోత్కంఠితా ప్రోక్తా
విప్రలబ్ధా చ ఖండితా॥ ౩౮॥ కలహాంతరితా చైవ తథా ప్రోషితభర్తృకా।
తథాభిసారికాచైవ మష్టధా నాయికా మతాః॥ ౩౯

తా॥ స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక, అని పూర్వము చెప్పఁబడిన నాయికలు ఒక్కొకతెయవస్థాభేదము చేత నైనిమిదివిధములఁ జెప్పఁబడును.

స్వాధీనపతికానాయికాలక్షణం.

శ్లో॥ ప్రియేణలాలితానిత్యం స్వాధీనపతికామతా। అస్యాస్తుచేష్టాః కథి
తాః స్మరపూజోత్సవాదయః॥ ౪౦ ॥ వనకేళీజలక్రీడాకుసుమాపచ
యాదయః॥ ... ...

తా॥ నాయకునిచే నెల్లప్పుడుసంతోషపఱుపఁబడెడిది స్వాధీనపతిక. దీనివ్యాపారము మన్మథపూజామహోత్సవము మొదలయినవియును, వనవిహారము, జలక్రీడ, పుష్పాపచయము, మొదలయినవియును.

వాసకసజ్జికానాయికాలక్షణం.

శ్లో॥ ప్రియాగమనవేళాయాం మండయంతీ ముహుర్ముహుః॥ ౪౧॥ కేళీగృహం
తథాత్మానం సాస్యాద్వాసకసజ్జికా। అస్యాస్తుచేష్టాస్సంపర్కమనో
రథవిచింతనం॥ ౪౨ ॥ సఖీవినోదో నితరాం ముహుర్దూతీనిరీక్షణం।
ప్రియాగమనమార్గాభివీక్షా ప్రభృతయో మతాః॥ ౪౩

తా॥ ప్రియుడువచ్చెడిసమయమందు తానలంకరించుకొని కేళీగృహమునలంకరించి సిద్ధముగానుండునది వాసకసజ్జికానాయిక. దీనివ్యాపారములు నాయకునిసంసర్గమనోభీష్టమును యోచించుట, సఖులతో వినోదముసల్పుట, అడుగడుగునకు దూతికను సాభిప్రాయముగ జూచుట, నాయకుడువచ్చెడిదారిని జూచుట మొదలైనవి.

విరహోత్కంఠితానాయికాలక్షణం.

శ్లో॥ అనాగసిప్రియతమే చిరయత్యుత్సుకాతుయా। విరహోత్కంఠితా
భావవేదిభిః పరికీర్తితా॥ ౪౪ ॥ అస్యాస్తుచేష్టాస్సంతాపో వేపథుశ్చాంగ
సాదనం। అరతిర్బాష్పమోక్షశ్చస్వావస్థాకథనాదయః॥ ౪౫

తా॥ నిరపరాధియగు ప్రియుడురాక జాగుచేయగా కాలవిలంబము నోర్వక యెదురుచూచుచుండు నాయిక విరహోత్కంఠితయనబడును. దీనివ్యాపారములు సంతాపము, వణకుదేహము, చిన్నబోవుట, వ్యాపారాంతరములయందు ప్రీతిలేకయుండుట, కన్నీరువిడుచుట, తనయవస్థను సఖులకు దెలుపుట మొదలైనవి.

విప్రలబ్ధానాయికాలక్షణం.

శ్లో॥ క్వచిత్సంకేతమావేద్య తత్రనాథేనవంచితా। స్మరార్తా విప్రలబ్ధేతికథి

తాడ్యాపకోపితైః॥ ౪౬ ॥ అస్యాస్తుచేష్టానిర్వేదశ్చింతాఖేదోఽథదీనతా।
అశ్రునిశ్వాసమూర్ఛాద్యాః కథితా భావవేదిభిః॥౪౭

తా॥ ఒకానొకచోటినిసంకేతస్థానముగాజెప్పి అక్కడ నాయకునిచేవంచింపబడి అనగా అతడక్కడికి రాకపోగా మన్మథపీడితురాలై యుండునది విప్రలబ్ధయనబడును - దీని వ్యాపారములు నిర్వేదము, చింత, ఖేదము, దీనత, కన్నీరును విడుచుట, నిట్టూర్పులు విడుచుట, మూర్ఛ జెందుట మొదలైనవి.

ఖండితానాయికాలక్షణం.

శ్లో॥ ఉల్లంఘ్య సమయం యస్యాః ప్రేయానన్యోపభోగవాన్। భోగలక్ష్మాంకితః ప్రాతరాగచ్ఛేత్సాహి ఖండితా॥ ౪౮ ॥ అస్యాస్తుచేష్టానిశ్వాసస్తూష్ణీం
భావోఽశ్రుమోచనం। సంతాపభ్రాంతిస్వస్ఫుటాలాపాద్యా క్రియా మతాః.

తా॥ సంకేతసమయమునతిక్రమించి అన్యోపభోగపుగుఱుతులతో ప్రాతఃకాలమందు వచ్చిన నాయకునిగలది ఖండితానాయిక యనబడును. దీని వ్యాపారములు నిట్టూర్పు విడుచుట, పలుకకుండుట, కన్నీరు విడుచుట, ఖేదపడుట, భ్రమించుట, మూలుగుట మొదలయినవి.

కలహాంతరితాలక్షణం.

శ్లో॥ యా సఖీనాం పురః పాదపతితం వల్లభం రుషా। నిరస్య పశ్చాత్తపతి కలహాంతరితా తు సా॥ ౫౦ ॥ అస్యాస్తుచేష్టానిశ్వాసభ్రాంతిసంతాపసాధ్వసే। ముహుఃప్రలాపఇత్యాద్యాశ్చేష్టాః ప్రోక్తా మనీషిభిః॥౫౧

తా॥ సఖులయెదుట చరణపతితుడగు నాయకుని నిరాకరించి పిదప పరితాపపడునది కలహాంతరితయనబడును. దీని వ్యాపారములు నిట్టూర్పు విడుచుట, భ్రమించుట, మనస్తాపపడుట, స్తంభాదిసాధ్వసభావములుగలుగుట, మాటిమాటికి ప్రలపించుట, మొదలైనవి.

ప్రోషితభర్తృకాలక్షణం.

శ్లో॥ దేశాంతరగతే కాంతే ఖిన్నా ప్రోషితభర్తృకా। అస్యాస్తు జాగరః కార్శ్యం నిమిత్తాద్యవలోకనం॥౫౨॥ మాలిన్యమనవస్థానం ప్రాయశ్శయ్యానిషేవణం। జాడ్యచింతాప్రభృతయో విక్రియాః కథితా బుధైః॥౫౩

తా॥ నాయకుడు దేశాంతరమును జెందియున్నప్పుడు ఖేదపడుచుండునది ప్రోషితభర్తృక. దీని వ్యాపారములు నిద్రలేకయుండుట, కృశించుట, ప్రియుడెన్నాళ్లకు వచ్చునని శకునములు చూచుట - మలినయైయుండుట, నిలిచినచోట నిలువకపోవుట, ఎప్పుడు నుపండుకొనియుండుట, [illegible]యుండుట, చింత మొదలైనవి.

అభిసారికానాయికాలక్షణం.

శ్లో॥ మదనానలసంతప్తా యాఽభిసారయతి ప్రియం।
స్వయం నాఽభిసరేద్వా తు సా భవేదభిసారికా॥౫౪
అస్యాస్సంతాపచింతాద్యా విక్రియాస్స్యుర్యథోచితం।

తా॥ మదనానలసంతప్తయై తనస్థలమునకు నాయకుని వచ్చునట్లు చేయుచున్నదిగాని

జుగుప్సాస్థాయిలక్షణం.

శ్లో॥ అహృద్యానాంపదార్థానాం దర్శనశ్రవణాదిభిః॥ ౨౬౪॥ మనస్సంకో
చనంయత్సా జుగుప్సాత్రనిక్రియాః। నాసాపిధానం త్వరితా గతిరా
స్యవికూణనం॥ ౨౬౫॥ సర్వాంగధూననంకుత్సా ముహుర్నిష్ఠీవనాదయః॥

తా॥ అహృద్యవస్తువులను చూచుట వినుట మొదలైనవానిచేగలుగుమనస్సంకో
చముజుగుప్సాస్థాయియనబడును. ముక్కుమూసికొనుట, వేగముగబోవుట, ముఖము
నువంకరచేసికొనుట, సర్వాంగధూననము, అసహ్యపడుట, మాటిమాటికిఉమ్మివేయు
ట, మొదలైనవిగలుగును.

క్రోధస్థాయిలక్షణం.

శ్లో॥ భవేత్ప్రజ్వలనంక్రోధః పురాక్షేపాదిసంభవః॥ ౨౬౬
ఫుల్లనాసాపుటోద్వృత్త తారకాద్యనుభావయుక్ ।
శత్రుభృత్యసుహృత్పూజ్యా శ్చత్వారోవిషయామతాః॥ ౨౬౭

తా॥ పురాక్షేపాదులచేగలుగుమనఃప్రజ్వలనము క్రోధస్థాయియనబడును. ఇది ఫు
ల్లనాసాపుటము, గిరగిరతిరుగునల్లగ్రుడ్లు, మొదలైనఅనుభావములనుగలదై యుండును.
దీనికి శత్రువులు, భృత్యులు, స్నేహితులు, పూజ్యులు, ఈనలుగురువిషయులనబడుదురు.

శత్రువిషయక్రోధోయథా.

శ్లో॥ ముహుర్దష్టోష్ఠతాభంగో భ్రుకుట్యాదంతఘట్టనం।
హస్తనిష్పీడనంగాత్ర ప్రకంపో స్త్రస్యవీక్షణం॥ ౨౬౮
స్వభుజాపేక్షణంకంఠ గర్జాద్యాశ్శత్రవక్రుధి।

తా॥ శత్రువిషయక్రోధమందు అడుగడుగునకుపెదవులుకొఱుకుకొనుట, కనుబొమ
లువంకరయగుట, పండ్లుకొఱుకుట, చేతులనుపిసుకుకొనుట, దేహమువణకుట, అ
స్త్రమునుజూచుట, తనభుజములనుజూచుకొనుట, గర్జించుట, మొదలైనవిగలుగును.

భృత్యవిషయక్రోధోయథా.

శ్లో॥ భృత్యక్రోధేతుచేష్టాస్స్యు ర్నేత్రాంతపతదశ్రుతా॥ ౨౬౯
తూష్ణీంధ్యానంచనైశ్చల్యం శ్వసితానిముహుర్ముహుః।
మౌనంవినమ్రముఖతా భుగ్నదృష్ట్యాదయోమతాః॥ ౨౭౦

తా॥ భృత్యక్రోధమందు కన్నీరుకారుట, ఊరకధ్యానించుట, కదలకయుండుట, అ
డుగడుగునకునిట్టూర్పులువిడుచుట, మాటలాడకయుండుట, తలవంచుకొనుట, భుగ్న
దృష్టి, మొదలైనవిగలుగును.

మిత్రక్రోధోయథా.

శ్లో॥ మిత్రక్రోధేతుచేష్టాస్స్యుః భావగర్భవిభూషణం।
భ్రూభేదస్ఫుటలస్వేద కటాక్షారుణిమాదయః॥ ౨౭౧

తా ॥ మిత్రక్రోధమందు భావగర్భముగ భాషించుట, కనుబొమ్మలు కదపవడుట, నొసట చెమటగలుగుట, కన్నులు ఎఱ్ఱనౌట, మొదలైనవి గలుగును.

పూజ్యక్రోధో యథా.

శ్లో॥ పూజ్యక్రోధే తు చేష్టాస్స్యుస్స్వనిందాఽప్రమత్తతా।
అనుత్తరప్రదానాంగ స్వేదగద్గదతాదయః॥ ౨౭౨

తా॥ పూజ్యక్రోధమందు తన్ను తాను నిందించుకొనుట, తలవంచుకొనుట, ప్రత్యుత్తరము చెప్పకుండుట, దేహమున చెమటగలుగుట, కంఠగద్గదము మొదలైనవి గలుగును.

శ్లో॥ భృత్యాదికోపత్రితయే తత్తత్ప్రోదితాః క్రియాః। మిథః స్త్రీపుంసయో రేవ రోష స్త్రీస్సగోచరః పునః ॥ ౨౭౩ ॥ ప్రత్యయావధిరత్రైష్యః వికారాః కుటిలేక్షణం। అధరస్ఫురణాపాంగ రాగనిశ్వసితాదయః ॥ ౨౭౪

తా ॥ భృత్యాదిక్రోధత్రితయమందును దానిదానికి జెప్పబడిన క్రియలు దానిదానికి కలుగును. మిత్రక్రోధాంతర్గతమైన స్త్రీపురుషుల కోపములయందు స్త్రీమీది పురుషకోపము ప్రత్యయము గలుగునంతవఱకునుండును. ఇందు వంకరచూపు, పెదవులదరుట, కడగన్నులెఱ్ఱనౌట, నిశ్వాసములు మొదలైనవి గలుగును.

శ్లో॥ ద్వేధా నిగదిత స్త్రీణాం రోషః పురుషగోచరః। సపత్నీరోషహేతుస్స్యా దన్యస్స్యాదన్యహేతుకః॥ ౨౭౫॥ సపత్నీహేతుకో రోషః విప్రలంభే ప్రపంచ్యతే। అన్యహేతుకృతే త్వత్ర క్రియాః పురుషరోషవత్ ॥ ౨౭౬

తా ॥ పురుషవిషయమైన స్త్రీకోపము సపత్నీహేతుకమనియు, అన్యహేతుకమనియు, ఇరుదెఱగులౌను. సపత్నీహేతుకమైన రోషము విప్రలంభమందు జెప్పబడుచున్నది. అన్యహేతుకృతరోషమందు పురుషరోషమువంటి క్రియలు గలుగును.

శ్లో॥ ఏతే చ స్థాయినస్సర్వే విభావై ర్వ్యభిచారిభిః। సాత్వికై రనుభావైశ్చ నటాభినయగోచరాః ॥ ౨౭౭ ॥ సాక్షాత్కారమివానీతాః ప్రాపితాస్స్వాదురూపతాం। సామాజికానాం మనసి ప్రయాంతి రసరూపతాం॥ ౨౭౮

తా॥ విభావ వ్యభిచారిభావ సాత్వికానుభావ వ్యాపారరూపానుభావములచే సాక్షాత్కారమును బొందింపబడినట్లు అభినయగోచరములై స్థాయిభావములు స్వాదురూపతను బొందింపబడి సామాజికులమనసున రసత్వమును బొందుచున్నవి.

శ్లో॥ దధ్యాదివ్యంజనైశ్చించా మరీచ్యాదిభి రౌషధైః। గుడాదిమధురద్రవ్యై ర్యథాయోగ్యం సమన్వితైః॥ ౨౭౯ ॥ యథా పాకవిశేషైశ్చ నిష్పాద్యో రసషాడనః। నిష్పాద్యతే విభావాద్యైః ప్రయోగేణ తథా రసః॥ ౨౮౦
స్వాదయమానందసంభేదో భావస్థైరనుభూయతే। ...

తా॥ యథాయోగ్యముగ గూడిన పెరుగు మొదలైన వ్యంజనములచేతను, చింతపండు మిర్యాలు మొదలయిన యౌషధములచేతను, బెల్లము మొదలయిన మధురపదార్థములచే

తం విభజతే.

శ్లో॥ విప్రలంభశ్చ సంభోగ ఇతి స ద్వివిధో భవేత్ ॥

తా॥ ఆశృంగారరసము విప్రలంభశృంగారమని, సంభోగశృంగారమని రెండువిధములౌను.

విప్రలంభం లక్షయతి.

శ్లో॥ అప్రాప్తిర్విప్రలంభస్స్యాద్యూనో ర్జాతాభిలాషయోః ॥ ౨౮౦ ॥ తాం
డిమ గ్లానిదృష్ట్యాద్యా అనుభావా ఇహ స్మృతాః । హర్షగర్వజుగు
ప్సోగ్ర్యమదహాసశమైర్వినా ॥ ౨౮౧ ॥ అన్యే సంచారిణస్సర్వే
భవంత్యత్ర యథోచితం ॥ ... ... *

తా॥ అత్యంతాసక్తిగల నాయికానాయకులకు పరస్పరము చేరికలేకయుండుట విప్రలంభమనబడును. ఇందు విరహతాండిమయు, స్రోలినచూపు మొదలైనవి గలుగును. హర్షము, గర్వము, జుగుప్స, ఉగ్రభావము, మదము, హాసము, శమము, ఇవి వినా కడమ సంచారిభావములన్నియును ప్రకృతానుగుణముగ గలుగును. ... *

విప్రలంభం విభజతే.

శ్లో॥ అయోగో విరహో మానః ప్రవాసశ్శాప ఇత్యపి ॥ ౨౮౨
విప్రలంభస్య పంచైతే హేతవః పరికీర్తితాః ॥

తా॥ అయోగము, విరహము, మానము, ప్రవాసము, శాపము అని విప్రలంభమునకు అయిదు హేతువులుగలవు. ... ... ... *

అయోగవిప్రలంభశృంగారలక్షణం.

శ్లో॥ ప్రాగసంగతయోర్యూనో రనురాగేఽపి జాగ్రతి ॥ ౨౮౩ ॥ అయోగః
పారతంత్ర్యాద్యైర్విప్రలంభోఽభిలాషజః। ప్రవేశనిర్గమావీక్షింతద్దృష్టి
పథగామితా ॥ ౨౮౪ ॥ తాగ్ప్రకాశనపరా శ్చేష్టాస్స్వాఙ్గ ప్రకాశనం।
వ్యాజోక్తయశ్చ విజనే స్థితిరిత్యాదయోఽపి చ ॥ ౨౮౫ ॥ తత్ర సంచారి
ణో గ్లానిశంకాసూయాశ్రమో భయం।నిర్వేదౌత్సుక్యదైన్యాని చింతా
నిద్రా ప్రబుద్ధతా ॥ ౨౮౬ ॥ విషాదజడతోన్మాదా మోహో మరణమే
వ చ । తత్తత్సంచారిభావానాముచితాపి దశా భవేత్ ॥ ౨౮౭ ॥ క్రమే
ణ ప్రాప్తనైరస్య దశావస్థాస్సమాసతః । ప్రోక్తాస్తదనుసారేణ భరతేన
మహాత్మనా ॥ ౨౮౮ ॥ ... ... *

తా ॥ అతిప్రేమగల నాయికానాయకులకు ప్రథమసమాగమమునకు మును పుగలవిప్రలంభము అయోగవిప్రలంభమనబడును. ఇందు నాయకుని జూచి యింటిలోపలబోవుట, బయటవచ్చుట, ఊరక అతనిచూపునకగపడుట, తనఆసను బయలుపఱచు చేష్టలు, తనదేహమును ప్రకాశపఱచుట, వ్యాజోక్తులు, విజనస్థలమందుండుట మొదలైనవిగలవు- గ్లానియు, శంకయు, అసూయయు, శ్రమము, భయము, నిర్వేదము, ఔత్సుక్యము, దైన్యము, చింత, నిద్ర, ప్రబోధము, విషాదము, జాడ్యము, ఉన్మాద

ము, మోహము, మరణము, ఈవ్యభిచారిభావములకుయథోచితముగప్రవేశముగలదు. శృంగారమునకు దశావస్థలుగలవని ప్రాచీనులమతమును ననుసరించి భరతు నిచేదనుం జెప్పబడినది. ... ... ... *

దశావస్థానిరూపయతి.

శ్లో॥ చక్షుఃప్రీతిశ్చింతా సంకల్పో గుణనుతిః క్రియాద్వేషః।
తాపోలజ్జాత్యాగో న్మాదౌ మూర్ఛామృతిర్దశావస్థాః॥౨౯౯

తా॥ చక్షుఃప్రీతి, చింత, సంకల్పము, గుణనుతి, క్రియాద్వేషము, తాపము, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి అనునవి పదియవస్థలు. ... *

చక్షుఃప్రీతిలక్షణం- ౧టిది.

శ్లో॥ చక్షుఃప్రీతిస్స్యాత్ప్రహరమ్యా దృష్టేవాలంబనే శ్రుతే ।
కౌతుకస్వేదరోమాంచ హర్షవిస్మయసాధ్వసైః॥ ౩౦౦
చాపలస్తంభలజ్జాద్యై రనుభావ్యోభవేదయం ॥

తా॥ రమ్యమైన ఆలంబనము వినబడినదిగాని, చూడబడినదిగాని కాగాదాని యందుగలిగినఇచ్ఛ చక్షుఃప్రీతియనబడును. ఇది సంతోషము, పులకరింపు, హర్షము, సాధ్వసము, చాపలము, స్తంభము, సిగ్గు మొదలైనవానిచేతభావింపదగినది. *

చింతాలక్షణం- ౨వది.

శ్లో॥ కేనోపాయేన సంసిధ్యే త్కదా తేన సమాగమః॥ ౩౦౧॥ దూతీముఖేన కింవాచ్య మిత్యాద్యూహావిచింతనం।అత్రానుభావానిశ్వాసధ్యానస్రస్తాంగతాదయః ॥ ౩౦౨ ॥ వలయాదిపరామర్శ స్స్వేదాంబుపుళకాదయః। శయ్యాసనాదివిద్వేష ఇత్యాద్యాస్స్మరకల్పితాః॥ ౩౦౩॥ నిర్లక్ష్యవీక్షణంచైవ మాద్యాస్స్యుర్విక్రియామతాః ॥ *

తా॥ కోరిక ఏయుపాయముచేత ఈడేరును అతనితోడఎప్పుడుకూడికకలుగును చెలులతోఏమిచెప్పివంపవచ్చును అని ఊహించుటచింతయనబడును. ఇందునిట్టూర్పు, ధ్యానము, దేహముసోలుట, హస్తాభరణాదులను చేతితోతడవుట, చెమట, పులకరింపు, శయ్యాసనాదులయందు విద్వేషము, నిర్లక్ష్యవీక్షణము మొదలైనవిగలుగును.

సంకల్పావస్థాలక్షణం- ౩వది.

శ్లో॥ మనోరథస్స్యాత్సంకల్ప స్తత్సమాగమగోచరః॥ ౩౦౪
ఔత్సుక్యస్వేదరోమాంచ స్మృతిశ్వాసాక్షిమీలనైః।
బాహ్యార్థస్యాపరిజ్ఞానే నానుభావ్యోభవేదసౌ ॥ ౩౦౫

తా॥ నాయకసమాగమగోచరమైనమనోరథము సంకల్పమనబడును. ఈయవస్థయందు ఔత్సుక్యము, స్వేదము, రోమాంచము, స్మరణము, శ్వాసము, కన్నులు మూసికొనుట, బాహ్యవ్యాపారము తెలియకయుండుట, మొదలైనవిగలుగును. *

గుణసంకీర్తిలక్షణం- ౪వది.

శ్లో॥ భవేద్గుణసంకీర్తిస్తస్య రూపాదిపరికీర్తనం ॥౩౦౬॥ రోమాంచోగద్గదా
వాణీ భావావరణవీక్షణం।తత్సంగచింతనంసఖ్యా గండస్వేదాదయోఽపి
చ ॥౩౦౭॥ఔత్సుక్యహర్షస్మృత్యాద్యా అనుభావాఇహస్మృతాః॥*

తా॥ నాయకుని రూపము మొదలైనగుణములను బొగడుట గుణసంకీర్తనమనబడును. ఇందు రోమాంచము, డగ్గుత్తుకగలపలుకులు, సాభిప్రాయముగ జూచుట, చెలికత్తెలతో అతనిసంగమమునుగుఱించియోచించుట, కపోలములయందుచెమట, ఉత్సాహము, హర్షము, స్మరించుట మొదలైనవిగలుగును. ... ... *

క్రియాద్వేషలక్షణం- ౫వది.

శ్లో॥ క్రియాద్వేషస్తతోన్యత్ర విద్వేషోభోజ్యవస్తుని ॥౩౦౮
చింతానిశ్వాసదైన్యాశ్రు కళాజాగరపాండుతాః।
విషాదోగ్లానిరిత్యాద్యా అనుభావాస్తదుద్భవాః॥౩౦౯

తా॥ నాయకునితప్ప ఇతరములైన భోజ్యవస్తువులయందుగలుగుద్వేషము క్రియాద్వేషమనబడును. ఇందు చింత, నిశ్వాసము, దైన్యము, కన్నీరువిడుచుట, నిదురలేకయుండుట, వెలవెలపోవుట, విషాదము, సోలుట మొదలైనవిగలుగును. ... *

తాపలక్షణం- ౬వది

శ్లో॥ తత్ప్రాప్తేర్విప్రకర్షేణ తాపస్స్యాత్కామజోజ్వరః।
వైవర్ణ్యమశ్రువైస్వర్యం శయనేపరివర్తనం॥౩౧౦
నిశ్వాసముఖశోషాద్యా అనుభావాస్తదుద్భవాః।

తా॥ ప్రియునిరాకయొక్క విలంబమునగలుగుకామజ్వరము తాపావస్థయనబడును. ఇందు వైవర్ణ్యము, కన్నీరు, స్వరభంగము, పడకలోపొరలుట, నిట్టూర్పు, ముఖము వాడుట, మొదలైనవిగలుగును. ... ... ... *

లజ్జాత్యాగలక్షణం- ౭వది.

శ్లో॥లజ్జాత్యాగస్త్రపాహాని రౌత్సుక్యాదిసముద్భవా॥౩౧౧
ఉల్లంఘనంభవేద్వాచాం గౌరవాగణనంతథా।
విషాదోవ్యగ్రతాదైన్య మిత్యాద్యైరనుభావ్యతే॥౩౧౨

తా॥ ఔత్సుక్యము మొదలైనవానిచేత సిగ్గునుమానుట లజ్జాత్యాగమనబడును. ఇది ఆజ్ఞనుమీఱుట, గౌరవమునుతలపకుండుట, విషాదము, వ్యగ్రత, దైన్యము మొదలైనవిగలుగును. ... ... ... ... *

ఉన్మాదలక్షణం- ౮వది.

శ్లో॥సర్వావస్థాసుసర్వత్ర తన్మనస్కతయాసదా।అతస్మింస్తదితిభ్రాంతి
రున్మాదోవిరహోద్భవః॥౩౧౩॥తత్రచేష్టాస్తువిజ్ఞేయాద్వేషస్సేష్టే
పివస్తుని।దీర్ఘోముహుశ్చనిశ్వాసోనిర్నిమేషతయాస్థితిః॥౩౧౪॥అనిమిత్త

స్మితధ్యాన గానమోహపరోపిచ। అకాండగమనోత్థానశంకాద్యా అపి విక్రియాః॥౩౧౫॥ విషాదమదరోషాద్యా అనుభావా ఇహస్మృతాః॥

తా॥ ఎప్పుడును సర్వావస్థలయందును నాయకునియందు దత్తచిత్తురాలై యుండుటచేత ఒకవస్తువునకుమఱియొకవస్తువుగాతోచుట విరహమువలనగలిగినచో ఉన్మాదమనబడును. ఇందు తనయిష్టవస్తువునందుగూడ ద్వేషము, నిట్టూర్పు, ఱెప్పపాటులేమి, హేతువులేకనవ్వుట, ధ్యానించుట, పాడుట, మూర్ఛపోవుట, నిమిత్తములేకనడచుట, లేచుట, శంకమొదలైనవి, విషాదము, మదము, రోషము ఈయనుభావములుగలుగును.

మూర్ఛాలక్షణం - ౯ వది.

శ్లో. తాపోత్కర్షేణ సంతప్తప్రాప్త్యా మూర్ఛాజ్ఞానక్షయోమతః॥౩౧౬॥ ఇదమిష్టమనిష్టంత దితివెత్తినకించన। నోత్తరంభాషతేప్రశ్నే నేక్షతేన శృణోతిచ॥ ౩౧౭ ॥ క్రమేణమందావుచ్ఛ్వాస నిశ్వాసోనష్టచేష్టతా। స్పర్శానభిజ్ఞతేత్యాద్యా భవంత్యత్రానుభావకాః॥౩౧౮

తా॥ నాయకుడురానందున అధికతాపముచేత జ్ఞానముక్షయించుటమూర్ఛయనబడును. ఇందు ఇష్టమునుఅనిష్టమునుదెలియకుండుట, పిలిచినను పలుకకుండుట, చూపులేకుండుట, చెవివినకుండుట, క్రమముగాఉచ్ఛ్వాసనిశ్వాసములు మందములగుట, చేష్టలులేకయుండుట, అంటినదెలియకుండుట ఇవిమొదలైనయనుభావములుగలుగును.

మృతిలక్షణం-౧౦ వది.

శ్లో॥ స్మరోత్థామరణేచ్ఛాచే స్మృతిరిత్యభిధీయతే। లీలాశుకవినోదాది న్యాసస్సఖీకరే॥౩౧౯॥ కలకంఠకలాలాప శ్రుతిర్మందానిలాశ్రయః। జ్యోత్స్నాప్రవేశమాకంద మంజరీప్రేక్షణాదయః॥ ౩౨౦॥ ఉద్బంధనాదిసంనాహ స్సాస్రదృష్ట్యాదయస్త్విహ॥

తా॥ మన్మథవ్యాపారముచేగలుగుమరణేచ్ఛమృతియనబడును. ఇందు విలాసపుచిలుకతోడియాటమొదలయినవానినిసఖులచేతఒప్పగించుట, కోవెలలముద్దుపలుకులను వినుట, మందమారుతమునుఆశ్రయించుట, వెన్నెలలోనికిబోవుట, మామిడిపూగుత్తులనుజూచుట, ఉరిమొదలైనవానినిసిద్ధపఱుచుకొనుట, కన్నీటితోడిచూపుమొదలయినవిగలుగును.

విరహవిప్రలంభలక్షణం.

శ్లో॥ కాలక్షేపస్తుసంప్రాప్తైః కార్యాద్వాపారతంత్ర్యతః॥౩౨౧
ఏకగ్రామస్థయోర్యూనో ర్విరహస్స్యాభిధీయతే।
ఔత్సుక్యచింతానిశ్వాస వితర్కాద్యనుభావభాక్॥౩౨౨

తా॥ ఒకేయూరిలోవుండెడినాయికానాయకులకు ప్రీతిసిద్ధమైయుండగకార్యవశమువలనగాని పరాధీనతవలనగాని కలియుటకుకాలహరణముకలిగెనా అదివిరహవిప్రలంభశృంగారమనబడును. ఇందు ఉత్సాహము, చింత, నిట్టూర్పు, వితర్కముమొదలయినవిగలుగును.

మానవిప్రలంభలక్షణం.

శ్లో॥ ఈక్షణాలింగనాదీనాం నిరోధో మాన ఉచ్యతే ।
ప్రణయేర్ష్యాప్రభేదేన ద్వివిధస్సోఽభిధీయతే॥ ౩౨౩

తా ॥ చూచుట ఆలింగనము మొదలైన వ్యాపారములను నిరోధించియుండుట మాన మనబడును. ఆమానము ప్రణయమానమనియు, ఈర్ష్యామానమనియు ఇరువెలుగులౌను.

ప్రణయమానలక్షణం-ఇటిది.

శ్లో॥ తత్ర ప్రణయమానస్స్యా దాజ్ఞాలంఘనతో మిథః।
అభాషణంచ వైముఖ్య మిత్యాద్యైరనుభావ్యతే॥ ౩౨౪

వానిలో నాయికానాయకులకు పరస్పరము ఆజ్ఞాలంఘనముచే గలుగునది ప్రణయమానము. ఇందు మాటలాడకయుండుట, ముఖముత్రిప్పుకొనియుండుట మొదలైనవి కలుగును.

ఈర్ష్యామానలక్షణం.

శ్లో॥ ఈర్ష్యామానస్తు యః కోపః ప్రియే జ్ఞాతాన్యసంగమే । అభాషణముపాలంభో భర్త్సనం తాడనం తథా॥ ౩౨౫॥ వైముఖ్యం పాదసంమర్ద ఇత్యాద్యై రనుభావ్యతే । తజ్జ్ఞానం శ్రవణాద్దృష్టి రనుమానాచ్చ వా భవేత్ ॥ ౩౨౬

తా॥ అన్యస్త్రీసంభోగము నెఱుగుటచే ప్రియునియందు గలుగు కోపము ఈర్ష్యామానమనబడును. ఇది అభాషణము, ఉపాలంభము, బెదిరించుట, కొట్టుట, వైముఖ్యము, కన్నీరు, ఓర్వమి, ఇవి మొదలైనవానిచే నెఱుగదగినది. దీని నెఱుగుట వినికి, చూచుట, అనుమానము ఈమూటిలో దేనివలననైన నగును. ... ... *

శ్రవణాదీని నిరూపయతి.

శ్లో॥ శ్రవణం దూతికాదిభ్యో దృష్టిస్స్యాత్తద్విలోకనం।
అనుమానం స్వప్నగోత్రస్ఖలనాదిభిరుచ్యతే॥ ౩౨౭

తా॥ శ్రవణమనునది దూతిక మొదలయినవారివలన వినుట, దృష్టియనునది ఎదురుగ జూచుట, అనుమానమనునది స్వప్నమందు పేరు మార్చి పిలుచుట మొదలయినవానిచేత నగలుగునని చెప్పబడుచున్నది. ... ... ...

ప్రవాసవిప్రలంభలక్షణం.

శ్లో॥ దేశాంతరస్థితిర్యాతు ప్రవాసస్సోఽభిధీయతే ।
కార్శ్యపాండిమనిశ్వాస చింతాదైన్యాశ్రుగద్గదాః॥ ౩౨౮
లంబాళకత్వమిత్యాద్యా అనుభావాస్సమీరితాః॥

తా॥ నాయికానాయకుల దేశాంతరస్థితి ప్రవాసవిప్రలంభమనబడును. ఇందు చిక్కిపోవుట, తెల్లనౌట, నిట్టూర్పు, చింత, దైన్యము, కన్నీరు, లంబాళకత్వము మొదలయిన యనుభావములుగలుగును. ... ... *

శాపవిప్రలంభలక్షణం.

శ్లో॥ శాపస్తు జాడ్యజాచ్ఛాపాత్ స్సమాసే వా భవస్సన్నిధౌ॥ ౩౨౯॥ చింతాసం

తాపనిశ్వాస పాండిమాద్యనుభావభాక్। అయోగవిప్రలంభోక్తాదశావస్థా యథోచితం ॥ ౩౩౦ ॥ అన్యేష్వవిప్రలంభేషు భవేయురితికీర్తితాః॥

తా ॥ దూరములోనుండినసమీపములోనుండినజాడ్యముచేగలుగుకోపముశాపవిప్రలంభమనబడును. ఇందు చింత,సంతాపము, నిశ్వాసము, పాండిమము మొదలయినఅనుభావములుగలుగును. అయోగవిప్రలంభమందు జెప్పబడినదశావస్థలు తదితరవిప్రలంభములయందునుయథోచితముగగలుగునని చెప్పబడియున్నది. ... *

సంభోగశృంగారలక్షణం.

శ్లో॥ అనుకూలౌనిషేవేతే యత్రాన్యోన్యంవిలాసినౌ॥ ౩౩౧॥ దర్శనస్పర్శనాదీని ససంభోగఉదాహృతః। స్మితభ్రూలలితాదృష్టిః లలితంమధురం వచః॥ ౩౩౨॥ స్తంభాద్యాస్సాత్వికాస్సర్వే చేష్టాలీలాదయోపిచ । ప్రసన్నముఖరాగశ్చ ఇత్యాద్యాఅనుభావకాః ॥ ౩౩౩॥ జుగుప్సాశ్రమనిర్వేద వ్యాధ్యున్మాదామదోమృతిః । విషాదోమర్ష ఆలస్య మపస్మారోత్రవర్జితాః॥ ౩౩౪॥ ద్వివిధస్సతుసంక్షిప్త స్సంపన్నశ్చేతికథ్యతే। యువానౌయత్రసంక్షిప్తాన్ సాత్వికవ్రీడితాదిభిః॥ ౩౩౫॥ ఉపచారాన్నిషేవేతే ససంక్షిప్తఇతీరితః। ప్రోషితాగతయోర్యూనో ర్భోగస్సంపన్నఈరితః॥ ౩౩౬ ... ... *

తా॥ పరస్పరానుకూల్యమువిలాసముంగలవారై నాయికానాయకులుదర్శనస్పర్శనాదులనుబొందునదిసంభోగశృంగారమనబడును. అందు వికసించినకనుబొమలచేతనందమయినచూపు లలితముమధురమునైనపలుకు స్తంభాదిసాత్వికభావములన్నియు లీలాదిచేష్టలు ప్రసన్నమైనముఖకాంతియు మొదలైనవిదీనికి అనుభావములు. జుగుప్స, శ్రమము, నిర్వేదము,వ్యాధి, ఉన్మాదము,మదము,మృతి, విషాదము, అమర్షము,ఆలస్యము,అపస్మారము, వీనినివర్జించితదితరసంచారిభావములుగలుగును. ఈసంభోగశృంగారము సంక్షిప్తమనియు, సంపన్నమనియు ఇరుదెఱగులౌను. యౌవనవంతులైనస్త్రీపురుషులుసాత్వికోదయము సిగ్గు మొదలగువానిచేత సంక్షిప్తములయిన యుపచారములనుపొందినదిసంక్షిప్తమనబడును. ఎడబాసియుండికూడినవారిసంభోగముసంపన్నమనబడును.

వీరరసలక్షణం.

శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్వికైర్వ్యభిచారిభిః। నీతస్సదస్యరస్యత్వ ముత్సాహోవీరఉచ్యతే॥ ౩౩౭॥ యద్వాలంబనతస్తత్ర గుణదానాదిదీపితః। ప్రసన్నముఖరాగాద్యై రనుభావ్యోభవేదయం॥ ౩౩౮॥ ధైర్యస్మృత్యాదిభిశ్చింతాహర్షాద్యైః పోష్యతేసహకారిభిః। యుద్ధవీరోదయావీరో దానవీరశ్చసత్రిధా॥ ౩౩౯ ... ... *

తా॥ విభావానుభావసాత్వికవ్యభిచారిభావములచేసదస్యరస్యత్వమునుపొందింపబడినదై ఆలంబనగుణదానాదులచే ఉద్దీపితమైనఉత్సాహస్థాయివీరరసమౌచున్నది. అది

ప్రసన్నమైనముఖకాంతి మొదలయినవానిచే భావింపదగినది. ఔత్సుక్యము, చింత, హర్షము మొదలయిన సహకారులచే పోషింపబడును. ఆవీరరసము యుద్ధవీర దానవీర దయావీర రసములని మూడగులౌను. ... ... *

యుద్ధవీరరసలక్షణం.

శ్లో॥ సహాయాన్వేషణం యుద్ధే సమరోచితపాటవం।
భీతాభయప్రదానాద్యా అనుభావాః ప్రకీర్తితాః॥ ౩౪౦
యుద్ధవీరే హర్షగర్వామర్షాద్యా వ్యభిచారిణః।

తా॥ యుద్ధవీరరసమందు యుద్ధమున సహాయమును వెతకుట యుద్ధమునకుచితమైన పటుత్వము భయపడినవారలకు అభయమిచ్చుట మొదలయిన అనుభావములును, హర్షము గర్వము అమర్షము మొదలయిన వ్యభిచారిభావములును గలవు. *

దయావీరరసలక్షణం.

శ్లో॥ స్వార్థప్రాణవ్యయేనాపి ప్రపన్నత్రాణశీలతా॥ ౩౪౧
ఆశ్వాసనోక్తయస్థైర్యమిత్యాద్యా విక్రియామతాః॥
దయావీరే మతిధృతి ప్రముఖావ్యభిచారిణః॥ ౩౪౨

తా॥ దయావీరరసమందు తన అర్థము ప్రాణము పోగొట్టుకొనినైనను తన్ను శరణు జొచ్చినవారలను రక్షించెడి స్వభావము ఊఱటపలుకులు స్థిరత్వము ఇవి మొదలయిన యనుభావములును, మతి ధృతి మొదలైన వ్యభిచారిభావములును గలవు. *

దానవీరరసలక్షణం.

శ్లో॥ స్మితపూర్వాభిభాషిత్వం స్మితపూర్వం చ వీక్షణం। ప్రసాదాద్బహుదాతృత్వం తద్వాచామనుమోదనం॥ ౩౪౩॥ గుణాగుణవిచారాద్యా అనుభావాస్సమీరితాః। దానవీరే ధృతిర్హర్ష ఇత్యాద్యా వ్యభిచారిణః॥ ౩౪౪

తా॥ దానవీరరసమందు మందస్మితపూర్వకమైన పలుకు స్మితపూర్వకమయిన చూపు దయచేసి విశేషముగ ఇచ్చుట వారిపలుకులను అనుమోదించుట గుణాగుణవిచారము మొదలైన అనుభావములును, ధృతియు హర్షము ఇవి మొదలైన వ్యభిచారిభావములును గలవు.

కరుణరసలక్షణం.

శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః। పదస్వాస్వాద్యతాం నీతః శోకః కరుణ ఈరితః॥ ౩౪౫॥ ధర్మనాశోర్థనాశశ్చ బాంధవేష్టజనక్షయః। వధోబంధౌ చ దారిద్ర్యం పదభ్రంశః పరాజయః॥ ౩౪౬॥ దైవోపహతిధిక్కారౌ వ్యాధిశ్శాపోపశంసనం। ఇత్యాద్యాలంబనం దృష్టమనుభూతం శ్రుతం చ వా॥ ౩౪౭॥ యస్య చోద్దీపనం జ్ఞేయం ఆలంబనగుణాశ్రయం। కేశవాసోంగసంస్కారవైధుర్యం స్రస్తగాత్రతా॥ ౩౪౮॥ రక్తాభో ముఖరాగశ్చ సబాష్పామంథరా చ దృక్। భూపాతో ౩౪౯॥ ముఖవైవర్ణ్యం బాహుపాతో వికర్షణం॥ ౩౫౦॥ విన్యాసోహస్తయో

ర్భూస్థిరేఖా నిశ్వాసో ధ్యానదీర్ఘతా । ఉరస్తాడో ముఖస్యాపి శోషణం లుం
ఠనం భువి॥ ౩౫౦॥ హాహాకారస్తథాక్రందో విలాపః పరిదేవనం । నానా
స్తంభాదయస్సర్వే భవేయురనుభావకాః॥ ౩౫౧॥ నిర్వేదో దైన్యమా
లస్యం ఉన్మాదవ్యాధిసుప్తయః । నిద్రా మోహశ్రమౌ గ్లాని శ్చింతా
స్మృతిరపస్మృతిః॥ ౩౫౨॥ విషాదో జాడ్యమౌత్సుక్యం శంకామరణమేవ
చ। విశేషం చారిణః ప్రోక్తాః కరుణేమునిసత్తమాః॥ ౩౫౩॥ ఉత్తమాధ
మమధ్యేషు యథాయోగం భవంత్యమీ॥ ... ✻

తా॥ విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములచే సజ్జనులకు అనుభవాస్వాద్యమును
పొందింపబడిన శోకస్థాయి కరుణరసమనబడును. ఇందు ధర్మనాశము, అర్థనాశము, ఇ
ష్టజనహాని బంధుజనవియోగము, వధము, తూకువేయుట, దారిద్ర్యము, పదభ్రంశము, అ
వమానము, దైవోపహతి, ధిక్కారము, వ్యాధియు, శాపము నసజెప్పుట, ఇవి మొదలయి
నవి చూడబడినను అనుభవింపబడినను వినబడినను ఆలంబనవిభావములగును. ఉద్దీపన
విభావములు నశించినవానిసాశ్రయించియుండును. వెంట్రుకలు వస్త్రము దేహము ఇవి వి
కారమును బొందుట దేహము నేలిరియుండుట ఎర్రనిముఖకాంతి కన్నీరుగలచూపు ఈ
ఉద్దీపనములు. నేలబడుట ముఖవైవర్ణ్యము చేతులు వ్రేలవేయుట అవికత్థనము చేతు
లను తలలో కొట్టుకొనుట నిట్టూర్పులిడుట రొమ్ము-తల-ముఖము-వీనిని కొట్టుకొనుట నే
లలో పొరలుట హాహాకారము రోదనము విలాపము పరిదేవనము ఈఅనుభావములును,
స్తంభప్రళయాదిసాత్త్వికభావములును, నిర్వేదము దైన్యము ఆలస్యము ఉన్మాదము
వ్యాధి సుప్తి నిద్ర మోహము శ్రమము గ్లాని చింత స్మృతి అపస్మారము విషాదము
జాడ్యము ఔత్సుక్యము శంక మరణము ఈవ్యభిచారిభావములును,గలవు. ఈభావములు
ఉత్తమమధ్యమాధమపురుషులయందు యథోచితముగ గలుగును. ✻

అద్భుతరసలక్షణం.

శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః॥ ౩౫౪॥ ప్రాప్తస్సదస్యా
స్వాద్యత్వం విస్మయోద్భుతతాం వ్రజేత్ । దుష్ప్రాప్యవస్తునః ప్రాప్తిః క
ర్మచాప్యతిమానుషం॥ ౩౫౫॥ మరీచివిమానగంధర్వనగరాద్యవలోకనం।
మాయేంద్రజాలనృత్తాది యస్యచాలంబనంమతం॥ ౩౫౬॥ ప్రసన్నము
ఖరాగోక్షి విస్తారోనిర్నిమేషతా । శిరఃకపోలచలనం సాత్త్వికాశ్చాను
భావకాః॥ ౩౫౭ ॥ వితర్కచాపలావేగ హర్షాద్యావ్యభిచారిణః ॥

తా॥ విభావానుభావసాత్త్వికభావవ్యభిచారిభావములచే సభవారికి ఆస్వాద్యత్వమును
బొందియుండు విస్మయస్థాయి అద్భుతరసమౌను. ఈఅద్భుతరసమునకు దుష్ప్రాప్య
మైనవస్తువులప్రాప్తి, మనుష్యులకు అశక్యమైనపనులను జేయుట, కాంతిచే నిర్ణయింపద
గినగంధర్వనగరాదుల జూచుట, మాయ, ఇంద్రజాలవిద్య, నృత్యము మొదలయినవి ఆ
లంబనములు. అందు ప్రసన్నమైనముఖరాగము నేత్రవిస్తారము రెప్పపాటులేకయుం

ఘట్టు, తల కపోలప్రదేశము వీనినికదలించుట ఈఅనుభావములును. స్తంభాదిసాత్త్వికానుభావములును, వితర్కము, చాపలము, ఆవేగము, హర్షము, మొదలయినవ్యభిచారిభావములునుగలవు. ... ... ... *

## హాస్యరసలక్షణం.

శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః॥ ౩౫౮॥ నీతస్స్వదస్యరస్యత్వంహాసోహాస్యఇతీరితః । అసౌవిదూషకోన్మత్త మత్తాద్యాలంబనాశ్రయః॥ ౩౫౯॥ మల్లయుద్ధాహూతకమఱ నిర్లజ్జత్వాదితద్గుణైః । మృగపక్షిమనుష్యాణాం స్వరస్థానుకరణైస్తథా ॥ ౩౬౦ ॥ వేదశాస్త్రకలావిద్యాదేశభాషాదికస్యచ । విడంబనైరసంబద్ధాసత్ప్రలాపైశ్చదూషణైః ॥ ౩౬౧॥ పరక్రియానుకరణ వాగాద్యైరపిచేష్టితైః। లటకైస్తత్ప్రహాసైస్తైస్స్వయ్యగుద్దీపితస్తతః॥ ౩౬౨ ॥ ఓష్ఠనాసాకపోలాస్య స్పందనైర్దంతనిర్గమైః॥ అనుమోదసముద్భూతైస్సాధ్వసాధ్వితిభాషితైః॥ ౩౬౩॥ స్తంభప్రళయవర్జైశ్చ సాత్త్వికైరనుభావితః । ఔత్సుక్యచాపలవ్రీడా హర్షస్మృతిమదశ్రమైః॥ ౩౬౪॥ మతిగర్వావబోధైశ్చ విస్మయేనచసంస్మృతః । సోయంస్మితాదిభేదేన షడ్విధఃపరికథ్యతే॥ ౩౬౫ *

తా ॥ విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములచే సదస్వాద్యత్వమును బొందింపబడినహాసస్థాయి హాస్యరసమనబడును. ఈరసము వికటకవులు ఉన్మత్తులు మదించినవారు మొదలయినవారలనుఆశ్రయించినదై మల్లయుద్ధము ఆహూతముచేయుట నిగ్గుమాలుట మొదలయినవానిగుణములచేతను మృగపక్షి మనుష్యులస్వరములయొక్క అనుకరణములచేతను, వేదములు శాస్త్రములు కలలు విద్యలు దేశభాషలు మొదలగువానియనుకరణములచేతను, సందర్భములేనిమాటలచేతను, సత్ప్రలాపములచేతను. దూషణములచేతను, పరక్రియలనువెక్కిరించుట పలుకుమొదలయినవానినివెక్కిరించుట మొదలయినచేష్టలచేతను, దానిననుసరించినలటకప్రహసనములచేతను, బాగుగఉద్దీపితమై పెదవులు ముక్కు చెక్కిళ్లు ముఖము వీనిని కదలించుటచేతను, దంతనిర్గమములచేతను, సంతోషముచేగలిగినలెస్సలెస్సఅనుపలుకులచేతను, స్తంభప్రళయములనువర్జించిరోమాంచాదిసాత్త్వికానుభావములచేతను, భావింపబడినదై ఔత్సుక్యము, చాపలము, వ్రీడ, హర్షము, స్మృతి, మదము, శ్రమము, మతి, గర్వము, అవబోధము, విస్మయము, వీనిచేతపోషింపబడినదై ఆహాస్యరసము స్మితాదిభేదములచే ఆఱువిధములౌనని చెప్పబడుచున్నది. ... ... *

## స్మితాదీని నిరూపయతి.

శ్లో॥ స్మితమథహసితంవిహసిత ముపహసితంచాపహసితంచ।
అతిహసితంద్వౌభేదౌ స్యాతా మత్తమమధ్యమాధమప్రకృతౌ ॥ ౩౬౬

తా॥ స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అపహసితము, అతిహసితము, ఈఆఱున్ను ఉత్తమమధ్యమాధమప్రకృతులయందు ఒక్కొకనికి రెండురెండువంతున గలుగును.

స్మితలక్షణం-౧.

శ్లో॥ ఈషద్వికసితైర్గండైః కటాక్షైస్సౌష్ఠవాన్వితైః।
అలక్షితద్విజాశీకం స్మితమిత్యభిధీయతే॥ ౩౬౭

తా॥ కడకంటిచూపులచేవ్యక్తమైనసత్త్వములోను కొంచెమువికాసమును బొందినచెక్కిళ్లతోనుగూడితెలియబడని దంతములుగలదిగానుండునవ్వు ఉత్తములకుగలుగును. ఇదిస్మితమనబడును. ... ... *

హసితలక్షణం-౨.

శ్లో॥ ఉత్ఫుల్లాననేత్రంతు గండైర్వికసితైస్తథా।
కించిల్లక్షితదంతంచ హసితంతద్విధీయతే॥ ౩౬౮

తా॥ వికసితమైనగండప్రదేశములతోగూడి వికాసమునుబొందినముఖనేత్రములుగలదిగాను కొంచెముచూడవగినదంతములనుగలదిగానుఉండునదిహసితమనబడును.

విహసితలక్షణం-౩.

శ్లో॥ ఆకుంచితాక్షిగండంయ త్సస్వరంమధురంతథా।
కాలాగతంసాస్యరాగం తద్వైవిహసితంభవేత్॥ ౩౬౯

తా॥ వంచబడినచూపును చెక్కిళ్లనుగలదిగాను, మధురముగాను, ఆసమయమందువచ్చినదిగాను, ముఖవిలాసముతోగూడినదిగానుఉండునవ్వు విహసితమనబడును. *

ఉపహసితలక్షణం-౪.

శ్లో॥ ఉత్ఫుల్లనాసికంయత్తు జిహ్మదృష్టినిరీక్షణం।
ఆకుంచితాంసకశిరః తచ్చోపహసితంభవేత్॥ ౩౭౦

తా॥ వికసించినముక్కుగలిగినదై నాలుకయందుకంటిచూపుగలదై వంచబడిన భుజములుశిరస్సునుగలదిగానున్ననవ్వుఉపహసితమనబడును. ... *

అపహసితలక్షణం-౫.

శ్లో॥ అస్థానహసితంయత్తు సాశ్రునేత్రంతథైవచ।
నిష్కంపితాంసకశిర స్తచ్చాపహసితంభవేత్॥ ౩౭౧

తా॥ ధ్వనిగలిగికన్నులనీళ్లతోగూడిభుజశిరస్సులుతలయునుగదలకనవ్వేదునవ్వు అపహసితమనబడును. ... ... ... *

అతిహసితలక్షణం-౬.

శ్లో॥ సస్వరంసాశ్రునేత్రంచ విక్రుష్టస్వనముద్ధతం।
కరోపగూఢపార్శ్వంయ త్తచ్చాతిహసితంభవేత్॥ ౩౭౨

తా॥ స్వరముతోగూడినదిగాను, నేత్రమందుకన్నీరుగలదిగాను, అధికధ్వనిగలదిగాను, గొప్పదిగాను, ప్రక్కలుపిసికికొనునదిగానుఉండునవ్వు అతిహసితమనబడును. *

భయానకరసలక్షణం.

శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్వికైర్వ్యభిచారిభిః। నీతస్సదస్యరస్యత్వం భయమేవభయానకః॥ ౩౭౩॥ రక్షఃపిశాచభల్లూకవ్యాఘ్రవ్యాళాదిదర్శనం। శూన్యారణ్యగృహారామశ్మశానాదిప్రవేశనం॥ ౩౭౪॥ యుద్ధదస్యునృపద్రోహా వికృతోగ్రస్వనా అపి। అస్యాలంబనముద్దీప్త్యై భవేయుస్స్వేదపివచ॥ ౩౭౫॥ ముఖోష్ఠతాలుకంపాస్య శోషాపాఙ్గావలోకనం। శ్యామాభోముఖరాగశ్చ నిష్క్రాంతభ్రాంతతారకాః॥ ౩౭౬॥ ప్రణామఃకాందిశీకత్వమంగుళిత్రాణచర్వణం। సహాయాన్వేషణాదిస్స్యా దాంగికైర్వాచికైస్తథా॥ ౩౭౭॥ శరణంభవమేయుష్మద్దాసోహంరక్షరక్షమాం। అభయందేహిమేతాత ఇత్యాదిరప్యస్యసాత్వికాః॥ ౩౭౮॥ సర్వేనుభావకాయస్య త్రాసావేగౌశ్రమోమృతిః। విషాదశ్చాపలంమోహశ్చింతాజాడ్యమపస్మృతిః॥ ౩౭౯॥ ఏతేసంచారిణః ప్రోక్తా భరతాగమవేదిభిః॥ ... ... *

తా॥ విభావానుభావవ్యభిచారిసాత్వికభావములచేసదస్యరస్యత్వమునుబొందినదైయుండుభయస్థాయిభయానకరసమౌను. ఈరసమునకు రాక్షసుడు - పిశాచము- భల్లూకము- వ్యాఘ్రము-పాములుమొదలైనవానినిజూచుట, శూన్యమైనఅడవి- ఇల్లు-తోట-శ్మశానముమొదలయినవానియందుప్రవేశించుట, జగడము- దొంగ- రాజద్రోహము-వికారముగను ఉగ్రముగనుఉండుస్వరముమొదలయినవి ఆలంబనమౌను. ముఖము పెదవులు చెక్కిళ్లు వీనికంపము, ముఖమువాడుట. ప్రక్కలనుజూచుట, ముఖమునల్లనౌట, నల్లగ్రుడ్లుచుట్టుట, ఒక్కప్రక్కకుపోవుట,దండముపెట్టుట, పారిపోవుట. వ్రేళ్లుకవచమునుకఱచుకొనుట, ఆంగికములచే వాచికములచేసహాయమును వెతకుటమొదలయినవి, నీకునేదాసుడు నిన్నుశరణుపొందినాను నన్నుకాపాడుకాపాడు అభయమియ్యవలయును అనుటఇవిమొదలయిన అనుభావములును, అన్నిసాత్వికభావములును, త్రాసము- ఆవేగము-శ్రమము-మృతి-విషాదము-చాపలము- మోహము-చింతయు-జాడ్యము-అపస్మారము-ఈసంచారిభావములును,గలవు. *

భీభత్సరసలక్షణం.

శ్లో॥ విభావాద్యైస్సదస్యానాం ప్రాపితోరస్యతామసౌ॥ ౩౮౦॥ జుగుప్సాస్థాయికస్తజ్జ్ఞైర్భీభత్స ఇతికథ్యతే। రక్తమాంసవసాస్థ్యాది చ్ఛర్దిలాలాద్యుపాశ్రయః॥ ౩౮౧॥ అనుభావైఃపరావృత్తి ముఖవక్రీకరణాదిభిః। శ్యామేనముఖరాగేణ సాత్వికైఃపులకాదిభిః॥ ౩౮౨॥ నిర్వేదశంకాపస్మారవిషాదజడతాదిభిః దీనతామోహశోకైశ్చ సహితోవ్యభిచారిభిః॥ ౩౮౩॥ సపునర్ద్వివిధక్షోభీచోద్వేగీతిచకథ్యతే। రక్తమాంసాదిభిఃక్షోభీ ఛర్దిలాలాదిభిఃపరః॥ ౩౮౪ ... *

తా॥ విభావము మొదలైనభావములచేసభవారికి ఆస్వాద్యత్వమునుబొందింపబడిన దియు జుగుప్సాస్థాయియునైనది భీభత్సరసమనబడును. ఈభీభత్సరసము రక్తము-మాంసము-పులినీరు-ఎముకలు మొదలయినవియు, వాంతి-జొల్లు మొదలయినవియు, ఆశ్రయముగాగలది. వెనకకుతిరుగుట-ముఖము దృష్టియు వంకబోవుట మొదలయినవి-నల్లనిముఖముకాంతి-ఈఅనుభావములతోను, పులకము మొదలయిన సాత్వికానుభావములతోను, నిర్వేదము-శంక-అపస్మారము-విషాదము-జాడ్యము-దైన్యము- మోహము-శోకము మొదలయినవ్యభిచారిభావములతోను, గూడియుండును. ఇది క్షోభభీభత్సమనియు, ఉద్వేగిభీభత్సమనియు, ఇరుదెఱగులౌను. రక్తమాంసాదులచేగలుగునది క్షోభభీభత్సము. కృమిలాలాదులచేగలుగునది ఉద్వేగిభీభత్సము. ... *

రౌద్రరసలక్షణం:

శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్వికైర్వ్యభిచారిభిః। నీతస్సదస్యాస్వాద్యత్వం క్రోధోరౌద్రఇతీరితః॥ ౩౮౫ ॥ ఆతతాయీచపిశునః పాతకాద్యభియోజకః। క్షేపావమానాద్యాక్రోశ వధబంధాదిఘాతకృత్ ॥ ౩౮౬ ॥ ద్రోహా న్యోద్రోహకారీచ తస్యాలంబనమిష్యతే। దార్ఢ్యనిర్భయతాగర్వ ఔద్ధత్యాదియుతైస్తథా॥ ౩౮౭ ॥ కోభవాన్కింకరోషిత్వ మిత్యాద్యాః పరుషోక్తయః। ద్వేషవాక్శిరఃకంప హాసవక్రేక్షణాదయః॥ ౩౮౮ ॥ దష్టోష్ఠతాచభృకుటీ రక్తోద్వృత్తాచతారకా। భూతాడనభుజాస్ఫాల చపేటాముష్టితాడనం॥ ౩౮౯ ॥ కపోలస్ఫురణంరక్త ముఖరాగోవధోద్యమః। ఛేదనాకర్షణాఘాత ఘేదనంపటుమోచనం॥ ౩౯౦ ॥ భాషణందండశస్త్రాస్త్ర గ్రహణంచాభిధావనం। మారణాశ్రువికర్షాస్ఫ క్పానాస్యత్యభిధావనం॥ ౩౯౧ ॥ అఃపాపస్యపశోద్రోహిన్ క్షిపలిష్టక్వధావసి। ఉత్పాటయామిమూర్ధానం కుర్వేవక్షోవిదారణం॥ ౩౯౨ ॥ ఉన్మూలయామిరదనా న్గాత్రంసంచూర్ణయామిచ। ఇత్యాదివాచికంచైవ భయవర్జమసాత్వికం॥ ౩౯౩ ॥ యస్యానుభావతాంయాంతి యస్యామర్షోమదస్మృతిః। ఔత్సుక్యావేగమోహాశ్చ గర్వాసూయాచాపలోగ్రతాః॥ ౩౯౪ ॥ ఉన్మాదోత్సాహబోధాశ్చ భవేయుర్వ్యభిచారిణః॥ *

తా॥ విభావానుభావసాత్వికవ్యభిచారిభావములచేసదస్యాస్వాద్యత్వమును బొందింపబడినక్రోధస్థాయి రౌద్రరసమని చెప్పబడును. ఆతతాయియు, కొండెము జెప్పువాడు, పాపము మొదలయినవానిని జేయుమనువాడు, క్షేపము అవమానము మొదలయిన ఆక్రోశమును-బంధనము వధము మొదలయినహింసను జేయువాడు, ద్రోహము జేయువాడును, దీనికి ఆలంబనములు. దార్ఢ్యము-భయములేకయుండుట-గర్వము-ఔద్ధత్యము మొదలైనగుణములును, ఎవడురా నీవు ఏమిచేయుచున్నావురా అనునవి మొదలయిన క్రూరవాక్యములును, విరోధపుపలుకులు-తలయూచుట-నవ్వుట- వంకరగజూచుట మొ

దలైనవియు, పెదవికొఱుకుట, కనుబొమలవంకర, గ్రుడ్లుఎఱ్ఱనై గిరగిరతిరుగుట, నేల కొట్టుట, భుజాస్ఫాలనముజేయుట, చేయితట్టుట, గుస్సలిడుట, చెక్కిళ్లుఅదరుట, ఎఱ్ఱనిముఖకాంతి, చంపెడుయత్నము, ఛేదించుట, ఊడ్చుట, కొట్టుట, నఱుకుట, వస్త్రములనువదలించుట, మాటలాడుట, దండశస్త్రికలనుగ్రహించుట, పరుగులిడుట, చంపుట, కన్నీరిడుట, నెత్తురుద్రాగుట, మిక్కిలితఱుముట, ఓరిపాపీ-మనుష్యపశువాం ద్రోహి-నిలువునిలువు-ఎచటికిపోయెదవు-నీతలపగులగొట్టెదను-ఱొమ్ముచీల్చెదను- ద-తములురాలగొట్టెదను - దేహమునలియగొట్టెదను - ఇవిమొదలైనపలుకులును, భయములేకయుండుట, సత్వములేకయుండుట, అనుభావములౌను. అమర్షము, మదము, స్మృతి, ఔత్సుక్యావేగములు, మోహము, గర్వము, ఈర్ష్య, చాపలము, ఉగ్రత, ఈసంచారిభావములును గలవు. ... ... *

రసాద్రసోత్పత్తిర్యథా,

శ్లో॥ హాస్యోభవతిశృంగారాత్ కరుణోరౌద్రకర్మణః॥ ౩౯౫
అద్భుతశ్చతథావీరా ద్బీభత్సాచ్చభయానకః॥

తా॥ శృంగారరసమువలన హాస్యరసముగలుగుచున్నది. రౌద్రరసమువలనకరుణరసముగలుగుచున్నది. వీరరసమువలన అద్భుతరసముగలుగుచున్నది. భీభత్సమువలన భయానకరసముగలుగుచున్నది. ... ... ... *

రసానాం విరోధోయథా.

శ్లో॥ ఉభౌశృంగారభీభత్సౌ మిథోవీరభయానకౌ॥ ౩౯౬
రౌద్రాద్భుతౌతథాహాస్యకరుణౌప్రకృతిద్విషౌ॥

తా॥ శృంగారరసమును భీభత్సరసమును పరస్పరమువిరోధులు. వీరరసమునుభయానకరసమును విరోధులు. రౌద్రరసమును అద్భుతరసమును విరోధులు. హాస్యరసమునుకరుణరసమును విరోధులు. ... ... *

శ్లో॥ రసాఃకార్యవశాత్సర్వే మిళంత్యేవపరస్పరం॥ ౩౯౭
ప్రథమంయోరసఃఖ్యాతః సప్రధానోభవిష్యతి॥

తా॥ అన్నిరసములును కార్యవశమువలనజేరుచున్నవి. వానిలోమొదటఏరసముచెప్పబడుచున్నదో అదిప్రధానరసమనబడును. ... ... *

శ్లో॥ ముఖ్యైరసేపితేంగత్వం ప్రాప్నువంతికదాచన॥ ౩౯౮

తా॥ రసములలోముఖ్యమైనరసమందు తదితరరసములు ఒకానొకసమయమందు అంగత్వమునుబొందుచున్నవి. ... ... *

శ్లో॥ సంచారిణాంరసానామ ప్యానుకూల్యమిహోచ్యతే।

తా॥ ౮ రసములకును ౩౩ వ్యభిచారిభావములకును పరస్పరానుకూల్యముచెప్పబడుచున్నది. ... ... ... ... *

౧ శృంగారవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ సర్వేభావాః ప్రయోక్తవ్యా శ్శృంగారేవ్యభిచారిణః॥ ౩౯౯

తా॥ శృంగారరసమందు ౩౩ వ్యభిచారిభావములను ప్రయోగింపదగినవి. •

౨ – వీరవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ అమర్షశ్చవిబోధశ్చ వితర్కోథమతిర్ధృతిః।
క్రోధాసూయాథసంమోహా ఆవేగశ్చాపిహర్షణం॥ ౪౦౦
గర్వోమదస్తథోగ్రత్వం భావావీరేభవంత్యమీ॥

తా॥ వీరరసమందు అమర్షము, విబోధము, వితర్కము, మతి, ధృతి, క్రోధము, అసూయ, సంమోహము, ఆవేగము, హర్షము, గర్వము, మదము, ఉగ్రత్వము, ఇవిగలుగును. *

౩ – కరుణవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ దైన్యంచింతాతథాగ్లాని ర్నిర్వేదోజడతాస్మృతిః॥ ౪౦౧
వ్యాధిశ్చకరుణేప్రోక్తా భావాభావవిశారదైః॥

తా॥ కరుణరసమందు దైన్యము, చింత, గ్లాని, నిర్వేదము, జాడ్యము, స్మృతి, వ్యాధి ఈవ్యభిచారములుగలుగును. ... ... *

౪ – అద్భుతవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ ఆవేగోజడతామోహో హర్షణంవిస్మయస్మృతిః॥ ౪౦౨
ఇతిభావాః ప్రయోక్తవ్యా రసజ్ఞైరద్భుతేరసే॥

తా॥ ఆవేగము, జాడ్యము, మోహము, హర్షము, విస్మయము, స్మృతి, ఈభావములు అద్భుతరసమందుగలుగును. ... ... *

౫ – హాస్యవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ శ్రమశ్చపలతానిద్రా స్వప్నోగ్లాని స్తథైవచ॥ ౪౦౩
శంకాసూయావహిత్థాచహాస్యేభావాభవంత్యమీ॥

తా॥ శ్రమము, చాపలము, నిద్ర, స్వప్నము, గ్లాని, శంక, అసూయ, అవహిత్థ, ఈ వ్యభిచారిభావములుహాస్యరసమందుగలుగును. ... *

౬ – భయానకవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ సంత్రాసోమరణందైన్యం గ్లానిశ్చైవభయానకే ॥ ౪౦౪

తా॥ సంత్రాసము, మరణము, దైన్యము, గ్లాని, ఇవిభయానకరసమందుగలుగును.

౭ – బీభత్సవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ అపస్మారోవిషాదశ్చ భయంరోగోమృతిర్మదః।
ఉత్సాహశ్చేతివిజ్ఞేయా బీభత్సేవ్యభిచారిణః॥ ౪౦౫

తా॥ అపస్మారము, విషాదము, భయము, రోగము, మృతి, మదము, ఉత్సాహము, ఈ వ్యభిచారిభావములు బీభత్సరసమందుగలుగును. ... ... *

౮- రౌద్రవ్యభిచారిణామానుకూల్యం.

శ్లో॥ హర్షోసూయాతథాగర్వ ఉత్సాహోమదఏవచ।
చాపల్యముగ్రతాచేతి రౌద్రేభావాః ప్రకీర్తితాః॥ ౮౦౬

తా॥ హర్షము, అసూయ, గర్వము, ఉత్సాహము, మదము, చాపల్యము, ఉగ్రత్వము, ఈభావములు రౌద్రరసమందుగలుగును.

శ్లో॥ రామాదేర్వ్యాదికారణోపజనితః కార్యైఃప్రతీతింగతః
సంపుష్టస్సహకారిభి ర్జనయతిస్థాయీసుఖంవాసుఖం।
భావానామనువర్ణనానుకరణైః కావ్యేపినాట్యేపిచ
వ్యక్తోయంతునిరాశ్రయ స్సుఖకరస్సన్యైరసశ్చర్వ్యతే॥ ౮౦౭

తా॥ ఆలంబనభూతనాయికానాయకులమనసునకారణముచేగలిగినదై కార్యములయినఅనుభావములచే జ్ఞానవిషయమునుబొంది సహకారులవ్యభిచారిభావములచేపోషింపబడినస్థాయియై సంభోగశృంగారమునందు సుఖమునువిప్రలంభశృంగారమందుదుఃఖమును గలుగజేసి భావములఅనువర్ణనానుకరణములచేకావ్యమందును నాట్యమందును వ్యక్తమై నిరాశ్రయమై సుఖకరమైనరసము రసికులచేనాస్వాదింపబడుచున్నది.

ఇతిభరతరసప్రకరణంసంపూర్ణం.



శ్రీరస్తు.

రాజమన్నారుగుడి

సభాపతయ్యగారిచే రచియింపబడిన

రాజగోపాలాంకితములును శృంగారరసప్రధానములునైన

# పదములు

ఇవి

సి - మా - తిరువేంకటాచార్య్యులవారిచేత

సంగ్రహింపబడి ఆంధ్రవ్యాఖ్యారూపమయిన

నాయికానాయక లక్షణములతోను

రసమంజరి ఉదాహరణ శ్లోకములతోను

ఆ-న- కృష్ణమాచార్యులవారి

శ్రీవాణీనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

చెన్నపురి.

౧౮౮౪సం॥ మార్చినెల.

# వి ష య సూ చి క.


| | | | | |
|---|---|---|---|---|
| ,, | ౩౫ | ఏమిపల్కాదాయె | స్వీ-ప్రౌ విరహోత్కం | ప్రాతరిన్నకుంజ |
| ౨౮ | ౩౬ | ఎలనాగదీని | స్వీ-ప్రౌ-విప్రలబ్ధ-(ఠిత | శూన్యం వాసగృహం |
| ౨౯ | ౩౭ | నీపాటుకువేగ | స్వీ-ప్రౌ-ఖండిత | మామ్యాదీక్ష్య |
| ౩౦ | ౩౮ | చెలువుడు | స్వీ-ము-కలహాంతరిత | అనుసరతిపతిం |
| ,, | ౩౯ | ఇ: తిరో నేజేసిన | స్వీ-ప్రౌ-క- | |
| ౩౧ | ౪౦ | వానిదూర నేలే | స్వీ-ప్రౌ-ఉత్తమ | |
| ౩౨ | ౪౧ | ఏమందునె | స్వీ-ప్రౌ-ప్రోషితభ | |
| ౩౩ | ౪౨ | చూడవేయది | ప-అభిసారిక.(త్రిలో | రభసాదభిసరణ |
| ౩౪ | ౪౩ | ఏంతనేర్పు | ,, ,, | |
| ,, | ౪౪ | ఉత్తరపడలేక | స్వీ-ప్రవసత్పతిక | నాయంముంచతి |
| ౩౫ | ౪౫ | ఇన్నివింతలు | ప-సమాగచ్ఛత్పతిక | |
| ,, | ౪౬ | ఇతడెవ్వరు | స్వీ-ప్రౌఢ | |
| ౩౬ | ౪౭ | నన్నిటులెడబాసి | స్వీ-ప్రౌ-కలహాంతరిత | |
| ,, | ౪౮ | ఇంతకోపంబేలె | స్వీ-మధ్య-ఖండిత | |
| ౩౭ | ౪౯ | ఇందుకుఅలిగెదవే | స్వీ-ప్రౌ-కలహాంతరిత | |
| ౩౮ | ౫౦ | ఇప్పుడుఈలాగు | స్వీ-మ-ఖండిత | |

# శుద్ధపత్రిక.

| | | శుద్ధము | అశుద్ధము |
|---|---|---|---|
| ౧ | ౬ | యొక | యొక్క |
| ౭ | ౮ | జూ | జూచి |
| ౧౦ | ౨౩ | షేనవా | షేనవా |
| ౧౧ | ౧౯ | ఫలమనపేత్య | ఫలనమవేక్ష్య |
| ౧౭ | ౯ | జూచుట,నో | జూచుట,మో |
| ౨౩ | ౩౦ | పప॥రా | ప॥రా |
| ౨౫ | ౧౬ | యిలకరచు | యిట్లొకరచు |
| | ౪౧ | తానటై | తానట్టై |
| ౨౯ | ౧౮ | న కలుగును | సవికలుగును |
| | ౨౯ | కపటము | కలికెందొకపటము |
| ౩౧ | ౧౨ | యాతని | యందున |
| ౩౮ | ౨౦ | వేదనీతి | వేదునీవది |
| | ౨౩ | నె ౨ | నెన్ని |
| | ౨౮ | న వ | నవ్వ |
| | ౩౧ | భూ జము | భూతజము |
| ౩౫ | ౨ | ప్రసక్త | ప్రసక్తి |
| | ౩ | హంవి | హంపిహి |
| | ౯ | జెప చున్నది | జెప్పుచున్నది |
| | ౧౮ | వాని | వానిపై |
| | ౧౫ | కట్టిబంగారు | కట్టినట్టిబంగారు |
| | ౨౭ | జగోపాలు | రాజగోపాలుని |
| | ౨౯ | జే చె | జేచె |
| | ౩౦ | జూచివే | జూచివే |
| ౩౬ | ౫ | స్వీయ | స్వీయ |
| | ౧౭ | తపులేమో | తప్పులేమో |
| | ౨౦ | ప్రౌఢ | ప్రౌఢ-కలహాంతరిత |
| ౩౭ | ౨౫ | పదము | పలదెము |
| ౩౯ | ౩ | అన్యా | అన్యాసం |
| | ౬ | ఖండిత | ఖండిత . కలహాంతరిత |
| | ,, | ధృష్టుడు | శఠుడు |
| | ౭ | సచారిభావము | సంచారిభావము |
| | ౧౫ | దేకిబాల | దేవకీబాల |
| | ౧౯ | ఉప్పొను | ఉప్పొంగు |
| | ౧౬ | తెప్పున | తెప్పున |



శ్రీరస్తు

# సభాపతయ్యగారిపదములు.

౧.— చెలికత్తె గోపాలునితో అత్యంతప్రియురాలైన నాయికయొక్క గుణరూపసంపదాదులయం దు అత్యాసక్తి కలిగియుండుటచేత వారిద్దరిని మిక్కిలి కోరినదై, ఆ నాయికయొక్క భర్తృశుశ్రూషణము శీలసంరక్షణము మొదలయిన సద్గుణములను నాయకునితో చెప్పుచున్నది.

రాగము యదుకులకాంభోజి. తాళము ఝంప.

పల్లవి॥ ఇట్టిగుణశాలికి నీడెవరు ఘనసీల- ఇదినీకు తగు సుశీల.

అనుపల్లవి ॥ అట్టి క్షీరాబ్ధిలో బుట్టలేదీబాల- ఐనని జమెయొక్క కమల - గోపాల.

చరణము॥౧॥ ఇరుగిల్లు పొరుగిల్లు ఇంతి తా నెరుగునా - ఇంటివాకిట నిలుచునా

పరసతులతో నైన పలుకెరచి నవ్వునా - పరిలియించక యల్గునా

పరిహాసముగ నీవు పలుకగా నైనను- పలుపు నీకగపరుచునా

తరుణులకు పురుషుడే దైవమని నమ్మిన- తలపెన్నటికి విడచునా- ఈచాన॥ ఇ॥

౨॥ కలనైన నొరులనుకన్నెత్తిచూచునా- గట్టిగా మాటాడునా

పౌలతత్తమామలు పోరుపెట్టిన గాని - అలవారి గిరిదాటునా

చలముచే నితరులు చాల దూరిననాని - శాంతగుణమును విడుచునా

సులభుడైతనరూపుచూచి చాక్కైదనని- పుంతగర్వంబొందునా- సుఖసదన ॥ ఇ॥

౩॥ శౌరగాని వార్తలు కోర్కె నాలించునా - గురుభక్తి తా విడుచునా

పరులవార్తల నింతపలుక నోరెత్తునా - పాపలేశం బెరుగునా

వెరవక నీయెదుట వేగముగ నడచునా - వరశీలమును మానునా

సరసుడౌ గోపాలసామిని న్నెనసిన - జాడ చెలులకు దెలుపునా- ఎప్పుడైన ॥ ఇట్టి॥

నాయిక స్వీయ॥ లక్షణము॥ సంపత్కాలమందును విపత్కాలమందును శీలము ఆర్జవ ము మొదలగు సద్గుణములుగలిగి నాయకుని విడువకయున్నట్టి స్త్రీ స్వీయయని చెప్పబడు ను. అది, ముగ్ధయనియు, మధ్యయనియు, ప్రగల్భయనియును మూడువిధములగును.

నాయకుడు పతి॥ లక్షణము ॥ ఏ స్త్రీని గాని వేదశాస్త్రోక్తముగ పెండ్లాడినవాడు పతి అనబడును.

# సభాపతయ్యగారిపదములు.

రసము శృంగారరసము ॥ లక్షణము ॥ విభావానుభావ వ్యభిచారిసాత్త్విక భావములచే సదస్యసాస్వాద్యత్వమునుబొందినరతిస్థాయిభావము శృంగార రసమని చెప్పబడును. అరతిస్థాయి నాయికానాయకులను ఆలంబనముగ గలది. రూపము యౌవనము లావణ్యము కులము శీలము మొదలైన నాయికానాయకుల గుణములచేతను, మధురమైన పలుకుల చేతను, సంగీతవిద్యమొదలైనవానిచేతను, భుజవిన్యాసము కటాక్షము హాసము మొదలైన వానిచేతను, చేష్టలచేతను, పుష్పము గంధము వస్త్రము హస్తాభరణము మొదలైన అలంకారములచేతను, చంద్రదీపాదులైన తటస్థ భావములచేతను, మరలఉద్దీపితయై, చక్కని చూపు ప్రసన్నముఖరాగము మొదలైన ఆంగికములచేతను, మధురాలాపము గుణకీర్తనము మొదలయిన వాచికములచేతను, స్తంభకంపాదులయిన సాత్త్వికానుభావములచేతను ప్రకాశితమై, ఔత్సుక్యము చింత హర్షము మొదలయిన సహకారులచేతను పోషింపబడిన అరతియే భావములచే రంజితమై,రసికులచే ఆస్వాద్యమానమై,శృంగారరసమాటను పొందుచున్నది.

సంచారీభావముధృతి ॥ లక్షణము ॥ మోక్షవిషయిక జ్ఞానము శాస్త్రజ్ఞానము గురుభక్తి నానావిషయములసిద్ధి సిగ్గుమొదలయినవానిచేతమనస్సునకు ఇచ్ఛలేకయుండుట ధృతి యనబడును. ఇందులభించినదానిని అనుభవించుట, పొందబడనివిషయములు కడచిన విషయములునష్టవిషయములువీనికిగామనస్సునచింతలేకయుండుటమొదలయినవి కలుగును.

అలంకారమున్యూనతాద్రూప్యరూపకము ॥ లక్షణము ॥ అభేదములైన ఉపమానోపమేయములకు తాద్రూప్యరంజకమురూపకము. అదిఅధికతాద్రూప్యము న్యూనతాద్రూప్యము అనుభయతాద్రూప్యము అనిమూడుతెరగులుగలది. క్షీరాబ్ధిలోపుట్టనిసిరిబాల అయిన నాకకమలయనుచోట క్షీరాబ్ధిలోపుట్టనిదిన్యూనము.

ఇందుకురసమంజరియుదాహరణము ॥ శ్లో ॥ గతాగతకుతూహలంనయనయోరపాంగావధిస్మితంకులనతభ్రువామధరఏవవిశ్రామ్యతి। వచఃప్రియతమశ్రుతేరతిథిరేవకోపక్రమః కదాచిదపిచేత్తదామనసికేవలంమజ్జతి॥

---

౩. — నాయికతనకు అత్యంతము అంతరంగురాలైనసఖితో రాత్రితన పెనిమిటిపడకటింటిలో చెప్పినమాటలను అతడుచేసిన వ్యాపారములను తలచి లజ్జాభయపరాధీనురాలై స్వానుగత వృత్తాంతములను జెప్పుచున్నది.

రాగము మోహన. తాళము మిశ్రము.

ప॥ పరకింటికిపోవరేనే- నిన్నపద్ద- పాటుదలచివెరచేనే.

అ॥ వడిగాగోపాలుని- వద్దజేయుమనే- ప్రాణముపోవచ్చేనే- వణకుచునే.

# సభాపతయ్యగారిపదములు.

౧॥ పట్టపగలుండి టెబడినసమయమున- పైటలో చెయివేసెనే.
ఎట్టిగోర్తునన గట్టుకకెన్నొవి-యెంగిలి చేసెనే-నిజముగానే.
౨॥ అడుదాననువాతో అడరానిమాట- లాడినవ్వకొనెనే.
ఏడాదిగానను వేడియిన్నకమాడి- ఏమేమోచేసెనే-మోజములోనే.
౩॥ కలికిగోపాలుడు కరములు పట్టుక- వలువవిప్పివేసెనే.
చెలిరో రాతిరివాడు చేసినరచ్చలు- చెప్పసిగ్గయ్యానే- ఏమందునే.

నాయికముగ్ధ॥ల॥ఏయొవిధమన్మథవికారమునందునూతన స్త్రీగాను - మన్మథకేళియందు అస్వాధీనురాలుగాను-గాఢమైనలజ్జగలదిగాను-వినోదరగాను-కోపకాలమందు స్తిమితగాను- నాయకుడపరాధియైనను రోదనము చేయుచుచూచుచుండునదిగాను. రతివ్యాపారముయత్నము చేయుచుహితాహితములను చెప్పకయుండునో అదిముగ్ధనాయిక. నాయకుడుపతి॥ల॥౧, చూచునది. రసముసంభోగశృంగారము॥ల॥పరస్పరానుకూల్యము విలాసము గలవారై నాయికానాయకులు దర్శనస్పర్శనాదులనుపొందుచుండినసంభోగశృంగారమనబడును. అందువికసించినకనుబొమలచేతనున్నమైన చూపు లలితమధురమైనపలుకు స్తంభాది సాత్త్వికభావములన్నియు లీలాదిచేష్టలు ప్రసన్నమైన ముఖకాంతియుమొదలయినవి దీనికి అనుభావములు. జుగుప్స, శమము, నిర్వేదము, వ్యాధి, ఉన్మాదము, మదము, వ్యాతి, విషాదము, అవగ్లము, ఆలస్యము, అపస్మారము, వీనినివర్జించి తదితర సంచారిభావములుగలుగును. ఈసంభోగశృంగారము సంక్షిప్తమనియు సంపన్నమనియు ఇరుతెరగులౌను. యౌవనవంతులైన స్త్రీపురుషులు సాత్త్వికోదయము సిగ్గు మొదలగు వానిచేత సంక్షిప్తములయిన యుపచారములను పొందినది సంక్షిప్తమనబడును. ఎడబాసియుండి కూడినవారి సంభోగము సంపన్నమనబడును. సంచారీభావము వ్రీడ॥ల॥ అకార్యముచేయుట, అవమానము, స్తోత్రము, నూతనసంగమము, ప్రతీకారక్రియ మొదలయినవానిచేత అతిధార్ష్ట్యములేకయుండుట వ్రీడయనబడును. ఇందుముసుగుమాటాడుట, తలవంపు, కా పించుట, బయటరాకుండుట, దూరముగానేమసలుట, గోళ్లుగిల్లుట, నేలగీరుట. ఇవిమొదలైనవిగలుగును. అలంకారము స్వభావోక్తి॥ల॥ వస్తువునందుగలస్వభావము ఉన్నదియున్నట్లుచెప్పుట.

ర॥ శ్లో॥ హస్తే ధృత్వాపిశయనే వినివేశితాపి క్రోడీకృతాపి యతతే బహిరేవ గంతుం, జానీమహేనవవధూరథతస్యవశ్యా యఃపారదం స్థిరయితుం క్షమతే కరేణ॥

౩,— గోపాలునికి రాత్రి నాయిక అస్వాధీనురాలై యున్న విషయమును అతనికిమా ఱునాడే చెలికత్తె తెలిసికొని ఆమెకు బుద్ధి మాటలను చెప్పుచున్నది.

రాగము కాంభోజి - తాళము మిశ్రము.

ప॥ ఇంతసిగ్గు పడనేలె - ఓ బాల - ఇకనైన మానవె గుణశీల

అ॥ శాంతముగాను గోపాలుని జేరక - ఇంతులెల్ల నవ్వనేలే - ఏమిటికే.

౧॥ చెలులందరు గూడి - జలకము జేర్చిరి - అల పడకింటిలోపల జేర్చి
పిలువ జేసిన వానికెంతను జేరక - తలుపు మూలను దాగియుంటివట॥ ఇంత॥

౨॥ కొలువు దంతలో చెట్టబట్టుకని - వలువను వదలించి పాన్పునుంచి
చలువ గంధము పూసి - చను మొనలంటితే - తొలగించి తలవంచి చలము చేసితివట

౩॥ బాల రాజగోపాలుని గూడిన - చాలసొమ్ములు పెట్టి మేలుపుట్టు
తాళ జేసి వీడి బాలికామణులెల్ల - జాలిని సంసార మేలాగు చేసేరు॥ ఇంత॥

నాయిక ముగ్ధ॥ ల॥ ౨, చూ. నాయకుడు - పతి॥ ల॥ ౧, చూ. రసము సంభోగశృంగారము॥ ల॥ ౨, చూ. సంచారిభావము వ్రీడ॥ ల॥ ౨, చూ. అలంకారము స్వభావోక్తి॥ ల॥ ౨, చూ.

---

౪,— తనదేహమునందలి యౌవన ప్రాదుర్భావ చిహ్నములను తెలిసికోలేని నాయకిని జూచి చెలి చెప్పుచున్నది.

రాగము కాపి - తాళము మిశ్రము.

ప॥ ఇదియేమిటింతే. తెలియకయె - వదరెదవింతే.

అ॥ మదనగోపాలుని - సుదతి కో యౌవన - మొదవి యున్నాదిత - మిదియనియెరుగవు.

౧॥ ధరనాలుమగలు - ఇరువురు రేయెల్ల - మరుగున పలికించు - మర్మమేమనుచును.
పొరుగింటి తరుణిని పోరిపోరడిగేవు - సరసులు విని నవ్వ జాడ తెలియలేవు.

౨॥ భామ నీ పిరుదులు భారమౌ టెరుగక - ఏ మోదుర్బలమయ్యె ననుచును సోలేవు
రోమరాజిని జూచి చీమల బారని - ఏమారక గోట నే చిమ్ముచున్నావు.

౩॥ పలుమారు రాజగోపాలుడు నినుజూచి - చెలిపండు కొన వచ్చెద వాయనినంత
కిలకిల నగుచు నా కీలు దెలియలేక - పలుకబోయి - యేమి పండని యడిగేవు.

ర్య శ్లో॥ నీరా త్తీరముపాగతా శ్రవణతో స్ఫీమున్నపురస్నే త్రమోహాశ్యాస్యసంలగ్నమి
జంకిముత్పలమితిజ్ఞాతుం కరం న్యస్యతి । నైవాలాం కుచశంకయా శశిముఖీ రోమావళిం
ప్రోజ్ఝితి క్రాంతాస్మితిముహుస్సఖీ మపదిత క్రోడేక్షరాపృచ్ఛతి.

౫.--- నాయికగోపాలునితో జేరునపుడు ఆమెయొక్క సఖిలినిజూచి ఆమెతో జెలికత్తెచిరు
నవ్వునవ్వుచు వేడుకగా చెప్పుచున్నది. ఈపదము ప్రౌఢా ఆనందసమ్మోహితకు
ఉదాహరణము జౌను.

రాగము కాంభోజీ - తాళము ఝంప

ప॥ కలికిరతివేళసిగ్గేమ బోయెనే

అ॥ ఆల రాజగోపాలుడనినంతసఖికే,

౧॥ బలుమోహమునసీవు-పడకటింటికివచ్చి - తలపంచుకొని నైటలావిడ్డుకొనుచు
నిలిచిననుచెలితాను-వినుకౌగిలించితే-కులుకుగుబ్బలరొమ్ముకప్పెదొడగిలివే.

౨॥ ఆకుమడుపియ్యగా- అతనిచెయినీపైని - సోకినంతనెవణకిచొక్కి-తివిగనుకొ
నీకాంతుడటునవ్వి కిన్నెగంటజూచుచు- పోకముడిపప్పగా ప్రమాకువచెరుంచితే.

౩॥ తలచియుస్సురుమని తమిరేగిపదరుట - తెలిసిగోపాలుడుతెరవనినుగూడ
బళిబళిరసామియని బాగాముద్దిడియేమి- తెలియకయెమైమరచియలసి పొలపితివే.

నాయిక మధ్య॥ ల॥ సమానములైన సిగ్గును కామమును గలదియు, వృద్ధి
బొందు యౌవనము గలదియు, మోహవ్యాపార మధ్యమందు సురత యోగ్యతగలదియు
నగుచు నాయకుని ఆపేక్షించు నాయిక మధ్యయనబడును. ఆమధ్యానాయిక మానమనెడు
కోపవ్యాపారముచే ధీర, అధీర ధీరాధీర ఆనిమూడు రంగులుగలది. నాయకుడుసభాపతి॥ల॥
౧,చూ- రసము సంభోగశృంగారము॥ల॥ ౨,చూ- సంచారిభావము అవహిత్థము॥ల॥
ధైర్యము ప్రాభవము నీతి సిగ్గు సాధ్వసము దాక్షిణ్యము ప్రాగల్భ్యము అపజయము
ఇవి మొదలయినవానిచేగలుగు ఆకారగుప్తి అవహిత్థము అనబడును. ఇందుపేరుగ జెప్పుట
అబద్ధపుధైర్యము మఱియొకప్రక్క జూచుట కథాభంగము మొదలయినవి గలుగును.
అలంకారము ధర్మలుప్తోపమ ॥ ల ॥ ఉపమానము, ఉపమేయము, సాధారణ ధర్మము,
ఉపమావాచకము, వీనిలో ఒకటిగాని రెండుగాని మూడుగాని చెప్పబడక పోవునేని
లుప్తోపమయనబడును. అదియెనిమిదిభేదములుగలది. ఇది అందుధర్మలుప్తోపమ. సఖికయిం
టికి వచ్చినప్పటి సాధారణధర్మము ఈపదమునందు చెప్పబడలేదు.

ర॥ శ్లో॥ స్వాపేప్రియాననమపి గోకనవానిరేవ స్వాపస్యశౌ ప్రియకరగ్రహణ ప్ర
సంగః। ఇత్థంసరోరుహముఖీపరిచింతయంతి స్వాపంవిధాతుమనిశం మపిప్రవేదే॥



౬.— నాయిక నాయకునిచే దగిన భావగర్భములైన యుపచారములను అంగీకరించక తాను చేసిన తప్పును తలచుకొని పరాఙ్ముఖుడై యుండు గోపాలుని జూచి సఖి నాయికని అడుగుచున్నది.

రాగము భైరవి - తాళము మిశ్రము.

ప॥ ఇప్పుడేల తలత్రిప్పేవే ఏమందునే - ఇదియెంతో బాగాయెనే.
అ॥ కపటమే నీవు వచరింపగానే - చపలాక్షి గోపాలసామి వేగమెతానె
౧॥ ఉదయకాలమున నదయుడు వచ్చెని - ఇదిగోయని చని పదరి క్రమ్ముకొని
చెదరనిబత్తితో చెయిబాగిచ్చిరమ్మని - ముదితరో శ్రమజలముల నొత్తితియని
౨॥ చాలరో వానికి పరవశ్యైపర చేవు - పాలుచక్కెరయును పానకమొసగేవు
పూలును రతి చేబూనుక నిచ్చేవు చాలబడలినావు సామియనుచు నీవు.
౩॥ పదములొత్తుచు చానిప్రక్కను నిలిచేవు - నిదురింపుమికనని నీవే సద్దణచేవు.
పదవెన్నెలను గోపాలాయన లేవు. ఇదిగో మేను వాడినదియని వగచేవు.

నాయిక మధ్యాధీర॥ ల॥ అపరాధియై యుండు నాయకుని జూచి సాభిప్రాయమైన వక్రోక్తులాడునది మధ్యాధీరానాయికయని చెప్పబడును. నాయకుడు శఠ - ధృష్టుడు॥ ల॥ తనయపరాధము నాయికచే నెఱుగబడినను భయములేక తొలగించినను తొలగక నమస్కారము మొదలయిన ఉపాయములచేత ఆ నాయికనే అనుసరించువాడు ధృష్టుడనబడును. రసము ఈర్ష్యామాన విప్రలంభ శృంగారము॥ ల॥ అన్యస్త్రీ సంభోగము నెఱుంగుటచే ప్రియునియందుగలుగు కోపము ఈర్ష్యామానమనబడును - అభావము ఉపాలంభము బెదరించుట కొట్టుట వైముఖ్యము కన్నీరు ఓర్వమి ఇవి మొదలయిన వానిచే నెఱుగదగినది- దీని నెఱుగుట కుపాయము, చూచుట అనుమానము ఈమూటిలో దేనివల్లనైననగును. సంచారిభావము అవహిత్థము॥ ల॥ ౪, చూ. అలంకారము పిహితము॥ ల॥ పరవృత్తాంతము తెలిసి భావగర్భచేష్టలు కలిగియుండునది పిహితాలంకారము అనబడును. ఇప్పుడేల తలత్రిప్పేవే ఇందలి భావచేష్ట పరవృత్తాంతవ్యంజకము.

ఉ॥ శ్లో॥ లోలాళిపుంజే వ్రజతో నికుంజే స్ఫారా బభూవుశ్శ్వసితా హరిణ్యాః।
దేహోపసమీహా షోభరతో విధాతుం ధీరం సమీరం నళినీదళేన॥

---

౭.— నాయిక గోపాలుడు తనతో చెప్పియున్న నమ్మికమాటలను మరచి అన్యాసంభోగచిహ్నములతో తనయెదుటికి రాగా చూచి మిక్కిలి మనంశ్ఛించి యీర్ష్యామానముతో గూడిన దైన్యము చెప్పుచున్నది.

నాయిక మధ్య-ధీరా ధీర॥ ల॥ కన్నీరొలుకనాయకుని క్రూరపుపలుకులు పలుకు నాయిక మధ్యాధీరాధీర యనబడును. నాయకుడుపతి-ధృష్టుడు॥ ల॥ ౬, చూ. రసము ఈర్ష్యామానవిప్రలంభశృంగారము॥ ల॥ ౬, చూ. సంచారిభావము అమర్షము॥ ల॥ ౭, చూ. అలంకారము సమాసోక్తి॥ ల॥ ప్రకృతముచేత అప్రకృతములో యున్నది చెప్పబడు నేని అట్టియలంకారము సమాసోక్తియనబడును.

ర॥ శ్లో॥ కాంతానురాగచతురోసి మనోహరోసి నాథోసి కించనవయౌవనభూషి తోసి। ఇత్థంనిగద్య సుదృశావదనే ప్రియస్య నిశ్వస్య బాష్పలులితా నిహితా దృగంతాః॥

---

౧౦, --- సఖి నాయికరతిప్రీతివల్ల ఇతరులకు తెలియకుండ జేయుచమత్కారములను జూచి తానును అట్లింతలనేర్పగనిదానివలె నాయికను అడుగుచున్నది.

రాగము శంకరాభరణము - తాళము మిశ్రము.

ప॥ ఎంతసావధానమమ్మ - కోరులు - ఇందెవరు ముద్దుగుమ్మా -
అ॥ వింతలామొగవెలినవెబంగరుబొమ్మ - చెంతక్రీగోపాలసామియుండగనమ్మ
౧॥ ఉదయకాలమున నువిదరోపతులు - కుదురుగాను గూడి కూసేవేళలో
పదిలముగాగాచు పగడినీయలు చుట్టి - యదుటవేణ్ణివేయుం బనిదిప్పిపకచేవు.
౨॥ ఎమ్మెకానితో ఎలనాగరోసేవు - సమ్మతిగూడిన క్రమమేర్పకోర
తమ్మిపూబంతులతావితో గమ్మని - లేమ్మెరపికగతలు ప్రమోసేవు.
౩॥ క్రొత్తలామొగదెగోపాలుమనితో - చిత్తజుకేళిని జేసినవారయు?
బత్తితోనువానిబదలికదీర్పక - ముత్తెపుసరులెల్లమూలలో దాచేవు -

నాయిక ప్రౌఢ-రతిప్రీతి॥ ల॥ నిండుయౌవనముచే మదించినదిగాను మన్మథవ్యాపారపారంగతురాలుగాను ఉండునది ప్రౌఢానాయిక యనబడును. అది రతిలీలయందు నాయకాంగలీనవలె ప్రయత్నపడుచున్నది. క్రీడారంభములోనే ఆనందమూర్ఛను బొందును - ప్రౌఢానాయిక మానవ్యాపారముచే ముత్తెరువురైన ధీరాదిభేదములు గలది. నాయకుడుపతి॥ ల॥ ౧, చూ. రసము సంభోగశృంగారము॥ ల॥ ౨, చూ. సంచారిభావము ఔత్సుక్యము॥ ల॥ ఆసమొదలయినవానిచే కాలుగడుపను తాళలేకయుండుట ఔత్సుక్యమనబడును. ఇందు వేగముగనడచుట - పడకలోనుండిలేచుట - చింతించుట - శరీరము బరువగుట - మొదలైనవి గలుగును. అలంకారము యుక్తి॥ ల॥ రహస్యమును దాచుటకు జరిగిన పనులచేత ప్రియుని వంచించుట యుక్త్యలంకారమనబడును.

ర॥ శ్లో॥ సంస్పృశ్య స్తనమాతలయ్య వదనం సంశ్లిష్య కంఠస్థలం। నిష్పీడ్యాధరబింబమంబరమపాకృష్య వ్యుదస్యాలకం। దేవస్యాంబుజినీపతేస్సముదయం జిజ్ఞాసమానే ప్రియే। వామాక్షీవసనాంచలై శ్శ్రవణయోర్నీలోత్పలం నిహ్నుతే॥



౧౧,— సఖి నాయకుని విషయమునందు తనకుగల ఈర్ష్యాకోపమును బయలుపరచక నాయికచేయుచమత్కారములను జూచి ఆమెను అడుగుచున్నది-

రాగము సారంగ- తాళము మిశ్రమము-

ప॥ అలిగినావో లేక - ఆతడువచ్చినాడని-తెలియలేవో భామిని-

అ॥ కలికిరో నవ్వకు తెలుపవేయిట్లని - బళిబళి వేగ గోపాలస్వామిపైని.

౧॥ సరగునడువచ్చిన సమయమున సనులోన - పరసతులకు నెల్లబాగ పూజించేవే.
మరియాద నతడింపుమాటలాడినజాడ - తెలిగింప వినకనీవేమేమో పాడేవే.

౨॥ చెలువుడంపినట్టి చెలిరా గాపనిమాలి - బలిమి తిరిగెదవని కొట్టిదొంగగేవే.
కళవళించుచున్నది కాంతుడంపెనన- బలుకల్లాడెదవని తిట్టెదవేనీవే

౩॥ కనులకెదురుగా ఘనుడువచ్చినవేళ - వనితరో తలవంచి పత్రముచదివేవే
వనితనిన్నేలు గోపాలుడనుచునే - ననగానేమిపరిహాసమనేవే. అలిగి.

నాయిక ప్రౌఢ- ధీర॥ ల॥ కపటమానసయై అపరాధియగు నాయకునియందు ప్రేమతో రతివిషయములలో ఉపేక్షచేయునది ప్రగల్భాధీరయనబడును. నాయకుడుపతి-ధృష్టుడు ॥ ల ॥ ౩, చూ. రసము ఈర్ష్యామాన విప్రలంభశృంగారము॥ ల॥ ౬, చూ. సంచారీభావము అవహిత్థము॥ ల ॥ ౫, చూ. అలంకారము అనుమానము ॥ ల ॥ సాధ్యమును సాధనమాత్రముగా నూహించుట అనుమానాలంకారము అనబడును.

ర॥ శ్లో ॥ నో తల్పం భజసే న జల్పసి సుధాధారానుకారా గిరో దృక్పాతం కురుషే న నా పరిజనే కోపప్రకాశచ్ఛలాత్ । ఇత్థం కైతవకల్పితగౌరవయుతే కోపస్య సంగోపనం తత్స్యాదేవ న చేత్కుతస్స్పృహ చకోర్యేత సా చ స్మితమ్॥



౧౨,— గోపాలుడు అన్యాసక్తుడై యున్నాడని అతనితో వాదాడియీర్ష్యాకోపముచే కొట్టులాటలకు తలపడిననాయకినిజూచి, ఆమెసమాధానపడునట్లు సఖి చెప్పుచున్నది.

రాగము బిలహరి. తాళము మిశ్రము.

ప॥ చేమించరాదమ్మ - నీవీలాగు.

అ॥ ఏమందు గోపాలున్నెరుగవాకిలి రమ్మా - కామించి దానితోకలసెననుచు కోపమ్మా

౧॥ లోకనాథుని జోకతో పెండ్లాడి - ఏకాంతంబున నెత్తుకొనియాడి

ఆ కాంతను గూడెననుచు జేతువా మోడి - ఈ కారణమే మేమూ వేరవిడనాడి

౨॥ జలజాక్షి యాతనిజగమెల్లగొనియాడు - అలవానికి నీయవని నెవ్వరీడు,

బలుసంశయమికవలదె పీడుపీడు - నలుగురు నినుజూచి నవ్వెదరు గొ చూడు.

౩॥ ఎలమి కోపతాపమెవరికైన సురాదా - చెలిమైత్రి కానితో నేవేళను వాదా

వలదని స్నేలు గోపాలుదత దుగాదా - పలతీ నీకుపుణ్యాపాపము తెలియదా.

నాయిక ప్రౌఢ అధీర॥ ల॥ అపరాధియగు నాయకుని మిక్కిలి జెదరించి కొట్టునది ప్రగల్భ అధీరానాయికయనబడును. నాయకుడు పతి, ధృష్టుడు॥ ల॥ ౫, చూ. రసము ఈర్ష్యామానవిప్రలంభశృంగారము॥ ల॥ ౬, చూ. సంచారిభావము ఉగ్రత॥ ల॥ అపరాధము అవమానము - దొంగతనము - నిగ్రహము - అసత్ప్రలాపము - మొదలయిన వానిచే జేయబడిన త్వర ఉగ్రతయనబడును. అందు కన్నులు, ముఖము ఎఱ్ఱనౌట, బంధనము చేయుట, కొట్టుట, తలయాడించుట, చెమటపోయుట, బెదరించుట, మొదలయినవి కలుగును. అలంకారము స్వభావోక్తి ॥ల॥ ౮, చూ.

ర॥ శ్లో॥ ప్రతిఫలమనపేక్ష్యస్వీయమిందోః కలాయాం హరశిరసిపరస్యాశ్చావమాశంకమానా । గిరిశమచలకన్యాతర్జయామాసకంపప్రచలవలయవల్గత్కాంతిభాజాకరేణ॥



౧౩.— నాయిక తనసవతి యందు గోపాలుడు చేయు ప్రీతిజూచి ఓర్వలేక ఈర్ష్యామానముగలదై అతని నడతను చెలితో చెప్పుచున్నది.

రాగము అఠాణ - తాళము మిశ్రము.

ప॥ ఎవతె తాళునమ్మా - ఈనడతలు - ఏమందునే కొమ్మా -

అ॥ సవతియు గోపాలసామికెక్కు వేమి - పదెనావరెఅదియొక్క తెకలకాల॥ మెవతె॥

౧॥ కసిదాననునా పానుపుపై వాడు - ముసుగు పెట్టుక యొక్క మూలలో పవళించి

నిసివేళలో నలనీరజనేత్రతో - గుసగుసమని పలుకుకొని ముద్దులాడితే.

౨॥ అక్కరో నేవాని కాకుమదుపులియ్య - గ్రక్కున తామనా కన్నులకట్టి మూసి

ప్ర॥—టికి డెమువాబోటికోసగె మోవి - నొక్కియలదాని నోరుచూచిచూచి.

౩॥ రేపగలని తెలియలేకవారిద్దరు-ఈపదకింట నేకాపురమైయుండ

ఆపణతికిసుంత కోపముగలనాడు- గోపాలుండునను గూడవచ్చుచున్న ॥ ఎవతె॥

నాయిక- జ్యేష్ఠ-కనిష్ఠ॥ల॥ నాయకునికి ఎవతెయందు ప్రేమ అధికముగానుండునో ఆమె జ్యేష్ఠ యనంబడును. తక్కువ ప్రేమ యెవతెయందుండునో ఆమె కనిష్ఠ యనంబడును, నాయకుడు-పతి-శఠుడు॥ల॥ అనురాగముగల ప్రియకు గూఢముగ అహితము చేయువాడు శఠుడు అనబడును. రసము- ఈర్ష్యామానవిప్రలంభశృంగారము॥ల॥ ౬, చూ- సంపత్తి-విద్యా-శౌర్యము-మొదలగు హేతువులచే గుణమందు గూడ దోషారోపము చేయుట అసూయయనబడును. ఇందు, మోమును త్రిప్పుట-నిందించుట- భ్రూభేదము-ఉపేక్ష-ఇవి మొదలైన క్రియలు గలవు. అలంకారము స్వభావోక్తి॥ల॥ ౮, చూ-

శ్లో॥ [illegible] రుపరిగ్రహాగ్రహిళయా రేణీవృశోః ప్రీతయే రత్నద్వంద్వమ
నంతకాంతిరుచిరం ముష్టిద్వయేన స్థితా । ఏకస్యాః కలశాంతరే ప్రథమతో రత్నః
పరస్యాః ప్రియో హస్తాహస్తినిపాత్స్వ్యశకే కుచతటీమానందమావిందతి॥

---

౧౨,--- పరకీయమైన నాయిక తానాసపడిన నాయకుని చూచి, అతడు తన్ను మన్నించుటను బయలుపరచదగిన వ్యాపారములను ఉగ్గడించి యిట్లు చేయకుమని చెప్పుచున్నది-

రాగము మోహన-తాళము మిశ్రము.

ప॥ ఇల్లాలినిఇట్లు చెరుతురా- నన్నిక- నేలాగు మరతురా

అ॥ మల్లడి గోపాల- మనసిట్లుకరతురా- మాయ చేసి కొమ్మలవశపరతురా.

౧॥ గుంటకైన నేగుడికైన పోవగ-వెంటవెంట నేనీవు వెంబడించేవు-వద్దంటె క్రీగంట జూచేవు
నీ మోవియుగంటి చేసేవు- అంతలో నేసన్నంటవచ్చేవు-
ఒంటిగా నేనింటనుండగ తుంటతనమున దూరినాచను
లంటవద్దననంటితివి యు-త్తింటి కోడలనంటే వెరువక॥ ఇల్లాలి॥

౧॥ దిట్టమాయె నేనునట్టింట నిదురించి-నట్టివేళ నను ముట్టిచూచేవు
నే నెవరితె కట్టుకోనేవు-తిట్టిన నోరగట్టి మూసేవు-నాపైపు నతట్టివేదేవు
గట్టివాడవు-ఇట్లలను సనరట్టు సేయుచు-కట్టుకోకయు
ముట్టివిప్పుచు-నట్టేముద్దులు పెట్టి మోహము బుట్టిచేసితి॥ విల్లాలి॥

౨॥ తెలవకొనను పట్టిపగలు పుట్టిలిపిడి-తగునా గోపాలమగనాలగదర- చెక్కటగోరు
తగిలియున్నదిర- మోవిగాయమేవగగాచుదుర -అంతలో నీకునగవేమిపదర

నిగనిగమనే మొగమువాడెను సొగసుకన్నులుతొగరుమీరెను
మగనిముందరదిగులువడియేవగనుచేరగలనయ్యయ్యో॥ఇట్లాలి॥

నాయికపరకీయ॥ల॥ పరపురుషునియందుగల ఇచ్ఛావ్యాపారములను మఱుగుపఱచుటయందు దత్తచిత్తురాలై యున్ననాయిక పరకీయయనబడును. అది కన్యయనియు పరోఢయనియు ఇరుదెఱగులై యుండును. నాయకుడు ఉపపతి॥ల॥అన్యవనితను వివిధోపాయములచే నాసపఱిచి అనుభవించువతడు ఉపపతి యనబడును. రసముసంభోగశృంగారము॥ల॥ ౨, చూ- సంచారిభావముశంక॥ల॥ చౌర్యాపరాధాదులచేత తనకహితమును తేప్రేక్షించుటశంకయనబడును- ఇందుమాటిమాటికి పార్శ్వములను జూచుట, మోమువాడుట, ముసుగిడుట, వైవర్ణ్యము, కంఠగద్గదము, మొదలయిన చేష్టలు గలవు. అలంకారముస్వభావోక్తి॥ ల॥ ౮, చూ.

౮॥శ్లో॥ అయంరేవాకుంజః కుసుమశరసేవాసముచితస్సమీరోయం వేలావనకదళీజేలాపరిమళః। ఇతః ప్రావృధన్యానవజలదవిన్యాసచతురాపరాయత్తంచిత్తంసఖికిమపికర్తుంవ్యగయతే॥

---

౧౫, — గోపాలుడు తనయందు ఆత్యాసక్తురాలైయుండి అప్పుడు కార్యాంతరప్రసక్తివల్ల ఉపరిప్లవరాలైయుండెడునాయికనుజూచి, ఆపె తనవిషయమునందు చేసిన ప్రియములనుతలచి అతిమోహముతో చెప్పుచున్నాడు.

రాగము భైరవి-తాళముమిశ్రము.

ప॥ ఈలాగునన్నెడబాయతగునటవే- ఎంతమనసుదిటవే-
అ॥ బాళితోగోపాలాయనినాతోబలుకవే - పలుకులోపముమానవే- గట్టిదానవే
౧॥ విరులువాసనవలె-నిరువురమొక్కటై - మెలగుచునుంటిమిగా
అరనిమిషమొక్కరినొకరుచూడకున్న - నార్తిసైంపకపోముగా-ఇట్లుండగా.
౨॥ ఒక్కనాడునీవు-ఓయ్యారముగావచ్చి-ఓరోరియనిపిల్వగా
చక్కెరకెమ్మోవియానికౌగిలించి- చొక్కుచుచొక్కింపవా-నవ్వుకొనేవా.
౩॥ కొన్నమగడునీవే వేణుగోపాలయనిమ్రొక్కి - నన్నుమెచ్చినలలనా
ఎన్నోపరిహాసములనవ్వులకేళి - లన్నిమరవవచ్చునా- ఈసమయాన.
నాయికపరకీయ॥ల॥ ౧౮, చూ- నాయకుడుఉపపతి॥ల॥ ౧౮ చూ-

రసము ఈర్ష్యామానవిప్రలంభశృంగారము॥ ల॥ ౬, చూ. సంచారిభావము ఉగ్రత॥ ల॥ ౧౨, చూ. అలంకారము స్వభావోక్తి॥ల॥ ౪, చూ.



౧౬, —గోపాలుడుతనజారవ్యాపారమును తెలిసికొన్ననాయకిని జేరి అనునయింపగా ఆనాయకి ఈర్ష్యాకోపముతో చెప్పుచున్నది. ఇదినాయికానాయకులయుక్తి ప్రత్యుక్తిరూపము.

రాగము నీలాంబరి-తాళముమిశ్రము.

ప॥ తరుణిరోనిన్నేకోరిననాపై - దయలేకకోపతాపాలా

అ॥ హరిహరిదక్షిణనాథా-ఎరుగను-ఆయాసపడకుగోపాలా.

౧॥ పరకాంతలకన్నెత్తిచూడనినా - వద్దనెకోపతాపాలా
తనపుననూకలు బాసినవారనే - నెప్పరు తెల్పుముగోపాలా.

౨॥ నేనిప్పుడొంటిగవచ్చేజెడితే - నెనయకోపతాపాలా.
శ్రీనివాసయిప్పుడిదినిజమేనా - పైనేరముగోపాలా.

౩. వంచనవిడిచినీవించుకైననెన - రుంచకకోపతాపాలా.
మంచివేళజగద్వంచకుడెవరు - ప్ర - పంచంబునగోపాలా.

౪॥ వనితరోపరహింసయుజూచిపరితా - పములేకకోపతాపాలా.
ఫణిపతిశయనాదయయుందరికి-నీ - వలెగల్గునాగోపాలా.

నాయికపరకీయ॥ ల ॥ ౧౪, చూ. నాయకుడుఉపపతి॥ల॥ ౧౪, చూ, రసము ఈర్ష్యామానవిప్రలంభశృంగారము॥ ల ॥ ౬, చూ. సంచారిభావముఅవహిత్థము॥ ల॥ ౫, చూ. అలంకారము- స్తుతినింద॥ల॥ నిందావ్యాజముచేతస్తుతిచేయబడునది స్తుతినిందాలంకారము.



౧౭. --- నాయికతనకును గోపాలునకునువచ్చిన అపవాదమును తొలగించుకొందలచి అతిపరిశుద్ధురాలివలెచెలితో చెప్పుచున్నది.

రాగము కాంభోజి. తాళముమిశ్రము.

ప॥ అన్యాయముగనేనష్టమాడుపాతైతే - అతివరోయేమందునే.

అ॥ మన్నారురాజగోపాలసామికినాకు - కద్దనిపలికేరు.

౧॥ ఆదరముడుప్రీతిచేసిపిల్వగను- రోసముచూపితినే

మా సీమలోనిదిమరియాదకాదని - వేసారి మ్రొక్కితినే
దోసమెన్నకపలుకు మోసకత్తెలుగేలి - చేసేరేమందునే
ఆపదిరనేననుభరించక ఈయయ్యరో శ్రీసభాపతినన్నుసాకెరక్రీరిగాల॥

౨॥ ఆటపాటలకైయాతనితోనేను - మాటలాడినందుకా
బోటులకెదుట నీప్రొద్దువానింటికి - పోయివచ్చినందుకా
సూటిగానువానిచూచినవ్వేయల - పాటుచేసినందుకా
ఏటికేయీగేలియే పాపమెరుగనే - తాటిక్రింద పాలుత్రాగినచందానన్॥ ఆన్యా॥

౩॥ ఏకపైగోపాలుడైనయవచ్చెదనంటె - నీకిదితగదంటినే
కోకలెత్తినట్టికొంటెతనముచూప - రాకుపోపొమ్మంటినే
ఈ కారణమేమే యిదితెలియవట్టి - పోకిళ్లచేకొంటినే
లోకమునమాయనుమాటుడుగలదటె - చాకివాడువృథాదానికినట్లు ॥అ॥

నాయికపరకీయ-వృత్తసురతగోపన॥ల॥౧౮, చూ. నాయకుడుఉపపతి॥ల॥౧౮, చూ. సంచారిభావమువితర్కము॥ల॥ సందేహము-నిశ్చయము మొదలైనవానిచేతకలుగు ఊహాత్మకసత్యాసత్యనిర్ణయము వితర్కమనబడును. దీనియందుకనుబొమలెగరవేయుట-తలయాడించుట - మొదలయినయనుభావములుగలుగును. అలంకారముధర్మలుప్తోప॥ల॥౬, చూ.

౭॥ శ్లో॥ శ్వశ్రూః క్రుధ్యతుబిద్విషస్తనుహృదోనిందంతువాయాతర స్తస్మిన్కాకింతునమందిరేసఖిపునస్స్వప్నేపివిధేయామయా। ఆకోరాక్రమణాయకోణకుహరాదుత్ఫాలమాతన్వతీమార్జారీనఖరైఃఖరైః కృతవతీకాంకాంనమేదుర్దశాం॥



౧౫, --- నాయిక త్రోవనుపోవు బాటసారినిజూచి వలచి స్వాభిప్రాయము తెలియబడునట్లుభావగర్భములయిన మాటలచేత లోకోక్తిగా అతనికిహితముచెప్పిదోకివానివలె చమత్కారముగా జెప్పుచున్నది.

రాగము బిలహరి- తాళము మిశ్రము.

ప॥ ఈలాగుపాంథుడనీవుఒంటిగాను - ఇక్కడెచ్చటికేగేవు- వేగను
అ॥ మేలుపయోధరములుచేరియెదుటను- మెలయగగోపాలహరియెమచేను
వెంనుండేడిగుడిచాటుజేరక - శ్రమమునీకనుభవింపగకోరక

మంతయాతరవున జూచియుయునని లువక-ఎంతసుఖము జేయు నీకొమ్మ యను॥ కోక॥

౨॥ నీవుకట్టుకోకనిటుబాళియుంచక- నీవేళభూసురహితముమాటవినక

శ్రోవనడుచుటకుతోడెవ్వరుచులేక- ఈవగముందువెనుకయోచింపక

౩॥ ఎవ్వరిందునానెవుగనట్టితావు- జవ్వానినన్నొక్కతేనిందుగనినావు

అవ్వలనైననిందునిలువలేవు- హరిహరి గోపాల - వీలభ్రమసేవు.

నాయిక-పరకీయ-వాగ్విదగ్ధ ల॥౧౪,చూ. నాయకుడు-ఉపపతి॥ల॥౧౪,చూ.
రసము సంభోగశృంగారము॥ల॥౨,చూ. సంచారిభావము అవహిత్థము॥ల॥౫,చూ.
అలంకారము సమాసోక్తి॥ల॥౯,చూ.

ర॥ శ్లో॥ నిబిడతరతమాలవల్లి కస్త్రీంచిత్రిత రాజనిచారిణీజనోపకంఠే। పథికసముచిత స్తవాతిథిస్సే నవితరితత్పరిత్రకేనివాసః॥



౧౯:-- నాయిక గోపాలుని జూచి ఆతనివల్ల తనకు సంభవించినతత్కాలస్థితిని ఆతని తోచమత్కారముగ తెలియజేయుచున్నది.

రాగము కల్యాణి-తాళము మిశ్రము.

ప॥ బాలుడవనినిన్నుచాలముద్దులాడి- ఫలమిదికైకొంటిరా.

అ॥ మేలైనరాజగోపాలసామినీవే- వేళతల్లిచను బాలుద్రాగగానే.

౧॥ చాచిచాచియున్ననీచెయిసోకిన- చూచుకములు మాడ జూడనెట్లనమ్మే

నాచెట్టపట్టుకనడవనేర్చుకొన్న- ఆచాయనా నడయుతిన్ననమ్మే.

౨॥ నిన్నునిదురబుచ్చలేయొద్దబండించి కన్నులకే వేళకనునిదురయుజూడ్టై

మన్నుదిన్ననీమోమున మరముద్దులుబెట్టి- మన్నునరుచిప్రబ్లైఅన్నముపోగొట్టె.

౩॥ చిన్నవయసుదాననిన్ను నెత్తుకోని-కన్నతావులెల్లనిన్నాళ్లతిరిగితినా

నన్నుమైనకటితిన్నగబలుదయ్యో- కన్నెలపలచేవునన్నారుగోపాలా.

నాయిక పరకీయ-వాగ్విదగ్ధ॥ ల॥౧౪,చూ. నాయకుడు ఉపపతి॥ల॥౧౪,చూ.

రసము సంభోగశృంగారము॥ల॥౨,చూ- సంచారిభావము అవహిత్థము॥ల॥౫,చూ.
అలంకారము-అసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష॥ల॥ వస్తువుకలుగుటచేత గాని హేతువుకలుగుట చేత గాని ఫలముకలుగుటచేత గాని విచారింపబడునది యుత్ప్రేక్షాలంకారము. అందు అసిద్ధమయినవిషయమునకు హేతువుగా గలది అసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష.



పరులు రాసైపూయపలికెన నోర్వడే - ప్రాణనాథునికేపణతి మెచ్చరిదే॥ వా॥

౩॥ నాయనసైరిగించలి నాటుడతడే - భూమిని అకలంకముగ వెల్గుచంద్రుడే-

కాముకేళి నన్ను గరగించు ధీరుడే - కోమలి శ్రీరాజగోపాలదేవుడే॥ వా॥

నాయిక స్వీయ ప్రౌఢ - స్వాధీనపతిక॥ల॥ నాయకుని చేనెల్లప్పుడు సంతోషపరపబడునది స్వాధీనపతిక. దీనివ్యాపారములు మన్మథపూజామహోత్సవము మొదలయినవియును వనవిహారము జలక్రీడ ప్రసూనాపచయము మొదలయినవియును అగును. నాయకుడు పతి- అనుకూలుడు॥ ల॥ ఇతర స్త్రీలను జూచుట మొదలైన వ్యాపారములు లేనివాడును స్వస్త్రీయందే ప్రేమగలవాడునై యుండువాడు అనుకూలుడు అనబరగును- రసము సంభోగశృంగారము॥ల॥ ౨, చూ. సంచారిభావము ధృతి॥ ల ॥ ౧, చూ. అలంకారము స్వభావోక్తి॥ ల॥ ౧, చూ.

ఉ॥ శ్లో॥ వక్త్రశ్రీస్తు మృగాక్షి పల్లవచయస్య వచసాం లాస్యస్య హాస్యస్య వా ధన్యానా మరవిందమందరదృశాం తాంత స్తనోతిస్తుతిమ్ । స్వప్నేవాపి నగచ్ఛతి శ్రుతిపథం చేతఃపథం దృక్పథం తాపస్యాన్యదయితస్య మే సఖి కథం తస్యాస్తు భేదగ్రహః॥

---

౩౩,— గోపాలుడును నాయికయు ఒకరిపైనొకరు కోపించుకొనియుండి దూతీముఖమున సమాధానపడి సవిస్మితి ఆదూతిక గోపాలునిజూచి అడుగుచున్నది.

రాగము శహన - తాళము మిశ్రము-

ప॥ కోపముదీరెనా - ఇద్దరికిని - కోపముదీరెనా.

అ॥ గోపాలనీవేమును వేడపలసెనా - కోమలాంగివేడెనా - ఎటులైన.

౧॥ చల్లగబలుకుచుచక్కెరకెమ్మోవి - చప్పరించుకొంటిరా-

ఉల్లమురంజిల్ల కౌగిలించిముద్దు - లుంచుచుచొక్కితిరా-బళిబళిరా॥కో॥

౨॥ మనముకరగిచాల పచ్చిపచ్చిగా - మాటలాడుకొంటిరా-

మునుపటివలెనే యొకరికొకరు ప్రేమ - పూనిమెచ్చుకొంటిరా-చక్కనిదొర॥

౩॥ విరులపాన్పుమీద వెలదియునీవును - సరసముగాడితిరా-

హరిగోపాలవేనముమానిబ్ర - ఆనందమొందితిరా-నవ్వకుతేరా॥కో॥

నాయిక స్వీయ - ప్రౌఢ- స్వాధీనపతిక॥ల॥౩౨,చూ. నాయకుడు అనుకూలుడు॥ల॥౩౨,చూ. రసము సంభోగశృంగారము॥ల॥౨, చూ. సంచారిభావము ధృతి॥ల॥౧,చూ. అలంకారము స్వభావోక్తి॥ల॥౧,చూ.

౩౪.— గోపాలునివద్దకు నాయికచే పంపబడిన చెలి అతనిజూచి నాయికయొక్క స్థితిని చెప్పుచున్నది.

రాగము శంకరాభరణము — తాళము మిశ్రము.

ప॥ దారిజూచుచున్నది — నీమఱ్ఱదా — తరళాక్షియా చిన్నది—

అ॥ వారిజముఖినీవు వచ్చువేళనుకొని — కోరికతో రాజగోపాలసామిరో॥ దారి॥

౧॥ వెన్నెలగాయగ వేడ్కమీఱమించి — సన్నజాజివిరిసరులనుగంధము—
పన్నీరుచెంబులుపడకింటిలోనుంచి — వన్నెలాడితలవాకిటనిలిచెనే॥ దారి॥

౨॥ ఏవగనైనను ఎందుచప్పుడైన — నీవోయనియెంచి నిలిచిలేచిజూచి—
ఈవగచిత్రము నిచటనిలిపినట్టి — భావంబెవరికిబయలుగానీకనే॥ దారి॥

౩॥ వచ్చివచ్చిగా పదములుపాడుచు — వచ్చిరాజగోపాలసామినీవు—
ముచ్చటలాడుచుముద్దులుపెట్టుచు — గ్రుచ్చికౌగిటజేర్చుకొనుటదలచెనే॥ దా॥

నాయిక స్వీయ— మధ్య— వాసకసజ్జిక॥ ల॥ ప్రియుడు వచ్చెడిసమయమందు తాన లంకరించుకొని కేళీగృహము నలంకరించి సిద్ధముగానుండునది వాసకసజ్జిక. దీనివ్యాపారములు నాయకునిసంసర్గ మనోభీష్టమును యోచించుట, సఖులతోడ వినోదముసల్పుట అద్దము[illegible]గుననకు దూతికను సాభిప్రాయముగ జూచుట, నాయకుడువచ్చెడిదారిని జూచుట మొదలయినవి. నాయకుడు పతి-అనుకూలుడు॥ ల॥ ౩౭, చూ. రసము సంభోగశృంగారము॥ ల॥ ౨ చూ. సంచారిభావము మదము॥ ల॥ మద్యము మొదలయినవానిచేగలుగు ఆనందసమ్మోహములయొక్క సంభేదము మదము. ఆమదము తరుణమదమనియు మధ్యమమదమనియు అపకృష్టమదమనియు మూడువిధములు. అలంకారము స్వభావోక్తి॥ ల॥ ౭, చూ.

ఉ॥ శ్లో॥ తల్పం దర్పయతి త్వలంకరోతి చతుష్కాత్కల్హారహారస్రజం చిత్రస్రోతసి కైరవేణ కిమపి ద్వారం ముహుర్వీక్షతే। గృహ్ణాత్యాభరణం నవం సహచరీ హేమాదిభిర్మోహితా త్తం పద్మన్యతః ప్రతీత్యచతతం స్త్రీరాణనోభూత్స్వరః॥

---

౩౫.— గోపాలునితో నాయికయొక్క పొంతచెలి నాయికయొక్క విరహావస్థను చెప్పుచున్నది

రాగము సావేరి — తాళము మిశ్రము.

ప॥ ఏమిపల్కదాయెగా నీతరుణియు — నిక్కిసమయమునను—

అ॥ కోమలికో రాజగోపాలసామియు — ఏమోకో రాదాయెనే అనుచునైన॥ ఏమి॥

౧॥ నిగనిగమెరసే మొగముచిన్నబోయెను — బంగరైనదేహము నగము చిక్కెను

౩౯,— నాయిక తనకును గోపాలునకును వాగ్వాదముజరిగి అందుమీద ఆతడు కోపించు కొనిపోగామఃఖాక్రాంతురాలైతన్నుతాను నిందించుకొనుచు చెలితో చెప్పుచున్నది.

రాగము ఘంటా — తాళము మిశ్రము.

ప॥ ఇంతిరో నేజేసిన పాపమే — ఇట్లాయెనునిజమే.

అ॥ చెంతనున్నట్టి శ్రీగోపాలస్వామే • పంతమాడియెడబాసెనుచూడేమే॥

౧॥ చిన్ననాడెవానితో చేసిన చెలిమి — శిరశివాయిపుడాతలచేమి.
ఎన్నాళ్లకైన యీవ్యసనమారదుసుమీ — ఏమోవచెలి ఇకనువ్యసనమేమి॥

౨॥ నెలతతోమాటాడవద్దంటేకోపమా — నేననరానిదివానికిభయమా.
అలిగినేనొకమాటన్నదేనేపమా — ఆలిథీరుడునే సతీనల్లవశమా॥ఇంతి॥

౩॥ వలచితానేవచ్చునా గోపాలుడు — వాడేలవచ్చునేదక్షిణనాథుడు.
వలదనినేవేడినవచ్చినముగాడు — వనితరోయాతనిముఖమేమేపడుపడు॥ఇంతి॥

నాయిక స్వీయ-ప్రౌఢ- కలహాంతరిత॥ల॥ ౩౮, చూ. నాయకుడు పతి. శఠుడు॥ ల॥౧౩,చూ- రసము ప్రణయమానవిప్రలంభశృంగారము॥ల॥౩౮,చూ. సంచారిభావము చింత॥ల॥ ప్రియవసువులులభించనందువలన ఐశ్వర్యభ్రంశనము మొదలయిన వానిచేగలుగుధ్యానము చింతయనబడును. ఇందుమేనుచిక్కుట తేలవంపు సంతాపము నిట్టూర్పు మొదలైనవికలుగును. అలంకారము వివాదము॥ల॥తనచేతచెప్పబడినదానికివిరోధవిచారమువలనగలుగునదివివాదాలంకారమనబడును. వాడుగారాడునేమపోయివేడినవచ్చును అదియెట్లుపొసగును అనునిట్టివిచారముచే నివివితర్కముగానియును చెప్పవచ్చును.

ల॥ శ్లో॥ ఆకరోతిమదువేత్రశోణితమానంతిముకార్శ్యకరపల్లవావిరోధమ్ । కలహం కిమథాక్రుధారసశ్లేషితచర్ణంనవిదంతిదైవదష్టాః॥

---

౪౦,— నాయిక నాయకుని విరసపరిచి ఆతడు కోపించుకొనివెళ్లిపోయినపిదప తన్నుదానునిందించుకొనుచుచెలినిజాడియతని గుణములనుచెప్పుచున్నది.

రాగము సౌరాష్ట్రము — తాళము మిశ్రము.

ప॥ వానిదూరవేలే — ఇదివావేళగుణంబనకే.

అ॥ మానవేరాజగోపాలస్వామి — ఇటులేవాడలిగెనెనగనే అటువంటి॥వాని॥

౧॥ ఒట్టుపెట్టివాపొమ్మనినపోవనట్టివాని — నన్నంటవలసినంత అట్టేటేపోయె.
అకటాయాతడు అలిగియుండగాను-నాకిథి ఇటులుండె ననకధీరుడైన॥ వాని॥

౨॥ నామాటమీరకనడచుకొన్నవాడు — ఈమాటకెయొకింపించియుండుపోకయుంకే.

ఏమనవశమె మెయెమ్మై కానినా - నోముఫలంబనిమనః కసవయుడా॥ వా॥

౩॥ నాపాపముపైకాపురమహారాజ - గోపాలయీవేళకోపమేలనని-

చేపట్టుకొనబలిమిచేవదలటుపోతే - నాపాపమిట్లుండెననకనన్నేలిన॥ వా॥

నాయిక స్వీయ-ప్రౌఢ-కలహాంతరిత- ఉత్తమ॥ ల॥ నాయకుడు అహితము చేయుచుండగా నతనికిప్రియముగా ఏపెనడచుచున్నదో, అపరాధియగువల్లభునిజూచి ఏపె ఈ రకయున్నదో ఆపె ఉత్తమనాయిక. నాయకుడు శఠుడు ల॥ ౧౩, చూ. రసము ప్రణయమానవిప్రలంభశృంగారము॥ ల॥ ౩౮, చూ. సంచారిభావముచింత॥ ల॥ ౩౯, చూ. అలంకారము స్వభావోక్తి॥ ల॥ ౮, చూ.

---

౪౧,— దేశాంతరగతుడైననాయకుని [illegible] నాయకిని చెలిచూచి ఆపెపడునవస్థను ఇంకొకచెలికత్తెతో చెప్పుచున్నది.

రాగము శహన - తాళము మిశ్రము.

ప॥ ఏమందునేకోనమ్మా - దీనివెతలెట్లుతీరునమ్మా-

అ॥ కోమలిశ్రీరాజగోపాలునెడబాసి - రామరామయినాళ్లకామినిరాళునా॥ ఏ॥

౧॥ పన్నీటతడిసేపణతిపయ్యెదకొంగుకన్నీటతడిసెనుగా-

మిన్నగమెరసేమెలత చక్కనిమేను సన్నమైపోలెనుగా-

వన్నెమీరినట్టి వదనపుమోము చిన్నబోయినదిగా -

వెన్నెలనాడే వెలదిచందురుని కన్నెత్తిచూడదుగా - విరహాంతమెగా॥ ఏమందు॥

౨॥ పరిహాసములెన్నో పలికేచతురకు పలుకసహింపదాయెగా-

విరులపైపవళించి పొరలేసుకుమారి - ధరనుబవ్వళించెగా-

చిరుతలవలెనేచెలగేసరసికి చిరునవ్వుకరవాయెగా -

సరిగంచుకట్టుసౌందర్యవతి పాత చలువకోకగట్టెగా- జడలుపట్టెగా॥ ఏ॥

౩॥ పాలుగారుదనిబంగారుచెక్కిళ్లు బలుతెల్లనైనవిగా-

మేలైనసంగీతలోలకుసంతాపమీలాగుకలిగెనుగా-

చాలసొమ్ములుపెట్టుచానముక్కుపోగు చాలుచాలుననెగా-

బాలగోపాలునుబాగతానుమనసలి- ఏలినవాడనెగా-మైమరచెగా॥ ఏమందు॥

నాయిక స్వీయ- ప్రౌఢ - ప్రోషితభర్తృక॥ ల॥ నాయకుడు దేశాంతరమునకు వెండి యున్నప్పుడు ఖేదపడుచుండునది ప్రోషితభర్తృక- దీనివ్యాపారములు నిదురలేక యుండుట కృశించుట ప్రియుడెన్నాళ్లకు వచ్చునని శకునములుచూచుట మలినయై యుం

రానేలనే వారమణి వానికే-కానీక చేయును తానే చేసినదట ॥౫౦

ఈపదమందు మొదటిచరణమున అన్యప్రదర్శనమువల్లబుట్టిన లఘుమానము - రెండవచరణమున అన్యానామగ్రహణమువల్లగలిగిన మధ్యమానము - మూడవచరణము అన్యాసంభోగచిహ్నము చేగలిగిన గురుమానము-

నాయిక స్వీయ-ప్రౌఢ- ఖండిత॥ల॥ ౩౭,చూ. నాయకుడు శఠ-ధృష్టుడు ల"౬ చూ. రసము ఈర్ష్యామాన విప్రలంభశృంగారము॥ల॥౬,చూ. సంచారిభావము అసూయ ల॥౭,చూ. అలంకారము వ్యాజోక్తి॥ ల॥ అన్యహేతువునుగల్పించి చెప్పుటచేత స్వభావమును కప్పుట వ్యాజోక్తి అలంకారము,

---

౫౧, — గోపాలుడు చేయు చమత్కారములను జూచి శంకించినదైన నాయికయతని నడుగుచున్నది.

రాగము శంకరాభరణము- తాళము మిశ్రము.

ప॥ ఇప్పుడు ఈలాగు చేసిచాలమల్లే ప్రేటిపలెగూడనేల·

అ॥ అప్పప్పనీమాయలెల్లనుగోపాల-ఒప్పగించజాల-దే · కేజాల ॥ఇ॥

౧॥ చప్పుడు నే యెకసేపటిల్లునే-చేరవచ్చితిగదరా-
అప్పుడుకీసము లేక యున్న చేతు-లేలబట్టితివిరా-
ఉప్పొంగుచు నీమోవియానిముద్దు-లుంచనేచపదరా-
తెప్పునీముద్దుమోము అవలికి -త్రిప్పుకొంటివేలరా-జారచోర ॥ఇ॥

౨॥ పోడిమిగానీవునాకరదలసుదుక్వా-ఈడకొప్పపెట్టగా-
వామకగలవారివలె నేచీకటి- వేళపిరులుపట్టగా
ఈకులేనినాలేవొడపిసదుల-నింపుగానుబట్టగా
వేడుకగానినుకౌగిలించపోతే-విదలించుకొంటివిగా-నీకిదిబాగా ॥ఇ॥

౩॥ సదయుడైనయట్టి చక్రినిగోపాల- సామినీచెయిసోక-
అదరేను మోవియు చెదరెను రవికయు- వదలెను నాకోక
పదరేది చెలులకుమరియాదకాదని-వలపునణచుకోక-
మదనజనకనేనైపైకొనవచ్చితే-పరుగెత్తితివిగనక-సిగ్గులేక ॥ఇ॥

నాయిక స్వీయ-మధ్య-ఖండిత॥ ల॥౧-౫-౩౭,చూ. నాయకుడుపతిశఠుడు॥ల॥౨౮,చూ. రసము ఈర్ష్యామాన విప్రలంభశృంగారము॥ల॥౬,చూ. సంచారిభావము అసూయ॥ల॥ ౭ చూ. అలంకారము స్వభావోక్తి॥ల॥౮,చూ.